

తప్పక చూడండి!













దర్శకత్వం
T. కృష్ణ B.A.,
సంగీతం
K V. మహదేవన్
నిర్మాతలు
C వెంకురెడ్డి-A. రామిరెడ్డి



విజయవర్ధన్ మూవీస్



ఉపాయంలో అపాయం

పూర్ణా రిలీజ్

## ముఖచిత్రం

25–8–67వ తేదీ 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' "సౌదామిని" ముఖచిత్రం చూసి చాల బాధవిపించింది.

పుల్లాటి శాంతశీలబాబు, (నిజామాబాద్.)

* * *

25–8–67 సంచిక అట్టమీద బొమ్మగా ప్రచురించిన జయలలిత బొమ్మను చూసి మా బామ్మ "హవ్వ" అని నోరు నొక్కుకుంది. కలి కాలం అని ఒకసారి తలదించి వాపోయింది.

— బుచ్చిబ్బాయి (మెలుపాక)

* * *

ఈవారం ముఖచిత్రం (విజయ నిర్మల)పత్రికకు ఎంతో నిండుదనాన్నిచ్చింది. మా పాఠకులకు ఆనందాన్ని చేకూర్చినది.

కొక్కిరాల విజయకుమార్ (రాజమండ్రి)

## సీరియల్

ప్రతివారము పత్రికా రాగానే సీరియల్సు చదవడము నా అలవాటు. మట్టిబొమ్మలు సీరియల్ కథబాగ వ్రాశారు. అందులో శారద పాత్ర నాకు బాగా నచ్చింది. వూరి వాతావరణము, ఎన్నికల పట్ల ఉన్న పార్టీల మనోభిప్రాయాలు బాగా వ్రాసారు. 28–7–67 పత్రికలో తిరుగులేని నిశ్చయము కథ చాలా బాగుంది.

పానాల భీమా చారి (హైదరాబాదు–1)

# ఉత్తరాలు

## లోకంపోకడ

ది 25–8–1967 సంచికలోని లోకంపోకడ శీర్షికలో ప్రచురించిన విషయం యొక్క నిజాయితీని శంకిస్తూ, దానియొక్క వాస్తవాన్ని తెలియజేయవలసి దిగా కోరుతున్నాను ఆ వార్తను చదివాక నేను ఈ క్రిందివిధముగా ఆలోచించి కేవలం వినోదార్థమై అది ప్రచురింపబడిందేమో అనిపిస్తోంది:—

1 మన రాజధానికి విదేశీ ప్రముఖులు వచ్చినప్పుడు రాజవీధులలో మాత్రమే వారి ప్రయాణం కొనసాగుతుంది. మనదేశంలోని ప్రధాన నగరాల్లోని ముఖ్య వీధులను పట్టపగలు "గొంతు కూర్చొని" మలవిసర్జనావస్థలో వుండేటంతటి హీనస్థితిలో మన భారతీయులు లేరు.

2. విదేశీ ప్రముఖులు వచ్చినప్పుడు సాధారణంగ మన ప్రధాన నగరాల్లో మాత్రమే వారి "టూర్ ప్రోగ్రామ్‌లు" వుంటవి. అట్టివారు వచ్చు సందర్భముగా వారు ప్రయాణించే వీధులన్నీ ప్రేక్షక సమూహముతో నిండి వుంటవి. ఆ సమయంలో కొందర్ని "గొంతు కూర్చొను" అవస్థలో చూడటమనునది అవాస్తవము.

3. విమానాశ్రయం నుండి వచ్చు త్రోవలో కూడ రోడ్డు పొడుగునా అనేకమంది ప్రజలు హర్షధ్వానాలతో బారులు తీర్చి నిలబడగ కొంతమంది "సందర్భ" మెరుగక అట్లాంటి హీనస్థితికి ఎట్లా పాల్పడుతారు పైగా మన దేశమునకు శ్రీ బుల్గానిక్, శ్రీ కృశ్చేవ్‌లు వచ్చినప్పుడు అంతకుముందు ఎవ్వరికీ ఇవ్వనంత బ్రహ్మాండమయిన స్వాగత సన్నాహాలు మనవారు ఏర్పాటు చేసినారు. అట్లాంటప్పుడు ఒకచోట అప్రతిష్ఠాకరమయిన పనులు జరుగుచుండగా పోలీసులు, తదితరులు చూస్తూ వూరుకొంటారా? ఒకవేళ వారు చూడకపోయి అసంఖ్యాక ప్రజానీకము బారులు తీర్చి, రోడ్డుప్రక్క నిలబడగా (వారి వెనుక నెక్కడో దూరముగా జరిగిందనుకుందాము) వారిని తప్పించుకుని ఆ దృశ్యము రష్యన్ అధికారులకు మాత్రమే ఎట్లా కనిపించింది

4 జవహర్లాల్ నెహ్రూ రష్యా వెళ్లినప్పుడు మనదేశపు శిరంబారి కూడ అక్కడ అదేపని చేస్తూండగా కనిపించాడనటం కూడ వాస్తవ దూరమని పై విషయాల్ని దృష్టిలో నుంచుకొని ఆలోచించగా అనిపిస్తుంది. అదియుముగాక తనదేశపు ప్రధాని వచ్చు సందర్భముగా స్వాగత సన్నాహంలో విమానాశ్రయమునకు హాజరవకుండ, "అభివృద్ధి చెందిన" దేశములోని "ఒకదరి ప్రక్కన" మన రాయబారి మలవిసర్జనావసరముగా కూర్చొని వున్నాడని వ్రాయటం వాస్తవదూరం. కేవలం

హాస్యానికి వ్రాసినప్పటికీ అది మనదేశములోని పత్రికా స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగపరచటమే.

— బొమ్మ సత్యనారాయణరావ్ (పెలక్ల్లు)

* * *

మీరు మీ వారపత్రిక "ఆంధ్రసచిత్రవారపత్రిక" తేదీ 25—8—67" ప్రకటించిన "లోకం పోకడ" అన్న శీర్షికలో సోవియట్ మాజీ ప్రధాని శ్రీ కృశ్చేవ్ వెలుబుచ్చిన అభిప్రాయ వాక్యాలు నిజమా, కాదా అన్న అనుమానం మాలో కలుగ జేసింది ఇది నిజమే అయిన సందర్భంలో మన దినపత్రికలు ఆరోజులలో (సోవియట్ మాజీ ప్రధాని పర్యటన సమయంలోకాని, లేక వెనువెంటనేకాని) తమ ప్రతులలో ఎందుకు యీ సంఘటన ప్రచురించలేదో తెలియజేయుగలరా? ఈ విషయంలో (మనదేశం గురించి తక్కువజేసి మాట్లాడినప్పుడు) మన శాసనసభలలో వుండే ప్రజాప్రతినిధులు స్తబ్దుగా వుండడానికి కారణం ఏమిటి? ఒకదేశానికి సంబంధించిన అత్యున్నత స్థానములో వుండే ఒకవ్యక్తి మనదేశానికి స్నేహపూర్వపూర్వక సందర్శనానికి వచ్చినప్పుడు, అట్లాంటి దృశ్యాలు (అందులోను ఢిల్లీలాంటి ముఖ్య పట్టణాలలో) వారి కంటపడేందుకు మన పోలీసుశాఖవారు అవకాశం ఇస్తారా పోగా ఆ వచ్చిన వారు తమ అభిప్రాయం అనౌచిత్యంగా వెలిబుచ్చుతారా!

హెచ్ సూర్యప్రకాశరావు, (హైదరాబాద్—4)

### కథలు

మూడు వారాలుగా ప్రచురింపబడిన సింగరాజు రామచంద్రమూర్తిగారు వ్రాసిన పరివృతం చలా వాస్తవంగా వున్నది. నిజంగా కథ చదువుతున్నంత సేపు, నన్ను మైమరపించింది ఇందిర ధైర్య సాహసాలను, మళ్ళీ మళ్ళీ చదవాలనిపించేది. కథ ముగిసిన తర్వాత అప్పుడే అయిపోయినదే ఇందిర వెళ్ళిన తర్వాత కూడా ఏమైనది చదివితే బాగుండు ననిపించింది. కథ మొత్తంమీద చాలా బాగుంది. ఈలాంటి కథలు ప్రచురించిన మీకు, రచయితగారికి మా హృదయపూర్వకాభివందనాలు

పి. విశాలక్ష్మి (మీనవల్లూరు)

* * *

నేను ఎప్పుడోకాని కథలు చదువను కానీ ప్రతివారం సచిత్రవారపత్రికను తిరుగవేయుటం అలవాటు అలాగే 25-8-67 నాటి వారపత్రిక తిరగవేయడంతో సింగరాజు రామచంద్రమూర్తి గారిచే రచింపబడిన "పరివృతం" గమనించడం చదవడం అన్నీ జరిగిపోయాయి అంతే తరువాత వారపత్రిక కోసం ఎదురు చూశాను ఈ దినవే వచ్చింది చదివాను. ఎంతో ఆనందన్ని పొందాను మీ పత్రికద్వారా రచయితకు నా హృదయపూర్వక ధన్యవాదాలు అందజేయాలనుకున్నాను

కె. ఆదిశేషిరెడ్డి (అల్వారు)

* * *

1—9—67 సంచికతో ముగిసిన గొలుసు కథ "పరివృతం" చాలా బాగుంది. కానీ రెండవ భాగంలో కథ అంతయునూ—"ఇందిర"చే చెప్పించి, మూడవ భాగములో "రచయిత" అనే కథ చెప్పి

## ఉత్తరాలు

నట్లు వ్రాసారు. ఈ చిన్న పొరపాటును రచయిత సహృదయంతో స్వీకరిస్తారని ఆశిస్తూ రచయిత(త్రు)లకు నా అభివందనలు అందజేస్తున్నాను.

వి ఎల్ ఎన్ రావు (బరంపురం)

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రికలో సింగరాజు రామచంద్రమూర్తిగారు రచించిన "పరివృతం"(గొలుసు కథ) నన్నెంతో ఆకర్షించినది. ముఖ్యంగా ఇందిర పాత్ర చిత్రీకరణ చాలా బాగున్నది. ఇంత చక్కటి కథను రచించిన రచయితకు నా హృదయపూర్వక ధన్యవాదములు

జి సరళ (యలమంచిలి)

### వ్యాసాలు

బాసిని సుదర్శన్‌రెడ్డిగారి శాసనసభ వనితామణులు అన్న శీర్షిక వెర్రితలలు వేస్తోంది. "శ్రీమతి విమలాదేవిగారు వెంకటేశ్వరుని ఇటువంటి సందర్భం చారు "ఇది గూడా వ్రాయదగ్గ విశేషమేనా? ఇటువంటివాటినే ఇసుకనుండి తైలం తీయుటం అంటారు.

కె నాగేశ్వర్, (హైదరాబాద్.)

* * *

25—8—67 వ తేదీ వారపత్రికలో 'సూర్యాన్నపూర్ణ' గారి వ్యాసము చదివాను

అరవిందస్వాములవారి పూర్వాశ్రమంలోని సతీమణి పితృమహులు శ్రీ భోపాల్‌బోసుగారు ఘోష్ గారని అచ్చయినది. శ్రీమతి మృణాళినీదేవి తమ్ముడు డా. శిశిరబోసుగారు ప్రస్తుతము రాంచీలోనున్నారు

మరియు వంగరాష్ట్రాన్ని 1915 లో విభజించారని వ్రాశారు బెంగాలు 1905 లో విభజించబడింది. ధన్యవాదాలతో

ఎం వి రామారావు (రూర్కెలా)

### కార్టూన్లు

25—8—67 సంచికలో వూమెన్‌గారి కార్టూన్ అత్యంత శోచనీయముగ నున్నది. కోసిగిన్ చెంపపై అయూబ్ ముద్దుగుర్తు దాన్ని శ్రీమతి ఇందిరాగాంధి పాయింట్ చేయుట చిత్రించి శ్రీ వూమెన్ భారతీయ స్త్రీ పవిత్రతనే అపవిత్రంగావించితిరి కాశ్మీర సమస్యపై రష్యా వీటోచేయుట,మనకు మిగ్ను సర్ఫరా చేయుట రష్యా మనకు చేసిన యున్న ఉపకారములు కేవలము హెలికాప్టర్ల సహాయమునకే అయూబ్ ముద్దు పెట్టుకున్నట్లు చిత్రించితిరిగదా! రష్యా మనకు చేసినసహాయములకు యిదివరకు శ్రీమతి గాంధి కోసిగిన్ తన్ను ముద్దు పెట్టుకొన్నారా? అన్న సంశయము కలుగుచున్నది అయూబ్ కోసిగిన్‌లవికొత్త ప్రణయమైతే, ఇందిర, కోసిగిన్‌లదిపాత ప్రణయమా

మురళి, (ధవళేశ్వరం). ●


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 15—9—'67

ప్లవంగనామ సం॥ భాద్రపద మాసం శుద్ధ॥ ద్వాదశి

సంపుటము : 60 సంచిక : 2

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22 40 |
| 6 మాసముల చందా | 11 20 |
| 3 మాసముల చందా | 5 60 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి ప్రసన్నలక్ష్మి
(ఫోటో: ప్రభాకర్)


కథలు :

| | |
|---|---|
| ముగ్గురు మూర్ఖులు | — 14 |
| ఇంటి దీపం | — 32 |
| స్నేహవలయం | — 48 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| మట్టిబొమ్మలు | — 16 |
| పూర్వాసంధ్యా ప్రవర్తతే... | — 40 |

శీర్షికలు, వ్యాసాలు, సినిమా:

ఉత్తరాలు — 2, న్యూఢిల్లీలేఖ — 5, ఊమెన్ కార్టూన్—7, అధ్యక్షుని మరణం — 8, లివ్ అండ్ లెట్‌డయ్ — 12, వారఫలం — 22, అభియోగాలలో వింతలు—23, ధర్మపథం—24, శ్రీమతి నాసర్ గురించి చాలామందికి తెలియదు, డాక్టర్ కబుర్లు — 25, రాణి అహల్యాబాయి, వార్తలలో వనిత — 26, ప్రశ్నావళి — 28, చైతన్యుడు — 29, బాలసాహితి — 30, మెదడుకిమేత — 31, ఒకవారం విపరీతం—55, విజయలక్ష్మితో ఇంటర్వ్యూ — 56, చిత్రసమీక్ష — 57, చిత్రలహరి — 58, సినిమాడైరీ — 60, అవీ ఇవీ — 61, పుస్తకాలు — 63.

# కేంద్ర మంత్రివర్గంలో 'దేశాయ్‌ప్లాను' పలుకుబడి- జపాన్ భారతదేశాల మధ్య వ్యాపార సంబంధాలు

ఢిల్లీ కాంగ్రెసు రంగంపలో ఈవారం విశేషాలు చాలా వున్నాయి. ఉప ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్ గారు జపాన్ నుంచి తిరిగివచ్చారు. ప్రభుత్వోద్యోగులు సమ్మె చేస్తామనే బెదిరింపు ఒకటుంది. ఇక భాషా వివాదంగురించి వేరుగా చెప్పనవసరమే లేదు.

మొరార్జీదేశాయ్‌గారు జపాన్— భారత దేశాల మధ్య సత్సంబంధాల కోసం జపాన్ వెళ్లారు. బాగానేవుంది. ఆయన ప్రతిపాదనల్ని కేంద్ర మంత్రివర్గానికి విన్నవిస్తారు. ఆ మంత్రిమండలి తీర్మానాన్ని ఆధారం చేసుకునే, మొరార్జీదేశాయ్‌గారి పర్యటనయొక్క సత్ఫలితాల్ని ఊహించుకోవలసివుంటుంది! టి. టి. కృష్ణమాచారి గారిలానే ఈయన కూడా ఒక మంచి పంథాను అనుసరిస్తున్నారు. టి. టి. కృష్ణమాచారిగారు ఆర్థికమంత్రిగా వున్నప్పుడు వారు ఆస్ట్రేలియాను దర్శించారు. జపాన్ పర్యటించాలని ఉద్దేశించారు.

ఈ సందర్భంలో ఒక ఆసక్తికరమైన అభివృద్ధిని మనం ఇక్కడ ప్రస్తావించుకోవాలి. భారతదేశం అరబ్బులతో వ్యాపారం సాగించాలని ఉవ్విళ్లూరుతూవుంది. ఈ వ్యాపారమంతా అప్పురూపేణా జరుగుతుంది! అలానే జపాన్‌తోను, ఆస్ట్రేలియాతోను వ్యాపారసంబంధాలు పెట్టుకోవడంలో ఆక్షేపణ వుండదు. 1966—67 లో జపాన్ మొట్టమొదటిసారిగా ఆస్ట్రేలియాకు పెద్ద కొనుగోలు దేశం అయింది. దానితో ఆస్ట్రేలియాకు గిరాకీ పెరిగింది. ఆశియాలోని దేశాల్లో చాలవాటికి అది సంపిణీదారు అయింది. తైవాన్, కమ్యూనిస్టుచైనా, హాంగ్‌కాంగ్, మలేశియా, ఫిలిప్పైయిన్స్, పాకిస్తాన్, సింగపూర్, థాయ్‌లాండ్—వాటిల్లో కొన్ని.

తూర్పు సూయెజ్ విధానంద్వారా గ్రేట్ బ్రిటన్ కూడా కొంత సంబంధబాంధవ్యం కలిగివుంది

భారత—ఆస్ట్రేలియా—జపాన్ దేశాలు ఒండొరులు సహకరించుకుంటే వ్యాపారానికి కావలసినంత అభివృద్ధి కనిపిస్తుంది. ఆర్థికమైన సహకారమే కాకుండా, కమ్యూనిస్టుచైనా ఛాలెంజిని కూడా 'కోన్‌కిస్కా' లా తీసిపారెయ్యొచ్చు!

'యన్' ఒడంబడికకి మనదేశం ఒప్పుకోవడంలేదు. చంద్రశేఖర్ ఝాగారు చెప్పినట్లుగా ఇతరదేశాలనుండి సైనిక సహకారాన్ని పొందే అవకాశం వుండదని, మనం సహకరించే విధానమూ లేదని, ఈ ఒడంబడికకు మనం ఒడంబడలేదని చెప్పుకోవచ్చునా ?

1962 లో భారతదేశం అత్యవసర పరిస్థితికి తట్టుకోలేకపోతున్నప్పుడు అమెరికా, యునయ్‌టెడ్ కింగ్‌డమ్‌లు మనల్ని ఆదుకోడానికి వచ్చాయన్న సంగతి విస్మరించకూడదు!

ఏమయినా, దేశాయ్‌గారు జపాన్ వెళ్లి సైనిక చుట్టరికంతో తిరిగిరాలేదుగా? చక్కని కాంగ్రెసు నాయకుడుగా తన మాటల్ని ఎలా ఉపయోగించాలో ఆయనకు తెలుసు. ఆర్థికమంత్రిగా, ఆయన భారతదేశాన్ని ఒక్కదానినే దృష్టిలో వుంచుకోకుండా ప్రపంచం మొత్తంమీద ఆర్థిక ఆరోగ్యానికి ఆయన కృషిచేస్తున్నారు పైగా, జపాన్‌నుంచి తిరిగి వచ్చినా 'ఆసీన్' సంగతి మరచిపోలేదు. భారతదేశంతో వ్యాపార సంబంధాల్ని కలిగివున్న కెన్యా, టాంజనియా, ఉగాండా — ఈ మూడు తూర్పు ఆఫ్రికాదేశాలూ 'తూర్పు ఆఫ్రికా ఆర్థికకుటుంబం(ఆసీన్‌గా ఏర్పడ్డాయి లాటిన్ అమెరికాదేశాలు 1968 లో ఉమ్మడి వ్యాపారం చేయడానికి అంగీకారం కుదుర్చుకున్నవి.

'కోల్డ్‌వార్' ఎప్పుడో అయిపోయింది. అయినా మనదేశం యింకా ఆ పాతరోజుల్లోనే కునుకు తీస్తున్నది. అమెరికా రష్యాలు దగ్గరవుతున్నాయి. పశ్చిమజర్మని తూర్పు ఐరోపాదేశాలతో స్నేహం ఏర్పరచుకుంటూవున్నది. ఐరోపా ఉమ్మడి వ్యాపారంలోని విజయాన్ని గ్రహించినదేశాలు కొన్ని కూడ బలుక్కుంటున్నాయి. మనం ఆశియా — ఆఫ్రికా దేశాల్నే నమ్ముకు కూర్చోవలసిన అగత్యం ఇప్పుడు కనిపించడం లేదు!

దేశాయ్‌గారు జపాన్ వెళ్లినందువల్ల మనకు ఏంప్రయోజనం దక్కిందో ఈ క్రిందిదానివల్ల బోధపడుతుంది.

ఆయన జపాన్ వెళ్లి 'అయిడియాలు' పట్టుకురావడమే కాకుండా, పరస్పర అవగాహనని పెంపొందించారు. భారతదేశానికి జపాన్‌కు వున్న బాంధవ్యాన్ని అతి సున్నితంగా కాపాడుకోవాలి దానివల్ల చాలా ప్రయోజనాలున్నాయి. 'భారత-ఆస్ట్రేలియా—జపాన్' దేశాలు మూడు కలిసి కట్టుగా వ్యాపారం చేయడానికి ఇది మార్గం. ఆర్థిక సహకారానికిగాని, సాంకేతిక సహాయానికిగాని ఈ మూడుదేశాల కలయికవల్ల లాభాలు అనేకం కనిపిస్తున్నాయి. తన పాత్రను అతి చాకచక్యంగా నిర్వహించారు దేశాయ్‌గారు. అయితే, ఆయన భావాలకి కేంద్రమంత్రివర్గంలో గుర్తింపు లభించినప్పుడే సత్ఫలితాలు బయటికి వస్తాయి. భారతదేశ ఆర్థికపరమైన క్లిష్టపరిస్థితి దేశాయ్‌గారి మెదడుకి కావలసినంత పని కల్పిస్తున్నది. ఉపప్రధానిగా, ఆయన వీటన్నింటినీ ఎలా చక్కచేస్తారో చూద్దాం!

కేంద్ర ప్రభుత్వోద్యోగులూ— కరువుభత్యము

ధరలు స్తంభించాయా అంటే అందుకు కారణం వేతన స్తంభన. మంత్రులు వేతన స్తంభనాన్ని ఛేదించడానికి కృషి చేస్తూ

## న్యూఢిల్లీ లేఖ

[illegible] తీసుగుతున్నారు!

[illegible] ఉదంతం తీసితక్కని ఉదాహరణ, ప్రభుత్వోద్యోగుల సంఘాలు అన్నీ ఒకదానికొకటి ముడిపడి ఒక త్రాటిమీద నాగాలే నడుస్తున్నాయి. కన్ను కుట్టిన కమ్యూనిస్టులు పెద్దరాద్ధాంతం చేస్తున్నారు. అఖిలభారత సమ్మెను ప్రతిపాదించింది కమ్యూనిస్టులే. యస్. యమ్. బెనర్జీగారు కలగచేసుకోవడంతో ఉపద్రవానికి ఇది తీరనిసమస్య అనిపించింది. కేంద్ర ప్రభుత్వం ఎలా తువాతునకలైపోయిందో తెలుసుకున్న ప్రభుత్వోద్యోగులు, వారి కమ్యూనిస్టు సోదరులు ఈ పరిస్థితిని బాగా వినియోగించుకుంటున్నారు!

కేంద్రప్రభుత్వోద్యోగులు చేసిన మొదటి సమ్మె అంతగా రాణించలేదు. అందుకు కారణం, ప్రభుత్వం అప్పుడు సంఘటితంగా వుంది. ప్రజలు, పత్రికల మద్దతు ప్రభుత్వానికి లభించింది. అంతటి ప్రభుత్వ ప్రతిష్ఠనంతా అప్పటి దేశీయాంగమంత్రిగారయిన లాలా గుల్జారీలాల్‌నందాగారు గంగపాలు చేశారు. అప్పటినుంచి పరిస్థితి విషమంగా తయారయింది ఇక్కడ ఒక నిజం చెప్పుకోవాలి మొరార్జీదేశాయ్‌గారు అంతకంతకు ఏకాంతవాసంలోకి వెళ్లిపోతున్నారు. కమ్యూనిస్టులు అదను చూసుకుని ధైర్యాన్ని, బలాన్ని కూడదీసుకుంటున్నారు. బెంగాలులో ఒక ప్రభుత్వం పూర్తి 'హర్తాళ్'ని ఏర్పాటు చేసింది! క్రిందటివారం రాంచీ వెళ్లిన ముగ్గురు కేంద్ర మంత్రులూ అక్కడి కార్మికుల ధాటికి తట్టుకోలేకపోయారు. ఈ మంత్రులు మిర్జాపూర్ వెళ్లవలసిన కార్యక్రమాన్ని విడచిపెట్టుకోడానికి కారణం కార్మికుల్లో లేచిన అలజడే! ఇటువంటి వాతావరణంలో ఉపద్రవానికి ఏంచేద్దామన్నా గడ్డు సమస్యలు ఎదురవుతూ వున్నాయి ప్రధాన మంత్రిని ముట్టడించి ఒకసాధారణసమ్మెచేసిమెప్పించినా అది పభుత్వానికి దెబ్బే! భేదాభిప్రాయాలున్న ప్రభుత్వంలో మొహంచాటు చేసుకొని వ్యవహరించడం అలవాటయిపోయింది. ఇటువంటి సందర్భంలో ఏంజరిగినా వింత అనిపించదు! ప్రభుత్వం గనక వారి ఉద్యోగుల కోర్కెలను తీర్చినట్టయితే వేతన స్తంభన ఉండేదా? కమ్యూనిస్టులు దీనికి సమాధానం చెప్పలేరు, ఆర్థికపరమైన ఏ ఇబ్బంది తీరవలసివచ్చినా అది ప్రభుత్వం అయిక్యతమీద ఆధారపడి వుంటుందన్నది అంతరెరిగిన సత్యం. తప్పుల తక్కెడ పద్ధతిగాకాకుండా ఒక సమస్యమీద ఒక అభిప్రాయానికి వచ్చి, దానిని యథాతథంగా అనుసరించడంద్వారా ఎన్నోసమస్యలు పరిష్కారమవుతాయి. ఈ విధానం అందరూ అనుకుంటున్న 'దేశాయి పథకా'న్ని విజయవంతం చేస్తుందనడంలో అనుమానం లేదు.

### ప్రాంతీయ భాషాసమస్య— ప్రభుత్వం తీరు

కేంద్ర విద్యామంత్రి టి. సేన్‌గారు ప్రజల విమర్శల్ని లెక్కచేయరు. ఒక విధంగా ఆయనపద్ధతి మంచిదే!

కెనడాలో జరుగుతున్న దానిగురించి డా. సేన్‌గారు కొంచెం వెనకాముందూ ఆడుతున్నారు. వందసంవత్సరాలు చవిచూసిన పాతప్రభుత్వం కామన్‌వెల్త్‌లో విచ్ఛిత్తికి కారణమయింది. ద్విభాషా సూత్రంమీద, రెండువిధాలయిన సంస్కృతి మీద, రెండు సంవత్సరాలక్రితం 'రాయల్ కమిషన్' ఒక రిపోర్టును సమర్పించింది. అది అతి ప్రమాదకరమైన పరిస్థితుల్ని సృష్టికరించింది అందులో ఇలావుంది.

'...కెనడా ఏ జాతికి చెందిన దేశము? ఆ జాతి ఇంకా అలానే వుంటుందా? అనే ప్రశ్నలు సాధారణ ప్రజలు వేశారు. ఇది ఒక గ్రూపు. మరో గ్రూపువారు ఈ ప్రశ్నల్ని అడక్కుండా మాట్లాడక వూరుకున్నారు. ఇలా వూరుకోవడం, పరిస్థితిని మరింత విషమింప జేసింది.

'ఈ వాదానికి ముఖ్య సూత్రధారులు కొందరున్నారు వారు ఫ్రెంచి మాట్లాడే క్విబెక్‌వారు, ఇంగ్లీషు మాట్లాడే కెనడావారు. అంచేత అధిక సంఖ్యాకులకి, అల్పసంఖ్యాకులకీ పారంపర్యమైన గలాటా ఎంతోకాలం వుండదని మాకు తెలుస్తోంది. ఈ గొడవ అధిక అల్పసంఖ్యాకుల మధ్య జరుగుతున్నది కాదు రెండు అధిక సంఖ్యాకుల మధ్య పోరాటం! కెనడాలోని అధికసంఖ్యాకులకి, క్విబెక్‌లోని అధిక సంఖ్యాకులకీ మధ్య జరుగుతున్న రగడ ఇది.

'ఫ్రెంచి కెనడావారిని, ఆంగ్లం మాట్లాడే కెనడావారితో సమానంగా చూడాలనే వైఖరి కనిపిస్తూవుంది ఇది అంగీకారమైనదికాదు. ఈ సమానత్వం ఆమోదించతగిందికాదు. ఫ్రెంచి మాట్లాడే క్విబెక్‌వారిలో అప్పుడే సంచలనం వచ్చేసింది."

భాష, సంస్కృతి రెండూ కలిసి ఇరవయ్యేళ్లక్రితమే భారతదేశాన్ని విభజించివేశాయి. 1966 లో పంజాబ్ విడిపోవడానికి కారణం భాష. భాషాసంస్కృతుల నాధారంచేసుకునే నాగాలు ప్రత్యేకరాష్ట్రాన్ని కోరుతున్నారు. ఉర్దూమీద కావలసినన్ని ఆందోళనలు వున్నాయి. అన్నిటికంటె ఎక్కువగా ప్రత్యేకభాష, ప్రత్యేక సంస్కృతి గల హిందీవారి గొడవ వుండనేవున్నది!

ఇక్కడ ఒక విషయాన్ని చెప్పుకోవాలి. హిందీవర్గంవారి కోరికలు ఏమి అయివున్నా, ఇంగ్లీషుభాష దేశాన్ని ఒక్కటిగా ఉంచుతుందన్నది సత్యం. బ్రిటిషువారి హయాంలో ఎంతోమంది దాక్షిణాత్యులు, ఉత్తరాన ఆధిపత్యం వహించారు. ఇది దేశంలోని అయిక్యతకు దోహదం చేసింది ప్రాంతీయభాషా విధానంవల్ల ఇది పూర్తిగా దెబ్బతినిపోతుంది. కేంద్ర ఉద్యోగాల్లో పట్టు సడలిపోతుంది!

ఆగస్టు పదిన 'ఓస్లో'లో ఒక విదేశీ సమావేశం జరిగింది. అది పూర్తిగా భాషా వేత్తలకి ప్రత్యేకించి ఏర్పరచారు. అందులో పదిహేడు దేశాలనుంచీ నలభైమంది ప్రతినిధులు హాజరయ్యారు. 'తక్కువ సంఖ్య మాట్లాడే భాషలమీద అధునాతన వార్తా విధానంలో ఉపయోగించేభాష వివాద పరిశ్రమలు దెబ్బతీస్తున్నాయని, పశ్చిమ అయిరోపాలో ఇంగ్లీషుపాత్ర అధికమవుతున్నదని, అధికసంఖ్యాకులు మాట్లాడుకునే తక్కిన భాషలమీద కూడా ఇంగ్లీషు అధికారం చూపిస్తున్నద'ని, నార్వేనుంచి వచ్చిన ప్రొఫెసర్ ఆఫ్ బెడల్ అన్నారు.

అలానే హిందీని వార్తాప్రసారాలకి ఉపయోగించినట్టయితే, లేదా ఇప్పుడు అనుకుంటున్నట్టుగా ప్రచారభాషగా వాడుకలోకి తీసుకువస్తే మనదేశంలోని తక్కినభాషలన్నీ చీకట్లోకి వెళ్లిపోవడం ఖాయం!

ఒక యదార్థాన్ని మనం గమనించాలి. సోవియెట్ రష్యాలో ఇంగ్లీషు అధ్యయనం ఎక్కువవుతోంది ఆశియాలో ఆంగ్లాన్ని ప్రేమిస్తున్న మరికొన్ని దేశాలు—కమ్యూనిస్టు చైనా, జపాన్. భారతదేశ మొక్కటే నూటయాభయ్యేళ్ల సంస్కృతిని మట్టుపెట్టడానికి చూస్తున్నది

భారతదేశ అయిక్యతను విచ్ఛిన్నం చేసినందుకుగాను శ్రీ టి. సేన్‌గారికి భారత చరితలో పాపాన్ స్థానం తప్పకుండా మిగులుతుంది! ●


స్వాగతం-ఇక్కడ మీకేం భయం లేదు
ఆంధ్రా


కొత్త మార్గదర్శి
జి. ఆర్. గాడ్గిల్
ప్రణాళికా సంఘం


చూడ చక్కని చిన్నదే! కాని ఆమెను మీరు నమ్ముతారా?


నేను ఇజ్రేల్ ని నాశనం చేస్తాను
నిన్న —— నేడు
OOMMEN

# 15

ఆ విమాన ప్రయాణం గురించిన జ్ఞాపకాలు ఒక్కొక్కరికి ఒక్కొక విధంగా ఉన్నాయి కాని అందరిలోనూ ఏదో విరోధ భావం చెలరేగుతూ ఉంది. 'ఇది జబ్బుచేసిన విమానం,' అన్నాడు మెక్‌కిల్డఫ్

'కెన్నెడీ, జాన్సన్ వర్గాల మధ్య ఏ మాత్రం బాగాలేదు' అన్నాడు స్టఫ్‌హిల్

కొందరు ఈ విరోధాలని దాచటానికి కూడా ప్రయత్నించలేదు కెన్ వోడానెల్ వోబ్రయన్‌లని జాన్సన్ తనతో వచ్చి కూర్చోమన్నాడు వారు రామని చెప్పేశారు గాడ్‌ఫ్రేమెక్‌హ్యూగ్ విలేఖరుల గదిలోకి వెళ్ళి బల్ల గుద్దుతూ చెప్పాడు 'రికార్డులో కెన్ వోడానెల్ ఓబ్రయన్, డేవ్‌పవర్స్ నేను— ఈ ప్రయాణం విమానం తోక దగ్గర గదిలో అధ్యక్షుడితోబాటే వెళ్ళాము. ఉండాలి! అధ్యక్షుడంటే - కెన్నెడీయే!'

లెడ్‌క్లిఫ్టన్ ఏదో పనిమీద అక్కడికి వచ్చాడు 'మీరా కొత్త యజమాని దగ్గిరికి పోయి సేవ చేసుకోరాదూ?' అన్నాడు కెన్

'ఏమిటి, ఇతనిలా మాట్లాడుతున్నాడు? నా పని నేను చేసుకుంటున్నానంతే!' అన్నాడు క్లిఫ్టన్

మేరీ ఫెహ్మర్ (జాన్సన్ కార్యదర్శి) అందరినీ రాజీ చెయ్యపోయింది అందరినీ సూప్ పుచ్చుకోమంది అందరూ తలలు అడ్డంగా ఆడించారు

వాళ్ళకి సూప్ అక్కర్లేక కాదు. యుద్ధ విరమణ అక్కర్లేదన్నమాట

ముందు జాన్సన్ వైట్‌హౌస్ సిబ్బంది అందరినీ కలుద్దామనుకున్నాడు బండీ వద్దన్నాడు అందరూ వియోగంతో బాధ పడుతున్నారన్నాడు మోయర్స్ కూడా ఈ అభిప్రాయంతో ఏకీభవించాడు జాన్సన్ ఈ ఉద్దేశాన్ని మార్చుకున్నాడు

రూఫస్ యంగ్‌బ్లడ్ జాన్సన్ దంపతులు ఇద్దరూ వైట్‌హవుస్‌లో గడపాలన్నాడు 'అది సాహసమే అవుతుంది నేను వప్పుకోను,' అన్నాడు జాన్సన్ యంగ్‌బ్లడ్ 'రక్షణ' గురించి మాట్లాడాడు.

'నిజమే, కాని 'ది ఎల్మ్స్'కి మాత్రం కాపలా పెట్టలేరా?' అని అడిగాడు అధ్యక్షుడు.

యంగ్‌బ్లడ్ జాన్సన్ ఉండే 'ది ఎల్మ్స్'కి కాపలా పెట్టవచ్చునని అంగీకరించాడు

జాన్సన్ మోయర్స్‌ని పిలిచాడు తను మళ్ళీ పడకగదిలోకి వెళ్ళాలనీ, శ్రీమతి కెన్నెడీ కావలిస్తే అది వాడుకోవచ్చుననీ అన్నాడు మోయర్స్ మెత్తటి మధ్యవర్తి కాని, జాక్వెలీన్ కెన్నెడీ ఈ ఆహ్వానాన్ని స్వీకరించలేదు ఆవిడకి ఇక ఆ గదితో అవసరం లేదు అక్కడ తనకోసం తీసి ఉంచిన వస్త్రాలు గుర్తుకి వచ్చాయి తను వైట్ హౌస్‌లో గడిపిన మూడు సంవత్సరాలలో తనకి జాన్సన్ గురించి ఏమి తెలిసింది? ఇద్దరూ ఒకరి నొకరు బాగా అర్థం చేసుకున్నారు. కాని విమానం దిగే సమయానికి పత్రికా విలేఖరులకి ఏ సమాచారం అందుతుందో అది చాలా ముఖ్యం' కిల్డఫ్ కోసం కబురు పెట్టింది 'మేక్ — మర్చిపోక! వాళ్ళతో నేను ఇక్కడే జాక్‌తో కూర్చుని ఉన్నానని చెప్పు' అన్నది

కిల్డఫ్ తల వంచి, 'చెప్తాను,' అని గొణిగాడు

జాక్వెలీన్ అకారం గురించి అందరూ పట్టించుకొనటం ప్రారంభించారు మెక్‌హ్యూగ్ ఆమెని బట్టలు మార్చుకోమని అడిగాడు ఆమె తల అడ్డంగా ఆడించింది ఆమె ఎడంచేతి మణికట్టు మీద పెద్ద మరక ఒకటి కనిపించింది కిల్డఫ్‌కి అతను అదిరిపోయాడు మేరీ గల్లాఘర్ తువ్వాలు, సబ్బు తీసుకు వద్దామనుకుంది వోడానెల్ ఆమెని వారించాడు 'ఏమీ చెయ్యకండి ఆవిడలా ఉంటే అలా ఉండనివ్వండి' అన్నాడు

డా బర్క్లీ రక్తసిక్తమయిన ఆమె స్కర్ట్‌ని వణుకుతున్న చేతితో చూపించి, 'ఇంకో డ్రెస్?' అని అడిగాడు బెరుకుగా

'నో!' అన్నది ఆమె ఆవేశంగా 'వాళ్ళందరూ ఈ భీభత్సం చూడవలసిందే!'

'జాక్ నేనేం చెయ్యపోతున్నానో తెలుసా?' అని అడిగాడు కెన్ వోడానెల్ హఠాత్తుగా 'పెద్ద డ్రింక్ తీసుకోపోతున్నాను! నువ్వు కూడా తీసుకుంటే మంచిదనుకుంటున్నాను!'

ఆమె సందేహించింది ఇంకా ఎన్నో వాగ్దానాలు ఉన్నాయి ఎంతో దూరం వెళ్ళాలి తాగితే కన్నీరు పెల్లుబికి రావచ్చు

'ఏమి తీసుకోమంటావు?' అని అడిగింది

'నే కలిపి తీసుకొస్తాను స్కాచ్ తీసుకొస్తాను'

'నా జీవితంలో స్కాచ్ తాగలేదు' అని సందేహిస్తూనే ఆమె తల ఊపింది విస్కీ కూడా 'షాక్'లకి ఇస్తారు

కెన్ ఒక పెద్ద గ్లాసులో స్కాచ్ పోసి తీసుకు వచ్చాడు అది ఆమెకి ఏదో చేదు మందులాగ ఉంది, ఫినాల్ వాసన వేసింది. అయినాసరే, తాగింది మరొకటి తాగింది ఆ విమాన ప్రయాణం జ్ఞాపకం రావటాని కని ఆమె తర్వాత చాలాసార్లు స్కాచ్ విస్కీనే తాగేది

ఆమెతో ఉన్న మగవారు గ్లాసు వెంబడి గ్లాసు తాగారు కిల్డఫ్ తను డల్లాస్, వాషింగ్టన్‌ల మధ్య సుమారు సీసాలో మూడింటిలో రెండు భాగాలు తాగి ఉంటానని అంచనా వేశాడు మద్యంతో తమ బాధని ముంచాలని వారి ప్రయత్నం

వారు ఆశించినది జరగలేదు సాధారణంగా తాగితే స్పృహ కోల్పోయేటంత తాగిన తర్వాత కూడా కిల్డఫ్ తన విలకడని ఏ మాత్రం కోల్పోలేదు తర్వాత 'బెత్‌స్డావర్' ఆస్పత్రిలో శ్రీమతి కెన్నెడీకి తాగేందుకు ఏదీ ఇవ్వరనుకుని చాలా కోపం తెచ్చుకున్నాడు

వారికి మంచి వాలుగాలి వీస్తోంది స్వెండాల్ విమానాన్ని 41000అడుగుల ఎత్తుకి తీసుకు పోయాడు అంతకిముందెప్పుడూ అధ్యక్షుడు కెన్నెడీని అంత ఎత్తుకు తీసుకు వెళ్ళలేదు వారి వేగం అప్పుడు ఇంచుమించు శబ్దవేగంతో సమానంగా ఉంది. పయిన ఆకాశం దిగంబరంగా,

ప్రశాంతంగా కనిపిస్తోంది. కాని, ఇది మాయ. కింద తుపానులు చెలరేగుతున్నాయి.

దక్షిణంగా చంద్రుడు సన్నగా వెలుగుతున్నాడు. చీకటిలో తిరిగి రావటమే మంచిది అనుకున్నాడు స్విండాల్. కాని, క్రమంగా జరిగినదంతా తలుచుకుని ఎంతో కుంగిపోయాడు; తను అధ్యక్షుడిని ప్రాణంతో కలకలలాడుతున్నప్పుడు టెక్సాస్‌కి తీసుకువెళ్ళాడు. ఇప్పుడు అతన్ని ఒక పెట్టెలో పెట్టి తీసుకువస్తున్నాడు; తన జీవితంలో ఒక భావావేశం చల్లారి పోయింది. తన వెనుక అధ్యక్షుడు, ఆయన భార్య, ఉపాధ్యక్షుడు, శ్రీమతి జాన్సన్ ఉన్నారు — అనుకున్నాడు. ఇంతభారం మరి ఏ విమానం కమాండర్ మీదా పడి ఉండదు! తను అసలు ఆండ్రూస్ విమానాశ్రయం చేరుకోగలడా? మనిషి కూలి పడిపోవటానికి సిద్ధంగా ఉన్నాడు 'ఎలాగో ముందుకి సాగిపోవటమే ఒక పెద్ద సమస్య అయిపోయింది.' అన్నాడు తర్వాత ఆవేళని గురించి తలుచుకుంటూ

అతని 'కో—పయిలట్' పరిస్థితి ఇంక అర్థాన్నంగా ఉంది. లవ్‌ఫీల్డ్‌లోనే లెఫ్టినెంట్ కర్నెల్ లూయిస్ హిస్సర్‌కి టెక్సాస్‌ని ఎలాగయినా వదిలి వెళ్ళాలనే భావం పిచ్చిలాగ పట్టుకుంది ఏ క్షణంలో విమానాన్ని మెషిన్‌గన్‌తో కొడ్తారో అని భయపడిపోయాడు రెండుసార్లు తనంతట తానే ఇంజన్లని స్టార్ట్ చేశాడు కూడా

ఎర్రని సంజె, ఆకుపచ్చ బురదరంగుగా మారి గోధూళి సమయపు బంగారు వెలుగుగా మారింది ఇద్దరు కర్నెల్‌లూ ఆకాశంలోకి చూశారు శని చంద్రుడిని వెంబాడుతున్నాడు గురువు కారోలినా రాష్ట్రాల మీద తేలుతున్నాడు దూరంగా ఒక పెద్ద నక్షత్రం దూరంగా ఉజ్వలంగా ప్రకాశిస్తోంది అది 'కాపెల్లా' నక్షత్రం; ఇంతగా ఎప్పుడూ వెలిగి పోలేదనిపించిందివారిద్దరికీ. –

విమానం దిగటానికి ఇంకా 30 నిముషాలు ఉంది. ఆండ్రూస్ విమానాశ్రయం కాంక్రీట్ నేలమీద కాచుకుని నుంచుని ఉన్నాడు ఆండ్రూస్ ఎప్పుడూ ఆకర్షంగా కనిపించేదికాదు బాబ్ కెన్నెడీకి దూరంగా గేటు దగ్గర టెలివిషన్ కెమెరామెన్ కనిపించారు వారికి దూరంగా ఉండాలనుకున్నాడు. కాని, తను జాకీ దిగగానే ఆమె పక్కనే ఉండాలి. పక్కనే కనిపించిన ఒక ట్రక్‌లోకి దూకి కూర్చున్నాడు. లోపల చీకటిగా ఉంది. తను ఇక్కడికి 1962, అక్టోబరు 20న వచ్చాడు. అప్పటికి క్యూబా గొడవ ఉధృతంగా ఉంది అధ్యక్షుడు హడావుడిగా చికాగో నుంచి తిరిగి వచ్చేశాడు ఎటార్నీ జనరల్ తన అన్న కోసం అక్కడే కాచుకుని నుంచుని ఉన్నాడు.

స్విండాల్ విమానాన్ని కిందకి దింపుతున్నాడు.

జాన్సన్ అధ్యక్షుడి గదిలో నుంచుని క్షవరం చేసుకుని, తల దువ్వుకుని, కొత్త షర్టు వేసుకుంటున్నాడు.

విమానం వెనక భాగంలోని చిన్న గదిలో డేవ్‌పవర్స్ రామ్ కిల్డర్మాన్‌తో, 'మిసెస్ కెన్నెడీ అధ్యక్షుడితో ఉన్న వీరంతా విమానం మీద మరొక అధ్యక్షుడు కూడా ఉన్నాడు. ఆయన సంగతేమిటి? విమానంలోనుంచి బయటికివచ్చే దారిలో పదిహేనుమంది కిక్కిరిసి ఉన్నారు అధ్యక్షుడు వంటరిగా 'స్టేట్ రూమ్'లో నుంచుని ఉన్నాడు. కిల్డఫ్ దీనిని గమనించాడు.

తను అధ్యక్షుడి తాత్కాలిక పత్రికా కార్యదర్శి, ఇది ఒక పెద్ద అవమానం. పొద్దు పోను, పోను ఇది అధికం అయింది. జాన్సన్ కూడా ఇదంతా గమనించి కిల్‌డఫ్‌దే తప్పు అన్నట్లు ప్రవర్తిస్తున్నాడు మర్నాటికి కూడా అది మరిచిపోలేదు మొదటిసారిగా కాబినెట్ సమావేశం అయింది. అయిన తర్వాత ఒక ఆప్తుడితో తనకి 'ఆ కుటుంబం'తో చా సమస్యలు వచ్చే



వాషింగ్‌టన్‌కి తిరిగి వస్తున్న అధ్యక్షుని విమానం

అయన్ని మొయ్యాలంటోంది. గ్రీర్ కారు నడపాలంటోంది...' అన్నాడు.

గ్రీర్ బాధ కిల్డర్మాన్‌కి తెలుసు. అందుకనే శ్రీమతి కెన్నెడీ అతనికి ఈ గౌరవం దక్కేటట్లు చూడాలనుకున్నది. శ్రీమతి కెన్నెడీ ఇవిలిన్ లింకన్—మారీ గల్లాఘర్, మగ్గీ హోలియరీ, జార్జితామస్‌లతో వెళ్ళి చెప్పింది, 'మీ రందరూ నాతో శవపేటిక దగ్గిరే నుంచోవాలి,' అన్నది. మెక్‌హ్యూగ్‌తో, అతని స్నేహితులే అతన్ని మొయ్యాలి!' అన్నది.

పెడ్‌క్లిఫ్టన్ తిరిగివచ్చాడు. 'ఆర్మీ శవపేటికని తీసుకువెళ్లటానికి సిద్ధంగా ఉన్నది!' అన్నాడు.

'మేము తీసుకువెడతాము,' అని సమాధానం ఇచ్చాడు వోడన్నెల్. శవపేటికని అధ్యక్షుడి ఆప్తులయినవారు మొయ్యాలని శ్రీమతి కెన్నెడీ అన్నట్లు చెప్పాడు చెప్పవలసినవారందరితో. అయితే, అదే విమానంట్లున్నాయి, అని చెప్పాడు. ఈ ఆప్తుడు కొన్ని నోట్సు రాసుకున్నాడు. వాటిలో ఇలా ఉంది: "ఆయన, 'విమానం వచ్చింది, కుటుంబంవారు తనని లెక్కచెయ్యలేదు, శవాన్ని తీసుకుని కారులో పెట్టి శ్రీమతి కెన్నెడీతోబాటు వెళ్ళిపోయారు. అంతదాకా నేను విమానంలోనే ఉండిపోయాను, నన్ను ఎవరూ పట్టించుకోలేదు ఒక్క మర్యాద చూపలేదు,' అన్నాడు. తాను 'అమెరికా సంయుక్తరాష్ట్రాల అధ్యక్షుడయినప్పటికీ' ఆయన తనని చెంపమీదకొడితే రెండవ చెంప చూపించానన్నాడు. 'ఏమి చెయ్యగలను, ఆ కుటుంబంతో పోట్లాడనా?' అన్నాడు. 'కెన్నెడీ కాంతి అందరికీ ముఖ్యమయినదే...'"

విమానాశ్రయంలో పోగయిన గుంపు ఆత్రంగా చూస్తున్నారు. విమానం మెట్లు పెట్టారు ఎవరికీ చెప్పకుండా ఎటార్నీ జనరల్ గబగబ ఎక్కి వెళ్ళాడు. విమానం

## అధ్యక్షుని మరణం

లోకి దూకాడు. దారిలో లిజ్ కార్పెంటర్, జాన్సన్ దంపతులు—ఎవరినీ పట్టించుకో లేదు. 'అయ్ వాంటు సీ జాకీ!' అంటూ గొణుక్కొనటం లిజ్ విన్నది. చిన్న గదిలో (శ్రీమతి కెన్నెడీ పక్కనే కూర్చుని ఆమె భుజాలమీద చెయ్యి ఉంచి, 'హాయ్ జాకీ!' అన్నాడు నెమ్మదిగా. 'వచ్చేశాను' అక్కడ ఉన్నవాళ్ళు ఉలిక్కిపడ్డారు. బాబ్ కెన్నెడీ గొంతుక అచ్చు అతని అన్న కంఠస్వరం లాగనే ఉన్నది.

బాబ్ కెన్నెడీ ఏంబులెన్స్ ప్లాస్టిక్ తెర తొలగించి, 'రాయ్, డల్లాస్‌లో ఎవడినో పట్టుకున్నారుట తెలుసా?' అని అడిగాడు.

'దట్స్‌గుడ్!' అన్నాడు కెల్లర్మాన్.

'ఒకడే.'

'ఆస్పత్రి దగ్గర వాతో మాట్లాడాలి.'

'అలాగే,' అని తెరమూసేశాడు బాబ్. జాక్వలీన్ కెన్నెడీ బాబ్‌తో అన్నది: 'అంత్యక్రియలు నేవీ వాళ్ళే చెయ్యాలి !'

తర్వాత ఏవేవో మాట్లాడారు అందరూ.

'బాబీ అతను (జాన్సన్) నీతో మాట్లాడాడుట,' అన్నది జాకీ మరదితో.

'డల్లాస్‌లోనే ప్రమాణం తీసుకో మన్నావుట?'

బాబ్ కెన్నెడీ ఆశ్చర్యపోయాడు. ఏదో పొరపాటు ఉంది, తనేమీ అటువంటి సూచన చెయ్యలేదు, అన్నాడు. (ఈ రచయిత ఈ విషయమయి జాన్సన్‌ని అడిగాడు. ఆయన, వారెన్ కమిషన్‌ముందు తను చెప్పిన సాక్ష్యానికి అదనంగా ఏమీ చెప్పలే నన్నాడు—మాం.)

శవపేటికమీదకి ఆనుకుంటూ (శ్రీమతి కెన్నెడీ, 'బాబీ!...జాక్ వెళ్ళిపోయాడంటే నమ్మలేకుండా ఉన్నాను!' అన్నది. ఆమె కళ్ళు మెరిసిపోతున్నాయి. కార్లు ఊరేగింపు, పట్టపగలు హత్య, తర్వాతి సంఘటనలూ — అన్నీ వర్ణించింది బాబీ కెన్నెడీ 20 నిముషాలు మవునంగా విన్నాడు.

''అంతా చెప్పాలనుకుంది ఆవిడ. నేను వింటానా విననా అని ఆవిడ ఆలోచించ లేదు. అంతా చెప్పుకుపోయింది,' అని తర్వాత అన్నాడు.

(ఇంకా వుంది)










విభ్రాంతి కలిగింది నాకు. అక్కడికక్కడే కొట్లాటకి దిగాలా— కానీ నేను బ్రతికి ఉంటం, సాలిటెయిర్ని రక్షించడం నా మొట్టమొదటి కర్తవ్యం.

ఇనుప తలుపు తెరుచుకోగానే సాలిటెయిర్ కన్పించింది నాకు.

సాలిటెయిర్ మోకాళ్ల మీద లేచింది.—వెంటనే మిస్టర్ బిగ్ చేతిలో తుపాకి.










'మిస్టర్ బాండ్ దేనికీ ప్రయత్నించకు లేదా నీబొజ్జలో బెజ్జం పడుతుంది.'

'జేమ్స్! ఓ జేమ్స్!'
'ఏం ఫర్వాలేదు— నేనిక్కడే ఉన్నాగా'

'ఫర్వాలేక పోవటమేమిటి మిస్టర్ బాండ్. తాడొకటి తీసుకురండి!'













'ఈ వెధవ ఏం చెయ్యబోతున్నాడో'

'వాళ్లని కట్టెయ్!'
ధైర్యాన్నిస్తున్నట్లుగా సాలిటెయిర్‌కి సైగ చేశాను. కానీ నాకు ధైర్యాన్నిచ్చేదేదీ కనిపించ లేదు.

కొద్ది సేపట్లోనే ఆ రాతి గృహంలోని గోడకి వాళ్ళు మమ్మల్ని కట్టేశారు.








మిస్టర్ బిగ్ కాపలావాడ్ని పంపించేశాడు. నన్నూ సాలిటెయిర్‌ని చూస్తూ నిలబడ్డాడు. తర్వాత.

'నా సహచరుల్లో నలుగురిని నువ్వు చంపావు. ఇది నా అనుచరులకి ఆశ్చర్యకరంగా ఉంది. సాలిటెయిర్ నమ్మకద్రోహం కూడా నేను పొరపాటు పడకుండా చేసింది. కాబట్టి '

'...మీ రిద్దరూ కలిసి చావటం మంచిది..'

'...రెండున్నర గంటలలో'








ఇలా నాకూ, సాలిటెయిర్‌కీ మిస్టర్ బిగ్ మరణశిక్ష ప్రకటించాడు..

'అవును, ఈ ఉదయం ఆరు గంటలకి మీరు చస్తారు!'

హార్బర్‌లో ఉన్న అతని నావకు నేను అమర్చిన లింపెట్ మైన్ గుర్తుకు తెచ్చుకున్నాను. కొన్ని నిమిషాలు అటూ ఇటూగా ఆరుగంటలకి అది పేలుతుంది

'నువ్వు పెద్దమనిషివి ఏదో ఒకరోజు నువ్వు ఘోరమైన చావు చస్తావు నువ్వు మమ్మల్ని చంపితే ఆ చావు త్వరగా నీకొస్తుంది దానిని నేను ఏర్పాటు చేశాను '








'నీ బెదిరింపుల వల్ల ప్రయోజనంలేదు మిస్టర్ బాండ్. కానీ ఒకటి మాత్రం నిజం మీరిద్దరూ చస్తారు నేను మీకోసం ప్రత్యేకమైన పద్ధతి ఒకదాన్ని ఆలోచించాను...'

'' అది కెప్టెన్ మోర్గాన్ ఉపయోగించిన పద్ధతి నుంచి తీసుకున్నది. అతని నిధి నాకు చాలా ఉపయోగిస్తుంది. నా నావ వెళ్ళే నీటి చాల్లలోనే, సొరచేపలు మిమ్మల్ని స్వాహా చేసే వరకూ, ఈడ్చబడను. మీ చిహ్నాలు కూడా కనిపించవు.'

ఉన్నట్లుండి సాలిటెయిర్ కళ్ళు తళుక్కుమని మెరిశాయి

'నేను చూడలేను! అది అత్యంత సమీపంలో వుంది, చాలా దగ్గరలో ఉంది!'

(ఇంకా వుంది)

ముగ్గురు మూర్ఖులు

# లక్ష్మీదేవి శాపం

మహేష్




ధనవంతులు, రాజులు, చక్రవర్తులు మొదలైనవారు మరణించిన తరువాత లక్ష్మీదేవి సన్నిధిని చేరుకొని ఆమెను కీర్తించేస్తూ అక్కడే ఉండిపోయేరు. వాల్మీకి, కాళిదాసు, భవభూతి మొదలైన కవులు సరస్వతీదేవి సన్నిధిని చేరుకొన్నారు. ఇలాగ ఉండగా ఒకనాడు నారదుడు లక్ష్మీదేవివద్దకు రాగా, 'విశేషాలేమిటి?' అని ఆమె ప్రశ్నించింది.

'విశేషాలేమున్నాయమ్మా! నీ భక్తులు నిన్ను సేవిస్తున్నారు. సరస్వతీదేవి భక్తులు ఆమెను సేవిస్తున్నారు. నీ భక్తులైన ధనవంతులు బ్రతికి ఉన్నప్పుడు సన్మానాలు చేయించుకోవడానికి పరోక్షంగా వారే సన్మాన సంఘాలను యేర్పాటు చేసికొంటున్నారు. డబ్బు ఉన్నవాడు చనిపోగానే ప్రజలు అతన్ని మరచిపోతున్నారు. కవి చనిపోయిన తరువాతనే ప్రజలు అతన్ని గుర్తించడం ప్రారంభిస్తున్నారు. కవులకు జయంతులు, వర్ధంతులు జరుపడానికి తామే సంఘాలుగా యేర్పడుతున్నారు. మానవుని జీవితకాలం స్వల్పం కాబట్టి నీ భక్తులకంటే సరస్వతీదేవి భక్తులకే కీర్తిప్రతిష్ఠలు అధికంగా ఉన్నాయి. అందుచేత సరస్వతీదేవి భక్తులకు గర్వం చాలా పెరిగింది వారు యెంతసేపూ సరస్వతీదేవిని స్తోత్రం చేయడంతప్ప మిగిలిన దేవతలను గురించి యెంతమాత్రం పట్టించుకొనడంలేదు. నామాట వారికి అసలు కిట్టడంలేదు' అని నారదుడు సందర్భోచితంగా విన్నవించేడు.

సరస్వతీదేవి భక్తులైన ఆ మహాకవుల వ్యవహారమేమిటో తెల్పాలని, ఆ మాటలు విన్నతరువాత లక్ష్మీదేవికి పట్టుదల కలిగింది. కవులందరూ సరస్వతీదేవివద్దకు వచ్చే సమయానికి కొంచెం ముందుగానే లక్ష్మీదేవి సరస్వతీదేవివద్దకు వెళ్ళి లోకాభిరామాయణం ప్రారంభించింది. కొద్దిసేపట్లోనే వాల్మీకి, కాళిదాసు మొదలైన కవులందరూ బిలబిలా సరస్వతీదేవి వద్దకు వచ్చేరు వచ్చిన వెంటనే సరస్వతీదేవికి ప్రదక్షిణం చేయడం వారికి అలవాటు. అప్పుడు లక్ష్మీదేవి కూర్చొన్న పీఠం సరస్వతీదేవి పీఠానికి అనుకొని ఉంది. అందుచేత సరస్వతీదేవికిమాత్రం ప్రదక్షిణం చేయడానికి అవకాశంలేదు. లక్ష్మీదేవికి కూడా ప్రదక్షిణం చేయడం వారికి యిష్టంలేదు.

కవులందరూ అప్పుడు పావురాలుగామారి మీదినుంచి ఎగురుతూ సరస్వతీదేవికిమాత్రం

ప్రదక్షిణం చేశారు. దాన్ని చూడగానే లక్ష్మీదేవికి చాలా కోపం వచ్చింది. అయినా, ఓడిపోయిన అభ్యర్థి గెలిచిన అభ్యర్థిని చిరునవ్వుతో అభినందిస్తున్నట్లుగా లక్ష్మీదేవి మందహాసంచేస్తూ కవులతో యిలాగ అంది.

'నేను సంపదకు అధిదేవతను. సాక్షాత్తు శ్రీమన్నారాయణమూర్తికి అర్ధాంగిని. అటువంటి నన్ను మినహాయించి మీరు సరస్వతీ దేవికిమాత్రం ప్రదక్షిణం చేశారు. దానికి కారణం యేమిటి?'

'అమ్మా! నీవు చెప్పినదంతా నిజమే. నీమీద మాకు యెంతమాత్రం అగౌరవం లేదు. మానవులు నీ అనుగ్రహంవల్లనే రాజులు, చక్రవర్తులు, ప్రజాస్వామ్యంలో మంత్రులు కాగలుగుతున్నారు. కాని వారి కీర్తి వారి పదవితోనే అంతరించిపోతూంది. మాకుమాత్రం సరస్వతీ కటాక్షం లభించింది. దానివల్ల మేము మహాకావ్యాలను వ్రాయగలిగేము. ఆ కావ్యాలు భూలోకంలో సూర్యచంద్రులు ఉన్నంతవరకు నిలిచి ఉంటాయి. ఆ కావ్యాలవల్ల మా కీర్తి యెప్పుడూ పౌర్ణమినాటి చంద్రునివలె ప్రకాశిస్తూ ఉంటుంది. అందువల్లనే మా భౌతికకాయాలు నశించిపోయినా, మా కీర్తికాయాలు మాత్రం శాశ్వతంగా నిలిచిపోయేయి. దీనికంతటికీ కారణమైన సరస్వతీదేవికితప్ప మరొకరికి తలవంచడం మాకు మనస్కరించదు. అంతకంటే మరొక కారణం యేమీలేదని వారందరూ యేకగ్రీవంగా అన్నారు.

దానితో లక్ష్మీదేవికి చాలా కోపంవచ్చింది. ఆ కవుల అహంకారానికి కారణం యేమిటో స్పష్టంగా తెలిసింది కాబట్టి వారిని యిలాగ శపించింది.

'ఓ కవులారా! మీరు రచించిన యే మహాకావ్యాలను తలంచుకొని మీరు పొంగిపోతున్నారో, ఆ కావ్యాలన్నీ కలియుగంలో సినిమాలుగా తీయబడుగాక! దానితో పౌర్ణమి చంద్రునివలె ఉన్న మీ కీర్తి అమావాస్య చంద్రునివలె మారిపోతుంది. దానితోనే మీ కీర్తికాయాలుకూడా భౌతికకాయాల్ని చేరుకొంటాయి' అని లక్ష్మీదేవి ఘోరమైన శాపాన్ని యిచ్చి వైకుంఠానికి వెళ్ళిపోయింది.

ఈ వర్తమానాన్ని విన్న నారదుడు మళ్ళీ వైకుంఠానికి వెళ్ళి లక్ష్మీదేవికి నమస్కరించి తన సందేహాన్ని యిలాగ వెలిబుచ్చేడు. 'అమ్మా! నీవు తొందరపడుతున్నావు. వారు కేవలం మహాకవులేకాదు. గొప్ప తపశ్శక్తి సంపన్నులుకూడాను.'

'అయితే నా శాపం పనిచెయ్యదనా? నీ అభిప్రాయం' అంటూ లక్ష్మీదేవి మధ్యలో ప్రశ్నించి తనే దానికి సమాధానం యిచ్చింది. 'కలియుగంలో నా భక్తులందరూ సినిమా నిర్మాతలుగాను, దర్శకులుగాను, రచయితలుగాను జన్మించి యీ మహాకావ్యాలయొక్క అంతు తేలుస్తారు. నువ్వు సందేహించవలసిన అవసరం యేమీలేదు.'

'కాని అమ్మా!' అంటూ తన సందేహాన్ని మళ్ళీ వెలిబుచ్చేడు నారదుడు.

'ఏమిటి నీ కానీ?' అని లక్ష్మీదేవి కొంచెం గట్టిగా అడిగింది.

'నీ భక్తులు సినిమా నిర్మాతలుగాను, దర్శకులుగాను, రచయితలుగాను జన్మిస్తారని చెప్పేవు. అందులో రచయితలకు మళ్ళీ సరస్వతీకటాక్షం అవసరంగదా! అదేనా సందేహం' అన్నాడు నారదుడు.

'ఓరి వెర్రివాడా! అదా నీ సందేహం సినిమా రచయితకు సరస్వతీకటాక్షం లేకపోవడం ఒక ప్రత్యేకార్హత' అని లక్ష్మీదేవి చెప్పగానే నారదుడు 'నారాయణా' అంటూ తనదారిని పోయేడు.

'ఇక మనంకూడా మనదారిని పోవచ్చు' నంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించేరు. ●

## అల్లాటప్పయ్య



సీరియల్

తాడిగిరి పోతరాజు

### జ రి గి న క థ

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య. ఆయనకు ఆప్తమిత్రులు. ప్రసాద్ తనని గుర్తించక పోవడంతో అంతకంతకు మధుకు దగ్గరవుతూ వుంటుంది కామయ్య మాస్టారమ్మాయి శారద. గ్రామంలో పంచాయితీ ప్రెసిడెంటు ఎన్నికకోసం చర్చ జరుగుతుంది. ప్రత్యర్ధి వర్గంలోని కామయ్య మాష్టారి మీద శివరామయ్య నిందలుమోపి, స్కూల్లోనుంచి తొలగిస్తాడు. ఆయన పాత ఉత్తరాలు తిరగేస్తూండగా వెంకట్రామయ్య రాసిన ఉత్తరం కనిపిస్తుంది. అది చదివి కర్తవ్యాన్ని గుర్తుతెచ్చుకుని శారదను ప్రసాద్‌తో వివాహానికి అంగీకరించమంటాడు. మధు పెళ్లి ఏర్పాట్లతోపాటు, శారద వివాహంకూడా నిశ్చయమవుతుంది.

## 23

దాదాపు పది గంటలవేళ సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు. పడమటి గాలులు మొదలై సెగలు వీస్తున్నాయి. ఆ సెగలలో ఎదురు గాలికి ఊగిపోతూ 'మధు' భారంగా నడుస్తూ మాష్టారింటికి చేరాడు. బయట మెట్ల తామర మొక్కలూ పూలమొక్కలూ ఎర్రగా ఎండిపోయ్యాయి. కొద్దిగా ఎడంగా జిల్లేళ్ళు — పిచ్చిమొక్కలు ఎత్తు వికృతంగా పెరుగుతున్నాయి. వాకిలి ముందు కట్టిన 'డైమండ్' ఆకారపు తడికలు మధ్యమధ్య బద్దలు రాలిపోయి అంద విహీనంగా ఉన్నాయ్. పంచపాళిలో పిచ్చుకలు తెచ్చి పడవేసిన చెత్తాచెదారంతో అసహ్యంగా ఉంది.

ఆ ఇంటి ఆవరణలో అడుగు పెట్టే సరికి శరీరమంతా ఏదో అవ్యక్తమైన భయాం దోళనలు కమ్ముకొన్నాయి. అరికాళ్ళూ అర చేతులూ చెమటతో తడిసిపోయ్యాయి. అతను సుపరిచితమైన ఆ ఇంటిని అనాలోచితంగా కలయజూసి వాకిలి పట్టుకొని భయం భయంగా లోనికి చూశాడు.

పిల్లలులేని ఇల్లులా బావురుమంటోంది.

'భామా'

' . . '

'భామా'

ఆ అమ్మాయి బయటికొచ్చింది. ముఖం విచారగ్రస్తమై ఉంది. ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ, ఎగురుతూండే ఆ అమ్మాయి అలా నిర్జీవంగా కనిపించటం అదే అతనికి ప్రథమానుభవం— రోజులా తనకు ఎదురొచ్చి 'కూర్చో'మని చిరునవ్వుతో ఆహ్వానించలేదు.

'ఎవరు కావాలి?' నిలబెట్టి ప్రశ్నించింది.

'ఏమా నాన్నగారు లేరా?'.

'లేరు మా నాన్న—ప్రసాద్— నిన్న గుంటూరు వెళ్ళి తిరిగి రాలేదు' ..

జ్యోతుల్లా మండుతున్న అతని కళ్ళు తిప్పి వీధికేసి చూశాడు. అంతా నిర్మానుష్యంగా ఉంది. దుమ్ము మాత్రం ఉండీ ఉండి పైకి లేస్తోంది, అస్థిమితమైన మనసులా. కళ్ళు తిప్పుకొన్నాడు. తన లాల్చి జేబుల్లో చేతులు పెట్టుకొని ఓ నిముషం పాటు ఆలోచిస్తూ ఉండిపోయ్యాడు. లోపలి గదుల్లో నుండి ఎవరి రాకనో తను ఉద్దేశిస్తున్నట్లు వ్యథాపూరితమైన ఆశతో చూడసాగాడు. చివరకు నిగ్రహించుకోలేక

'ఏమా అక్కయ్య లేదా?'. తడబడుతూన్న గొంతుతో అడిగాడు.

'ఉంది ... తలనొప్పిగా ఉందని పడుకొంది .'

'అయితే. .ఒకసారి లేపుతావా?' ..

'లేదు...ఉట్టి సే పడుకొంది'

'అయితే ఒకమాట వినిపొమ్మనిచెప్పు!...

అంటూ విసవిసా ప్రక్కగదిలోకెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. శారద లోనికొచ్చింది. కళ్ళు తంగేడుపువ్వుల్లా ఉన్నాయ్. ఆ కనుపాపల్లో ఎన్నో ఆలోచనలు అల్లిబిల్లిగా తిరుగుతున్నాయి. ఆలోచనాభారంతో ఆమె క్రుంగిపోయినట్లు ముఖమంతా వాడిపోయింది.

అతని ముఖాకృతి చూసిన క్షణకాలం వ్యథ చెందింది. వెంటనే మనసు నిగ్రహించుకొని 'మళ్ళీ ఎందుకొచ్చావ్ వెళ్ళు'. కర్కశంగా అంది.

'నీవు నన్నామాట అడుగుతావని తెలుసు' అంటూ చిన్నపోయాడు ఉద్రేకాన్ని అణచుకొంటూ .

దీర్ఘమైన శ్వాస తీసికొని ' శారదా! .. నేనీవేళనే మద్రాసు వెళ్ళిపోతున్నాను . నీదగ్గర శెలవు పుచ్చుకొని వెళ్లటానికి వచ్చాను. బహుశా ఈ శెలవు ఈ శెలవు . మన జీవితాల్లోనే చివరిసారి ఆఖరుసారిగా నీవద్ద శెలవు తీసికొంటున్నాను. మరొక్కసారి మళ్ళీ నీకు కనిపించను '

అతని కంఠం బొంగురు పోసాగింది. కళ్ళల్లో నీళ్ళు నిండుకోసాగాయి. నోటంట మాట రాలేదు.

'వెళ్ళబోయేముందు నిన్ను మరొక్కసారి హెచ్చరించటానికై వచ్చాను. అయితే నీనిర్ణయం మార్చుకోలేదా?' . పూడిపోతూన్న కంఠాన్ని పెగుల్చుకొని అన్నాడు.

అర్ధనిమీలితనేత్రాలతో క్రిందికి చూస్తూ దానివలన, ఏంజరుగుతుందో ఆలోచించి చూశావా ఏదు'

'జరిగేదేదో జరుగుతుంది ఎంతసేపని? . ఎన్నాళ్ళని—ఇలా ఆలోచిస్తూ—అనుమానిస్తూ నిత్యనరకం అనుభవించటం మనం ఇలా ఆలోచిస్తూనేఉన్నాం. పెళ్లి ఏర్పాట్లు

అనేకం జరిగిపోతూనే ఉన్నాయ్...త్వరగా వెళ్ళిపోతే ఎవరికీ ఏబాధా ఉండదు.' అంటూ మళ్ళీ కూర్చున్నాడు.

'దానివలన కలిగే పర్యవసానం?'

'ఆ...మనం లేచిపొయ్యామని ఊరంతా ఉడికిపోతుంది. అందరూ ముక్కుమీద వేలేసుకుంటారు ... అంతకు మించి జరిగే దేమిటి?' ... అతను ఒక స్థిరనిశ్చయాని కొచ్చినట్లు నిర్భయంగా పలికాడు.

'అంతటితో ఆగదుమధూ...మీమామయ్య మూర్ఖుడు. ఏ అఘాయిత్యానికైనా వెను తియ్యడు...అయినా అవన్నీ చర్చలెందుకు— మానాన్నగారు వచ్చేవేళయింది...లే లేచిపో. ...ఇవిగో ... నీవు వ్రాసిన ఉత్తరాలు...ఇవి నేనే చించివేద్దామనుకొంటున్నాను...అంతలో నీవొచ్చావ్—నీ ఉత్తరాలు నీకిచ్చేస్తున్నాను... చించివెయ్యి...' అంటూ అతనికి సమీపంలో టేబిల్ పై ఆ ప్రేమలేఖలపొత్తాన్ని పెట్టింది ...కంపితహస్తాలతో.

'అవి తీసికొని వెళ్ళు ... మధూ... నన్నుమరచిపో'...పొడిగొంతుతో పలికి లోనికి వెళ్ళటానికి ఉద్యుక్తురాలయింది. సెగలు మంటలు మండుతూ ఆ గదిలోకి నిరాటంకంగా వస్తున్నాయి.

'నీవు వేరు శారదా!... నీకు స్థిరమైన సంకల్పం ఉంది...ఒకసారి ఒక విషయాన్ని కాదనుకొంటే మళ్ళీ తిరిగి దానికేసి కన్నెత్తి కూడ చూడవ్...నీకామహోన్నిగ్రహం ఉంది... కానీ నాకు లేదు... నేను నీవు మరచి పొమ్మని చెప్పినంత తేలిగ్గా మరచి పోలేను... నీవు నాపట్ల ఇంత అనురాగం చూపి'...

అతను కనుబొమలు పైకెత్తుకొని, తన దుర్బల హృదయాన్ని గూర్చి స్వగతంగా మాట్లాడుకొంటూన్నట్లుమాట్లాడ సాగాడు.

అతను మాటలు పూర్తి చెయ్యకముందే ఆమె బాధగా కళ్ళుమూసికొని నిట్టూర్పు విడిచి...

'అనురాగం — అనుబంధం అవన్నీ విస్మరించాలి మధూ!... అవి పెద్ద పెద్ద మాటలు. వాస్తవజగత్తులో వాటికున్న



విలువ ఏమిటో నేనిప్పుడే గ్రహిస్తున్నాను... మన ఇష్టాయిష్టాలతో జీవితాన్ని తీర్చి దిద్దుకోలేము మధూ... జీవితం చెప్పినట్లు మనం నడుచుకోవాలి...మా నాన్నా— చెల్లి వీళ్లను ఇలా వదిలిపెట్టి నేను రాలేను ... అలానే నీవు కూడ... మీ అమ్మ కోరిన కోడలినే ఇంటికి తీసికెళ్ళు...' అంటూ కొద్దిసేపాగి...

'మానవుడు తన చుట్టూ నిర్మించుకొన్న ఈ కృత్రిమ వలయాలు సామాన్యమైనవికావు...మధూ...వాటిని దాటి మనం అవతలికి వెళ్లటం అసాధ్యమైనపని' ... విషాదంగా ఉన్న ఆమె ముఖం క్షణంలో గంభీరమైపోయింది.

'వీళ్లందరి కోసం నా జీవితం ఈ విధంగా దుఃఖమయం చేసికోవట మెందుకు?... ఈ శిక్ష అనుభవించటానికి నేను చేసిన అపరాధమేమిటి'...

'చాలు— చాలు...ఇక— ఆ విషయాలు ప్రస్తావించకు... వెళ్లు' ఆమె అటు తిరిగి వేలు బయటికి చూపింది.

'సరే శారదా!'...అతను ఆవేశంతో ఆమె ముందుకొచ్చి నిలబడ్డాడు. 'నేను వెళతాను...నాకు దూరమై నీవు సుఖంగా... శాంతంగా ఉండగలవా?... ఆ విషయం చెప్పు ... ఉండగలనని నీ పెదవులతో చెప్పు...నా మనసును ఎలానో సరిపెట్టుకొని నా బ్రతుకింతేనని వెళ్లిపోతాను'... సజలనేత్రాలతో ఆమె కళ్లల్లో సూటిగా చూస్తూ అన్నాడు.

'ఏడవకు మధూ ... చూడు ఎవరైనా చూస్తే ఏమనుకొంటారు ... కూర్చో'... అంటూ ఆమె అతనికి ఓర్చటానికి ప్రయత్నించ సాగింది.

అతను కూర్చోలేదు. టేబిల్‌కు ఆనుకొని,

'మా వాళ్ళూ... మా అమ్మా...నిరక్షరాస్యులు ... ఉన్న ఊరు సంబంధమని శివరామయ్యగారి ఆస్తంతా మాకు కలిస్తే నాల్గు తరాలవరకూ సుఖంగా కాలం గడపవచ్చని ఆమె ఆశ... ఆమె... అంతకన్న ఎక్కువ ఆలోచించలేదు ... మీ నాన్న ... స్వాతంత్రం ... స్నేహం ... సభ్యత అని నిత్యమూ ... మాట్లాడుతారు ... నీ ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ఎందుకిలా చేస్తున్నారు'...

'నా ఇష్టాయిష్టాలతో ప్రమేయం ఎందుకు లేదు...ఉంది'...

'అంటే...నీకు'

'అవును... నాకిష్టమేననిచెప్పాను ... నా సమ్మతివిూదనే ఈ పెండ్లి ఏర్పాట్లు జరుగుతున్నాయి' ... నిశ్చితకంఠంతో పలికింది... మనసును స్థిరపరచుకొని ముడివేసికొన్నాడు. పెదవులు కంపించాయి.

ఆమె తనను అసహ్యించుకొని అవమానపరిచినప్పుడుకూడ అతనికళ్లల్లో అలాటి క్రోధభావం ఆమెకు కనిపించలేదు. ప్రేమించానని నమ్మించి ఇలా నిరాశపరిచి అవమానించినందుకు అతను నిలువెల్లా కంపించిపొయ్యాడు.

'నీవలాచూడకుమధూ ... నేను భరించలేను ఆ చూపు ... ఈ నిర్ణయానికి నేను వెంటనే రాలేదు....పరిస్థితులు అలాటివి. నా ఒక్కర్తె మూలంగా ఎందరి జీవితాలు నాశనమైపోతున్నాయో చూడు ... మీ అమ్మ ...మీమామ...ఊర్మిళ ... మీబంధువులు ...ఎందరిహృదయాలను క్షోభపెడుతున్నావో ఆలోచించు...

'అయితే...వీరందరికోసం జీవితాంతం... కుమిలిచావాల్నా?'...

'తప్పదు...ఇకవెళ్ళు...ఎవరైనావస్తారు' ...బుసబుస పొంగిపోతూన్న ముఖాన్ని అరచేతుల్లోదాచుకొంది ప్రక్కకు తిరిగి—

'అయితే ... నీ నిర్ణయం మార్చుకోనంటావ్?'...

'సరే...శారదా.. సెలవ్, .. 'అంటూ గడప దాటబొయ్యాడు.

'మధూ'...ఆమె వణకుతున్న కంఠంతో పిలిచింది.

'చెప్పు'...అతను వెనుతిరిగి చూడకుండ సమాధానం చెప్పాడు.

... ..

'నాతో చెప్పే విషయాలేమీలేవు ... నన్ను మళ్లీ పిలవకు...మనసు రాయిచేసుకొని వెళ్లిపోతున్నాను'... పెల్లుబికి వస్తూన్న దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

'ఒక్కసారి ... ఇటుచూడు' ... ఆమె కంఠం రుద్ధమైపోయింది. దుఃఖం ముంచుకొస్తూన్నప్పుడు బలవంతాన అదుపులో పెట్టుకొంటూన్న స్వరం... అతను మెల్లగా మెడ ప్రక్కకు తిప్పుకొని చూశాడు.

ఆమె చెక్కిళ్లపై కన్నీరు ధారాప్రవాహంగా కారిపోసాగింది. పెదవులు గట్టిగా కరచి పట్టుకొంది. కన్నీటితో పరివేష్టితమైన నల్లని విశాల నేత్రాలు అతనిని ఏకదృష్టితో చూస్తున్నాయి.

అతను ఆమెను సమీపించి చెక్కిళ్లపై కన్నీటిని అనునయంగా తుడిచాడు. ఆమె ఉద్వేగంతో అతనిని పెనవైచుకుపోయింది. ఒకరి కౌగిలింతలో మరొకరు విలీనమైపోయి ఓ నిముషంపాటు ఏడుస్తూ స్తబ్దంగా ఉండిపొయ్యారు.

'నిజంగా...వెళ్లిపోతున్నావా?...ఇక మళ్లీ కనిపించవా'...మరి... నేను... నేను'...ఆమె వెక్కెక్కి ఏడ్చి తన చేతిని అతని చేతిలో పెట్టింది.

* * *

ఆపగలంతా సూర్యుడు నిప్పులుచెరిగిపోశాడు. ఎన్ని మంచినీళ్ళు త్రాగినా దాహం



# మేలిరకం "డస్ట్" టీలలో సాటిలేనిది



# లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ




ఈ టీతో మీరు కమ్మని, చిక్కని బంగారు ఛాయగల టీ కప్పుల వెంబడి కప్పులు అతి త్వరలో తయారు చేయకలుగుదురు. ఈ పానీయమును మీరే త్రాగి చూడండి. అతిథులకుకూడా యివ్వండి. మీరు తప్పక సంతోషముతో వికసిస్తారు. అవును–మీ ఆనందభరితులైన అతిధులుకూడాను. లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ మేలిరకం టీలలో నిజంగా అద్వితీయమైనది.

## లిప్టన్స్ అంటే మంచి టీ




LHGC-3 TB

# మట్టి బొమ్మలు

తీరక వాలక పిడచకట్టుకపోయ్యే భయంకరమైన ఎండకాసింది. ఉయ్యాలలో పసి కందులు నోళ్ళు తెరచుకొనేలా వడగాలులు నిర్విరామంగా వీచాయి. ఊరిబయట తుమ్మల తోపు ప్రక్కన ఎండమావులు తరంగాల్లా తళతళ లాడుతూ నిర్విరామంగా పరుగెత్తాయి. భూమి 'దారులు దారులుగా' పగుళ్ళు బారి వానచినుకుకోసమై తపించి పోసాగింది పొద్దు గూకింది.

సాయంత్రానికి ఎండతగ్గింది. గాలిలో సెగలు అలానే ఉన్నాయి.

ఆవేళ ఎండంతా ప్రసాద్‌మీదుగా పోయినట్లు ముహమంతా నల్లబడిపోయి గుంటూరునుండి తిరిగి వచ్చాడు. అయినప్పటికీ ముఖంలో కొత్త కళాకాంతులు కనిపిస్తున్నాయి. శారీరకమైన అలసట పైకి కనిపించినా ఏవో కొత్తఆశలు తనలో చిగురుస్తున్నట్లు చిరునవ్వులు చిందిస్తున్నాడు. జీవితంలో ఒక కొత్తమలుపులో తాను ప్రవేశిస్తున్న ఆనందం అతన్ని వెల్లువలా ముంచెత్తుతోంది. అతను పుట్టినది మొదలు అపేక్షఅంతఃకరణ అనురాగాలకు నోచుకోలేదు. మొండిగా పెనుబండపై పెరిగే బొమ్మజెముడులా ఇన్నాళ్ళూ పెరిగాడు

'కొత్త బట్టలూ– చీరెలూ — నగలూ ఏమిటేమిటోఉన్న రెండుమూడు పెద్దపెద్ద 'పార్శెల్స్' పట్టుకొని బస్సుదిగిన వెంటనే హుటా హుటి పెద్ద పెద్ద అంగలు వేసికొంటూ మాష్టారింటివైపు నడిచాడు.

తాను తెచ్చిన వస్తువులు ఎంత విలువైనవో—అవి ఎన్నిక చెయ్యటానికి అతనికి ఎంతకాలం పట్టిందో—ఎన్ని షాపులు — ఎన్ని వీధులు— ఎలా తిరిగాడో ఇవన్నీ 'భానూ'నీ—'శారద'ను పిలిని కూర్చోబెట్టి ఒక్కొక వస్తువునూ, సుతారంగా పట్టుకొని వివరించటానికి అతని హృదయం ఉవ్విళ్ళూరుతోంది. అనిర్వచనీయమైన ఆనందంతో సతమతమై పోసాగాడు.

తన రాక కొరకు అక్క చెల్లెండ్రిద్దరూ ఎదురు తెన్నెలు చూస్తూ బస్సు బస్సుకూ, చూస్తుంటారని ఎంతగానో అనుకొన్నాడు. వాళ్ళిద్దరూ వాకిట్లోకి ఎదురొచ్చి వాటిని తన చేతుల్లో నుండి లాక్కొని ఆనందోద్వేగంతో ఆ కవర్లుచించి చూసుకొంటారని ఏమోమో ఊహించుకొంటూ వాకిట్లోకి వెళ్ళాడు.

ఎవరూ బయటికి రాలేదు.

తన ఆగమనాన్ని తెలియబరచటానికై బూట్లు పెద్ద పెద్దగా శబ్దం చేసికొంటూ ఆశగా లోనికి చూశాడు ఇల్లంతా నిర్మానుష్యంగా నిర్జనంగా ఉంది. ఇప్పటివరకూ తన కొరకూ ఎదురుచూసీ చూసీ, ఏవైనా పనులు చూసికొంటున్నారేమోనని మనసు సరిపెట్టుకొన్నాడు. తాను తెచ్చిన వస్తువులు ఒక్కొకటే మంచంపై పెట్టాడు. ఆ కవరు చించి మొదటి పారిగా, అతని వివాహ సందర్భంలో కట్టుకోటానికి కొన్న జరీ అంచు ధోవతులు తీశాడు.

ఉత్తరీయం, చొక్కాలు–పంట్లాంలు—అవీ—ఇవీ బయటపెట్టుకొన్నాడు. తరవాత 'శారద' కొరకు 'భానూ' కొరకు తెచ్చిన చీరెలు కొత్తబట్టలూ అన్నీ విప్పి ఇల్లంతా పరిచాడు ప్రదర్శనశాలలో వస్తువుల్లా. ఇక వాళ్ళను కేకవేసి పిలిపించాలనే ఉత్కంఠ గొంతువరకూ వచ్చింది. అంతలోనే... చేతుల్లో మల్లెపువ్వుల పొట్లం ఉంది.

'టేబిల్' పై పెట్టబోయ్యాడు.

'మధు' చేవ్రాలుతో వ్రాసిన కాగితాల కట్ట అక్కడ కనిపించింది. ఒకదానిని పైకి తీసి చదవసాగాడు.

'డియర్...శారదా!'

రెండు మూడు వాక్యాలు చదివాడు. ఇక చదవలేక పోయ్యాడు. తన ప్రేమను—అంతరంగాన్ని శారద ఎదుట 'మధు' వ్యక్త పరచుకొంటూన్న మాటలు. శారదతో ముఖాముఖి మాట్లాడుతున్నట్లున్న శైలి... నాల్గయిదు పేజీల ప్రేమలేఖ — చివరలో నీ 'మధు'—అని వ్రాసి ఉంది.

అక్కడున్న ఉత్తరాలన్నీ అలానే ప్రేమతో పొంగి పొరుతున్నాయి. ముద్దులతో నిండి పోయ్యాయి. కొన్ని ఇంగ్లీషులో కూడ వ్రాసి ఉన్నాయి.

ఆ ఉత్తరాలను ఒక్క క్షణకాలం పరిశీలించి మ్రాన్పడి పొయ్యాడు, అద్దంలా సున్నితమైన అతని హృదయం భళ్ళున పగిలిపోయినట్లు బాధతో కనురెప్పలు వాలి పొయ్యాయి. కంపిత హస్తాలతో కిటికీ తలుపులు పట్టుకొని బయటకు చూడసాగాడు.

బయట చల్లని వాన గాలి వీచసాగింది. పగలంతా మిక్కుటమైన ఎండకాయుటాన ఆకాశంలో నల్లని మేఘాలు బరువుగా

అలుముకొనిపోగాయి. ఒక్క పది నిముషాల కాలంలో సెగలతో — పొగలతో పృథ్విని కుతకుత లాడించిన గ్రీష్మ ఋతువు అంతరించి వర్ష ఋతువు ప్రవేశించింది.

'టప్' మని ఒక చినుకు తెగి కిటికీ నుండి జారి అతని ముహంపై బడింది.

కానీ, అచేతనావస్థలో బయటికి చూస్తున్న అతనిలో ఏ సంచలనమూ కలుగ లేదు.

ఉరుములు—మెరుపులతో చినుకులు—గాలి ప్రారంభమయ్యాయి.

ఆ ప్రేమ లేఖలన్నీ పట్టుకొని లోనికి నడిచాడు.

'శారదా...!'

నాల్గయిదు చీరెలు—రవికలూ, టూత్ పేస్ట్—సబ్బు— టవలు— ప్రయాణానికి తాత్కాలికమైన అవసరాలన్నిటినీ 'జిప్ బాగ్'లో సర్దుకొంటోంది. ఆమె వెనుతిరిగి చూసింది.

ప్రసాద్‌ను చూడగానే ఆమె సర్వావయా ల్లోనూ సంచలనం వ్యక్తమైంది. ఆమె హృదయం గతుక్కుమంది మబ్బుపట్టిన ఆకాశంలా ఉంది ఆమె ముఖం. భయంతో కంపించి పోతూ చేష్టలుడిగి, అలానే ప్రసాద్‌కేసి చూస్తుండి పోయింది.

'శారదా!'... గొంతు పెగలించుకొన్నాడు.

'నీ ఉత్తరాలు — నీవు టేబిల్ మీద పెట్టి మరచిపోయినట్లున్నావ్. ఇవిగో - దాచుకో'... అంటూ వాటిని ఆమె చేతిలో పెట్టబోయ్యాడు.

అవి మధ్యాహ్నం తను 'మధు'తో పూర్తి మమతాబంధాన్ని త్రెంచుకోవటానికి నిశ్చయం చేసికొని అతని చేతిలో పెట్టింది. కానీ అంతలోకే తెలియని అశక్తత ఆమెలో ప్రవేశించి అతనిని కౌగలించుకొని ఏడ్చింది. తనతో జీవితం గడపటానికి తన సమ్మతి తెలిపింది. ఆ ఉద్రేకాల పొంగులో పరస్పరం ఒకరి కౌగిలిలో మరొకరు లీనమైపోయి ఆ ఉత్తరాలను అక్కడే విస్మరించారు.

ఆమె కళ్ళముందు చీకట్లు కమ్మాయి.

'ప్రసాద్ ... ప్రసాద్' ... క్షీణిస్తున్న కంఠ స్వరంతో మెల్లగా పిలిచింది.

'నాకు గుండెల్లో బరువుగా ఉంది ... ఏమిటో భయంగా ఉంది'...అంటూ కళ్ళు తిరుగుతున్నట్లు కళ్ళు మూసికొని, ఉత్తరాలు అందిస్తున్న అతని చేతిని గట్టిగా పట్టుకొని— కప్పలా కూలబడిపోయింది— అతని పాదాల ముందు. (ఇంకా వుంది)

# వారఫలం

**15-9-1967 శుక్రవారం మొదలు 21-9-1967 గురువారం వరకు.**

**మేషం** వృత్తివ్యాపారాల్లో మీరు యిది వరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు కార్యరూపాన్ని ధరిస్తాయి సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు వారాంతంలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి మీ తాలూకు వస్తువులు పోవచ్చును అధిక వ్యయం జరుగుతుంది

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు

**వృషభం** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి పోటీవారిలో గౌరవం లభిస్తుంది సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి దైవ కార్యాలు నెరవేరతాయి

**మిధునం** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి వ్యాపారంలో గౌరవం బాగా ఉంటుంది స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కర్కాటకం** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకుంటాయి సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వ్యాపారంలో క్రమంగా ఆదాయం పెరుగుతుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

స్త్రీలకు — కుటుంబ కార్యక్రమాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి అధిక వ్యయం జరుగుతుంది

**సింహం** ఉదాయం వారం యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వృత్తిలో ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు వారాంతంలో చికాకులు యేర్పడతాయి ప్రయాణాలు వాయిదా పడతాయి ఆందోళన కలుగుతుంది

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు బంధుమిత్రులను కలుసుకొంటారు

**కన్య** వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది రావలసిన డబ్బు మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు పోటీవారితో మాట పట్టింపులు రావచ్చును సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి ఆడంబరం కోసం వ్యయం చేస్తారు

**తుల** మీ ఆలోచనలు మీకేకాక మీ మిత్రులకు కూడా లాభించగలవు సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద లభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**వృశ్చికం** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి గాని మీ స్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది ఆర్థిక వ్యవహారాలను గురించి మాటలు తగవు నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి దైవకార్యాలు నెరవేరుతాయి

**ధనుస్సు** వ్యాపారంలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు. మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు

**మకరం** భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి సమయానికి యేదో ఒక విధంగ డబ్బుచేతికి వస్తుంది ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది కోర్టు వ్యవహారాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి నూతన విషయాలను తెలుసుకొంటారు

**కుంభం** వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి నూతన వ్యవహారాలు లాభించగలవు అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగ నెరవేరుతాయి ఆర్థిక వ్యవహారాలు వారాంతంలో బాగా ఉంటాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మీనం** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడుతాయి మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది ఉద్యోగంలో, యెవరినీ విశేషంగా నమ్మడం తగదు వారం ఆఖరులో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది బంధుమిత్రులను కలుసుకొంటారు.

—మహేష్ ●

## అభియోగాలలో వింతలు

# పెండ్లికోసం పదహారేళ్ళ పడతి పాట్లు

గర్భవతివలే కనిపించేందుకని పదహారేళ్ళ వయస్సు పడతి తన దుస్తులలోకి మూడు దిండ్లను ఇరికించినది. నిజం. న్యాయస్థానంలో ఆమె యీ సంగతి చెప్పింది. ఎందుకూ? ఎందుకూ యీ తంటాలంతా అని న్యాయస్థానం ప్రశ్నించగా "మరి నా చెలికాడు పెళ్ళి చేసుకోకపోతే ఏంచెయ్యనూ?' అన్నది.

సరే. పెళ్ళి జరిగింది. నిజం భర్తకు చెబుదామనిపించినది. కానీ భయపడినది చెప్పలేదు సరిగదా ఎక్కడినుంచో ఒక పాపను ఎత్తుకువచ్చింది. తనకు పుట్టిన బిడ్డయేనని భర్త నమ్ముతాడనుకున్నది.

మూడువారాలు, పాపం, యీ పడతిని జైలులో ఉంచారు. ఆ తరువాత బర్నింగ్ హామ్ న్యాయస్థానంలో హాజరుపరచారు. బిడ్డను ఎత్తుకువచ్చానని ఆ పడతి ఒప్పుకున్నది.

రిమాండ్‌లో ఉండగా మహిళా పోలీసు అధికారిణితో ఇట్లా చెప్పిందిట: 'అబద్ధాలు చెప్పి, చెప్పి విసిగిపోయాను. నాకు వెరి తప్పలేదు. పెండ్లి చేసుకోడం కోసమే ఆ వేషమంతా వేశాను.'

బిడ్డను ఎత్తుకుపోయిన రోజున ఆమె మనస్సు చాలా కల్లోలంగా ఉన్నదని పోలీసులకు ఆమె చెప్పింది. సాయంకాలం ఇంటికి రాగానే, మధ్యాహ్నం నాకు యీ పాప పుట్టిందని చెబుదామనే ఆశతో బిడ్డను ఎత్తుకపోయింది.

కానీ, పాపం, ఆమె ఇంటికి తిరిగి వెళ్ళేప్పటికే, భర్త వచ్చిఉన్నాడు. 'నాభర్త అప్పటికే ఇంటికి వచ్చివుండకపోతే పాపను అట్టేపెట్టుకునేదాన్ని' అన్నది ఆమె.

ఇక అమె నాకు అవసరంలేదన్నాడు. ఆమె భర్త న్యాయస్థానంలో. న్యాయస్థానం ఏమిచెయ్యాలి యీ పరిస్థితులలో.

ఆ పడతి తల్లితో మాట్లాడి, "ఏదో ఒక యేర్పాటు చేయడానికి వీలుగా విచారణను మరో మూడువారాలు న్యాయస్థానం అధ్యక్షురాలు లేడీ బర్మాన్ వాయిదా వేశారు.

### న్యాయస్థానంలో మూర్ఛపోయిన భర్త

లారీ డ్రైవరు బ్లాక్‌బర్న్ తన భార్య ప్రాటీషియాని చంపాడు. హత్య జరిగే నాటికి ఆమె గర్భవతని న్యాయస్థానంలో వివరించినప్పుడు బర్న్ మూర్ఛపోయినాడు.

బ్లాక్‌బర్న్ వయస్సు 27 సంవత్సరాలు. మార్చిలో అతని భార్య పరారీ అయినది. తుపాకీతో రెండుసార్లు కాల్చి భార్యను చంపాడని బర్న్ మీద నేరారోపణ. కాల్పులు వినిపించిన కొంతమంది ప్రాటీషియాకు సహాయపడానికి నేరం జరిగిన చోటికి పరుగెత్తారట.

వాఙ్మూలంలో బ్లాక్‌బర్న్ ఇట్లా చెప్పాడు: 'నా భార్య అంటే చాలా యిష్టం నాకు. నేను కొంచెం మోటు మనిషినని నా భార్య ఎప్పుడూ అంటూండేది. మరి ఏమి చెయ్యనూ? మరెవరూ నన్ను పెండ్లి చేసుకోడానికి ఇష్టపడలేదు.'

నేరం చేయలేదని వాదించాడు బ్లాక్‌బర్న్. ససెక్స్ విస్సైజెస్ విచారించనున్నది ఈ హత్యాభియోగాన్ని.

### తండ్రిపై దావావేసిన తనయుడు

66 సంవత్సరాల వయస్సువాడైన తన తండ్రితో తన భార్య వ్యభిచరించినదని మైకేల్ ఇలియట్ ఆరోపించాడు న్యాయస్థానంలో. నేరం రుజువైనదని విడాకుల న్యాయస్థానం నిర్ణయించి, ఖర్చులనుకూడా ఇప్పించినది.

మైకేల్ ఇలియట్ వయస్సు 32 సంవత్సరాలు. అతని భార్య వయస్సు 27 సంవత్సరాలు. వ్యాజ్యంలో మైకేల్ ఇలియట్ చేసిన ఖర్చులను కూడా ఇవ్వవలసినదిగా అతని తండ్రి లెఫ్టినెంట్ కమాండర్ ఫిలిప్ జాన్సను న్యాయస్థానం ఆదేశించినది.

వి. ఎస్. అవధాని






మన పూర్వ మహర్షులు కొన్ని వర్ణాశ్రమ ధర్మాలనూ, జనులందరూ సాధారణంగా అనుసరించవలసిన కొన్ని ధర్మాలనూ ఏర్పాటు చేసి ఉన్నారు.

ఇవి ధర్మశాస్త్రాలలోనూ ఇతరాలైన పురాణేతిహాసాదులలోనూ కానవస్తాయి.

శాస్త్రాలలో చెప్పబడిన యీ ధర్మాలూ వేదములను అనుసరించినవే కాని, ఎవరికి తోచినట్లు వారు కల్పించినవి ఎంత మాత్రమూ కావు. 'వేదో ధర్మమూలం' అనే ధర్మ సూత్రం యీ విషయాన్ని తెలుపుతున్నాది.

ఈ ధర్మాలు యుగయుగాల నాటివి!

ధర్మాలన్నీ కొన్ని కట్టుబాట్లకు సంబంధించి వుంటాయి. ఆ కాలపు జనుల పరిస్థితులను బట్టి యేర్పడిన ఆ ధర్మాలను ఇప్పటికీ మనం అనుసరించవలసిందేనా?

ఇప్పటి కాలం వారికి అవి అనుకూలంగా వుంటాయని చెప్పగలమా?

కాలం మారిపోతూ ఉంది. క్షణక్షణానికీ మానవ జీవితంలో ఎన్నో మార్పులు వస్తున్నవి. మానవుడు పురోగమించడానికి ప్రయత్నించాలి కాని తిరోగమించడానికి ప్రయత్నించడం సరికాదుగదా!

ఇవి ఆలోచించవలసిన విషయాలే!

'మా తండ్రిగారు తవ్వించిన నుయ్యి' అనే అభిమానంతో ఆ నూతిలోని ఉప్పు నీటినే తాగుతూ తృప్తిపడతామా? లేక మరో నూతిలోని మంచినీటిని తాగుతామా?

మార్పు అనేది ప్రకృతికి సహజమైన గుణం! దానికోసం మనం ప్రయత్నించనక్కర్లేదు. దానంతట అదే ఏదోవిధంగా వస్తుంది.

అలాగే ధర్మాలలో కూడా మార్పు సహజమే!

అయితే— ధర్మాలన్నీ మారనవసరంలేదు. కొన్నిటికి మార్పు అవసరం; కొన్ని యథాతథంగా—అంటే మార్పు లేకుండా ఉండవలసినదే!

'సత్యాన్నే పలకవలెను (సత్యం వద); ఇతరుల సొమ్ము అపహరించకూడదు (న పరస్వ 'మపహరేత్)' అనే రీతి వేద ప్రోక్తాలైన ధర్మాలు మారనవసరంలేదు. మారకూడదు కూడాను.

ఏకాలంలోనూ 'సత్యం పలక కూడదు; ఇతరుల సొత్తు అపహరించాలి' అని నాగరక ప్రపంచంలోని ఎవ్వరూ చెప్పరు. అన్ని మతాలవారూ అన్ని కాలాల్లోనూ ఉత్తమ ధర్మాలను పాటిస్తూనే ఉంటారు.

కొన్ని ధర్మాలు— అంటే లోక వ్యవహారాలకు సంబంధించేవి మారవచ్చును.

గ్రామసీమల్ని ఏర్పరచడానికి— సరిహద్దు చుట్టూ లోతుగా తవ్వి రాళ్ళు, ఎముకలు, ఊక, భూడిద, చిల్లపెంకులు, బొగ్గులు మొదలైన వాటినివేసి, కప్పి వెయ్యాలని ధర్మశాస్త్రాలలో ఉంది. ఎంత కాలం అయినా అవి భూమిలో కలిసిపోకుండా అలాగే ఉండడమే దీనికి కారణం. పై వస్తువులే కాదు. కాలాన్ని అనుసరించి భూమి భక్షించకుండా వుండే వస్తువులను గ్రామసీమలో కప్పివేసి ఉంచవలెనని.

'యాని చైవం ప్రకారాణి
కాలాద్భూమిర్న భక్షయేత్,
తాని సంధిషు సీమాయాం
అప్రకాశాని కారయేత్.'

అనే శ్లోకం తెలియజేస్తూ ఉన్నది.

కాని, యిప్పుడు కొలతలు మొదలైన సులభ పద్ధతులు సరిహద్దు నిర్ణయానికి ఏర్పడి ఉన్నందున ఈ ధర్మశాస్త్ర విషయాన్ని పాటించనక్కరలేదు.

ఇదే విధంగా గురుకుల వాస పద్ధతిలో కూడా మార్పు రావలసిందే! పూర్వం ఛాత్రులు తలిదండ్రులను విడిచి పోయి, ఒక్క గురువునే ఆశ్రయించి విద్య నేర్చుకునేవారు. విద్యార్థులకు ఆహార విహారాలలోనూ, నిత్యకృత్యాలలోనూ ఎన్నో నియమాలున్నవి.

ఈ కాలంలో విద్యార్థులు అనేక విషయాలను తెలుసుకోవాలి అందుకోసం చాల మంది గురువుల దగ్గర విద్యను అభ్యసించాలి. ఆయా విషయాలు నేర్చుకొనుటకై తగిన పరికరాలూ, అవీ కావలసి ఉన్నవి. కొన్ని విద్యలను నేర్చుకొనుట చాలా దూర ప్రాంతాలకు పోవలసి ఉన్నది. అందువల్ల పూర్వ పద్ధతులు తగవు. వారి నియమాలూ, విద్యా పద్ధతులూ మారాలి. ధర్మశాస్త్రాలలో ఈ విషయంలో చెప్పబడిన ధర్మాలు పూర్తిగా మారిపోవాలి. పాత పద్ధతులు అనుకూలించవు.

ఈ రీతిగానే సాంఘిక ధర్మాలలోనూ మార్పు అవసరమే! సంఘంలో సంకుచితత్వం తగ్గుతూ, విశాల దృష్టి వ్యాప్తికి వస్తున్నది. వెనుకటి ధర్మాలనే అంటిపెట్టుకుంటే ప్రపంచం దృష్టిలో మనం అనాగరక యుగానికి చెందినట్లు కనబడగలం

సత్యం, అహింస, అస్తేయం — మున్నగు వాటికి మార్పు ఉండదు. సంఘాభ్యున్నతి దృష్ట్యా ఆయా సమయాల్లో నిర్ణయించబడిన ధర్మాలు దేశ, కాలానుగుణంగా— పురోగతికి అనుకూలంగా మారడం మేలే! ●



# శ్రీమతి నాసర్ గురించి చాలా మందికి తెలియదు

అబ్దుల్‌గమాల్ నాసర్ అమాంతంగా తన ఉద్యోగం పోగొట్టుకున్నాడనుకోండి -- ఆయన భార్య శ్రీమతి తాహియా ఈజిప్టులోనే ఉండిపోయినా ఎవరూ గమనించక పోవచ్చు!

ఆవిడ ఎలా ఉంటుందో చాలామందికి తెలీదు.

'ఆమె సాధారణం ఒక 'చెలికత్తె'తో కెయిరో బజార్లలోకివెళ్లి సామాను కొనుక్కుంటూ ఉంటుంది. తన మనవల, మనవరాళ్లకి బట్టలుకొంటూ ఉంటుంది — తను ఇంట్లో తయారుచెయ్యనివి. ఆమె పాశ్చాత్య పద్ధతిలో వస్త్రాలు ధరిస్తుంది. అతి సామాన్యమయినవి కొంటూ ఉంటుంది,' అని ఆమెని గురించి పోలీన్ ఫ్రెడరిక్స్ రాసింది.

శ్రీమతి నాసర్ సంగీత కచేరీలకి, నాటకాలకీ, నృత్య ప్రదర్శనలకీ వెడుతూ ఉంటుంది. కాని, అధ్యక్షుని సతీమణిగా కాదు దారిలో వెడుతూ, వెడుతూ ఒక చిన్న కేఫ్‌లో కాఫీ, కేక్‌లు తీసుకుంటూ ఉంటుంది. తన భర్త పెద్ద ఉపన్యాసాలు ఇస్తూ ఉంటే వేదికమీద కూర్చోదు. ఎక్కడో ఒకమూల కూర్చుంటూ ఉంటుంది! 1956 లో, 'సూయెజ్ మాది!' అని నాసర్ చెప్పినప్పుడు ఆమె ఆయన ఉపన్యాసం ఇస్తున్నచోటికి దగ్గరలోనే ఉన్న ఒక భవనం బాల్కనీలో కూర్చుని ఉంది!

1959 దాకా తాహియా నాసర్ రెండే రెండు 'అధికార'యుతమయిన విందులకి వెళ్లింది. ఫరూక్ రాజు పరిపాలనలో వ్యభిచారం మరీ ఎక్కువ అయిపోవటం చేత నాసర్ అధికారంలోకి రాగానే పరిపాలకుల భార్యలు వీలయినంతదాకా సభలకి రాకుండా ఉంటే మంచి దన్నాడు. శ్రీమతి తాహియాకి ఈ సూచన బాగా నచ్చింది అధ్యక్షుడయిన మొదట్లో ఎన్నోసార్లు నాసర్ పెద్ద పెద్ద విందులు చేసినప్పటికీ ఎప్పుడూ సతీసమేతంగా కనిపించేవాడు కాదు. ఇతర అధికారులు కొందరు భార్యలతో వస్తూ ఉండేవారు.

1959 లో ఆమె యుగోస్లావియా వెళ్లింది. ఈజిప్టులో ఆమె టిటో దంపతులతో తీసుకున్న బొమ్మ ఒక్కటీ పత్రికలలో పడలేదు. 1960లో ఆమె ఇతియోపియా వెళ్లింది; అక్కడ హెయిలె సెలాస్సితో బొమ్మ ఒకటి పత్రికలలో పడినా, ఆమె ఎవరయిందీ పత్రికలు పేర్కొనలేదు!

1964లో నికితా క్రుశ్చేవ్ వచ్చినప్పుడు మాత్రం ఆమె పాత అలవాట్లని మార్చుకోవలసి వచ్చింది.

నాసర్ దంపతులకి అయిదుగురు పిల్లలు కుమార్తెలు హూదా, మోనా ఇద్దరికీ వివాహం అయింది. కొడుకులు ఖాలెద్, అబ్దుల్‌హమీద్ హాకీమ్ ముగ్గురూ సెకండరీ స్కూల్‌లో ఉన్నారు. శ్రీమతి తాహియా ఇప్పుడు నలభయ్యో పడిలో ఉంది.

ఆమెకి కుట్టుపని, సంగీతం అంటే ఇష్టం.

ప్రతినెలా ఈజిప్టు అధ్యక్షుడి ఇంట్లో నాసర్ పాతస్నేహితులు -- అందరూ సామాన్యమయిన ఉద్యోగాలలో ఉన్నవారు -- కొందరికి విందు జరుగుతుంది. సామాన్యజనం ఏమనుకుంటున్నారో ఈవిధంగా నాసర్‌కి తెలుస్తుంది. ఈ విందులన్నిటిలోనూ శ్రీమతి తాహియానాసర్ పాల్గొంటుంది

—ఏస్లాడ్ టి జిన్‌గ్రాన్

(ఇన్‌ఫా)

## డాక్టర్ కబుర్లు

### పాము కాటు

పాము కాటుకి చికిత్స గురించి నిపుణులు ఎప్పుడూ వాదించుతూనే ఉంటారు. కాని, కరిచిన చోటు పక్కనే గాటువేసి రక్తం పీల్చడం కన్నా 'ఐస్ వాటర్' చికిత్సే మంచిదనిపిస్తుంది.

ఒక స్పెషలిస్టు 15 తాచుపాము కాటుతిన్న వారికి, 20 'స్టింగర్' అనే జంతువు కాటు తిన్నవారికీ ఈ ఐస్ వాటర్‌చికిత్స ఇచ్చాడు. బాగా పనిచేసిందిట.

పాము కరిచిన భాగాన్ని వెంటనే ఐస్‌వాటర్‌లో పెడితే విషం రసాయనిక శక్తి జోరు తగ్గి దేహానికి దాన్ని ఎదుర్కొనే శక్తి అధికం అవుతుంది.

పాము కరిచిన చోటికి కొంచెం పైగా, గుండె వైపుకి, ఏదయినా బిగించి కట్టాలి. ఐస్‌వాటర్ దొరికేదాకా దీనిని ప్రతి అయిదు నిమిషాలకీ వదులు చేసి బిగిస్తూ ఉండాలి.

ఐస్‌వాటర్ ఎలా తయారు చెయ్యాలి? సగం ఐస్, సగం నీరుగా ఉండాలి. ఇది బాధ కలిగించేటంత చల్లగా ఉంటుంది. కాని అవసరం. (ఉప్పునీరు వాడరాదు. పుళ్లు పడవచ్చు.)

ఐస్‌వాటర్‌లో 5 నిమిషాలు ఉంచిన తర్వాత 'కట్టు' తీసివెయ్యాలి కాని, ఐస్‌వాటర్ చికిత్స మాత్రం ఆపకుండా 24 - 36 గంటలు సాగి తర్వాత, హటాత్తుగా ఐస్‌వాటర్ తీసివెయ్యాలి.

అంటే, ఇదంతా జరుగుతున్నంత



సేపూ వైద్యుడి (ట్రీట్‌మెంట్ అనవసరమనికాదు! అది ఉండాలి.

హెచ్. ఎల్. ఓర్బనోన్ కాపీరయిటు)

# రాణీ అహల్యాబాయి

వనితలలో కెల్ల గొప్పవనిత రాణీ అహల్యాబాయి'

— స్వామి వివేకానంద.

[అది 1754 ఆ ప్రాంతం. మరాఠా సామ్రాజ్యం యుద్ధాలతో ఉడికి పోతున్న రోజులవి. ఒక సైనిక గుడారంలో ఇందోర్ సుబేదారయిన మల్‌హరన్ హోల్కార్ కుమారుడు ఖండోజీ ప్రమాద వశాన మరణించాడు. భార్య అహల్యాబాయి కూడా అదే గుడారంలో వుంది భర్త మరణించిన తరువాత ఆమె 'సహగమనానికి' ఏర్పాట్లు చేసుకున్నది]

'నా చిన్ని కుమారుడు చావుతో అంతులేని దుఃఖంలో మునిగిపోయాను. నువ్వు సహగమనాన్ని చేసూ మరింతగా నన్నెందుకు బాధపెడతావు? నేనా ముసలివాడినయి పోయాను. నీ అయిదేళ్ల బిడ్డను సంరక్షించే వారెవరుంటారు? అంతకంటె ఎక్కువగా, నీ పిల్లలతో సమానమైన వేనకువేల ఇందోర్ ప్రజల్ని ఏం చేయదల్చుకున్నావు? నా ఒక్కగా నొక్క కొడుకు పోయాడు. నువ్వు కూడా సహగమనం చేసేస్తే నా బ్రతుకు ఏం కాను?'

—మల్‌హరన్

[మల్‌హరన్ అంటే అహల్యాబాయికి అమితమైన ప్రేమ. అతనిమాటలు ఆమెను కరిగించి వేశాయి. అహల్యాబాయి విధవ కాక ముందునుంచీ ఆమె తెలివి తేటల్ని మల్‌హరన్ గ్రహించాడు; అందుకే ఆమెకు పరిపాలన గురించిన కొన్ని ముఖ్యవిషయాలను నేర్పివుంచాడు. ఆమెకు సయిన్యంలో ఎలా మెలగాలో చెప్పాడు. ఆమె అర్హతను అన్ని విధాలుగాను గుర్తించిన వాడవడంవల్ల తన తర్వాత రాజ్యానికి సరయిన పాలకురాలు అహల్యాబాయి అని నిశ్చయించు కున్నాడు మల్‌హరన్.]

'ఓ మహాశయులారా! నేను మరో కొద్ది నిమిషాల్లో మరణిస్తాను. నా కోడలు అహల్యాబాయి నాతర్వాత ఈ రాజ్యానికి మహారాణి అవుతుంది. నా మనవడు పెరిగి పెద్దవాడై రాజ్యార్హతను పొందేవరకు నాకోడలే మీకు మహారాణీ. మీకష్ట సుఖాలను చూడడంలో అహల్యాబాయి ఏమైనాలోపం చేస్తుందేమోనని ఏమాత్రము సంకోచించవద్దు'

—మల్‌హరన్]

[అహల్యాబాయి పరిపాలనా బాధ్యత వహించిన కొన్నేళ్లకు ఆమె కుమారుడు చనిపోయాడు. 1695 వరకు ఆమె పాలించింది. సయిన్యాన్ని నడపడానికి తుకోజీ అనే అతన్ని అధిపతిగా నియమించింది. పొద్దుపోయే వరకు దర్బారుపనులు చూసుకుంటూ వుండేది ఆమె పరిపాలించినంత కాలమూ యుద్ధాలుగాని, అల్లకల్లోలాలు గాని ఆరాజ్యం దరిదాపులకి వచ్చేవి కావు. పక్క రాజ్యాలు అసూయపడేలా ఆమె పాలించింది]

'మరాఠా అధినేతలయిన ఓ పీష్వాల్లారా! మీరు మా రాజపుత్ర స్థానం మీదికి దండయాత్రలు ఎప్పుడు కట్టిపెడతారు? మీ సోదరి అహల్యాబాయి మార్గాన్ని ఎందుకు అనుసరించరు? ఆమె రాజ్యంలోనే కాకుండా మీ మా రాజ్యాల్లోని అశాంతిని కూడా ఆమె చక్కబరచడానికి ప్రయత్నిస్తూ వున్నది. మా రాజపుత్రులే ఆమెను 'తల్లి' అని పిలుస్తున్నారు.'

— రాజపుత్రులు

[పరిపాలనా పరంగా అహల్యాబాయి నిష్పాక్షికమైన రాణి. దయ, కరుణ ఆమెకు ఆభరణాలు.]

'తన రాజ్యాన్ని పాలించుకోవడంలో అహల్యాబాయి సాధించిన విజయం అత్యద్భుతమైనది.'

—(భారతదేశచరిత్రలో) సర్ జాన్ మాల్‌కోమ్.

[అహల్యాబాయి ఉదార హృదయం దేశ

## వార్తలలో వనిత

సిక్కిం మహారాణి గ్యాల్మో మహారాజు చోగ్యాల్ భారతదేశంలో పర్యటించే నిమిత్తం ఈ వారం మద్రాసు వచ్చారు.

కుమారి హోప్‌కూక్ అమెరికన్ మహిళ, ఆమె సిక్కిం చోగ్యాల్‌ని, వివాహం చేసుకున్న తర్వాత గ్యాల్మో అయింది.



రాజదంపతులక మద్రాసులో ఘనమైనస్వాగతం లభించింది. మద్రాసులోని ముఖ్యప్రాంతాలను, మహాబలిపురం, కంచి, తిరుచినాపల్లి, తిరువాణ్ మయూర్, తంజావూరులను వారు సందర్శించారు. మాజీ రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్‌ని కలుసుకొని ఆయనతో సంభాషించారు

మద్రాసురాష్ట్రంలోని శిల్పాలను, ఆలయాలను దర్శించి ప్రాచీన హైందవ శిల్ప కళాప్రాశస్త్యాన్ని గ్యాల్మో కొనియాడారు. ఎనిమిదో శతాబ్దంలో పల్లవ రాజైన రాజసింహుడు సముద్రతీరాన నిర్మించిన దేవాలయాన్ని కాంచీపురంలోని వరదరాజస్వామి దేవాలయాన్ని, స్వామివారి ఆభరణాలను తిరుచిరాపల్లిలోని గ్రాండ్ ఆనికట్‌ని, రాతి దేవాలయాన్ని దర్శించారు. దేవాలయాధికారులు రాతి దేవాలయం నమూనా బొమ్మని రాజదంపతులకి బహూకరించారు. అక్కడ ఉన్న కరికాల చోళుని విగ్రహాన్ని కూడా వారు చూచారు. తిరువాణ్ మయూర్‌లోని కళాక్షేత్రాన్ని సందర్శించి అక్కడ భరతనాట్య ప్రదర్శనను తిలకించారు.

రాజదంపతుల గౌరవార్థం మద్రాస్ గవర్నర్ విందుచేశారు. 'దీపపు సమ్మె'ను వారికి గవర్నర్ బహూకరించారు. ప్రభుత్వం తరఫున గ్యాల్మోకి నగిషీ చెక్కబడిన దీపపు కుందిని బహుమతిగా యిచ్చారు.

—తస్కర్

మంతటికీ తెలుసు. కాశీ నుంచి రామేశ్వరం వరకు ఉన్న ధర్మ సంస్థల్లో ఆమె పాత్ర ఎంతో అధికమైనది. కాశీ విశ్వేశ్వరుని దేవాలయాన్ని మూర్తి సోమనాదుని దేవాలయాన్ని ఆమె పునర్నిర్మింప జేసింది కలకత్తా నుంచి కాశీకి నిర్మించిన బాట ఎప్పటికీ మరవరానిది]

'అనాటి అహల్యాబాయి పరిపాలన యిప్పుడొక కథలాగ కనిపిస్తుంది. ప్రభుత్వాన్ని అంత గొప్పగా నిర్వహించి ప్రజల్ని ఆనందింప జేసింది. ఆమె బ్రతికున్న రోజుల్లో ఎంతో గవురవాన్ని అందుకున్నది. ఇప్పుడు దేవతగా పూజించవలసిన వనిత!'

—డిస్కవరీఆఫ్ఇండియాలో జవహర్లాల్ నెహ్రూ. —వి. సు. ●

---

డి. జి. పి, గునుపూడి

బాధకు బాధ్యతకు అవినాభావసంబంధమేమిటి? బాధను ఆధారం చేసుకుని బాధ్యతను విస్మరించవచ్చా?

హక్కులకి బాధ్యతలకి ఉండే సంబంధమే కాని అన్ని బాధ్యతలూ బాధకావు. కొన్ని తీయని బాధ్యతలు కూడా ఉంటాయి తమ్ముడూ. ఇక విస్మరించడం అంటారా? ముల్లు గుచ్చుకుంటే బాధ అని దాన్ని తీసి వేయడం అన్న బాధ్యత విస్మరిస్తారా ఎవరైనా?

సి. ఎస్. ఎల్, సామర్లకోట

ఆర్థికంగా సమానత్వాన్ని పొంది ఎవరి స్వార్థం వారు చూసుకొనే ఈ రోజులలో ఇంకా ఈ స్త్రీ పురుషభేదం ఎందుకు మిగిలి ఉంది?

ఆర్థిక సమానత్వం అనేది ఉంటే అది మానవ కృషి ఫలితం. ఇక స్త్రీ పురుష భేదం అంటారా దైవికం. కొంపదీసి 'మగవాళ్ళు పిల్లల్ని కనాల'నే టంత స్త్రీ జనాభ్యుదయవాదులా మీరు?

ఎ. ఆర్, విశాఖపట్నం

విద్యార్థులకు నేటి సంఘంలో కల అర్హతలేమిటి? హక్కులేమిటి?

చదువుకునే కుర్రవాళ్ళకి చదివేపదువే అర్హత నిస్తుంది ఇకపోతే హక్కు అంటారా? సంపాదనాపరులు కాని విద్యార్థులు తండ్రి చాటు బిడ్డలే వారికి బాధ్యతలేగాని హక్కులు చాలాతక్కువ ఉంటాయి.

కుమారి ఇ. బరంపురం

డాన్సు స్కాలర్‌షిప్‌కోసం ఎలా దరఖాస్తు పెట్టుకోవాలి?

రాష్ట్ర సంగీత నాటక అకాడమీ వారికి వ్రాస్తే వివరాలు పంపిస్తారు.

శ్రీమతి హెచ్. ఆర్, భూపాల్

సమాధానాలు యితరులను ఎగతాళి చేస్తున్నట్లు ఇస్తారెందుకు?

ప్రశ్నమనుబట్టే సమాధానం ఉంటుంది. అయినా ఆమాత్రపు వేళాకోళం కూడా భరించలేరా? నా సమాధానాలలో వ్యంగ్యం ఉండవచ్చు, సున్నితమైన హాస్యం ఉండవచ్చు' అవహేళన మటుకు వుండదు.

శ్రీమతి ఎం. ఆర్, కడప

ఈ ఊళ్ళో మంచిస్కూళ్ళు లేవు మావారు పంపించి కాన్వెంటులో పిల్లల ని చదివించాలని. మావారు ఒప్పుకోడం లేదు.

ఉన్నవూళ్ళో ఎప్పటికైనా సరిపెట్టుకోక తప్పదు. ఒక్క కాన్వెంటులలో తప్పించి పిల్లలకి అక్షరం ముక్క రాదన్న అపోహ వదిలి. హాయిగా ఏస్కూల్లోనో పిల్లలని చేర్పించండి.




హెచ్. కె. పి, స్తంబరి పల్లి

నేడు విరివిగా వెలువడుతున్న పాకెట్ సైజు సాహిత్యంపై మీ అభిప్రాయం రెండుముక్కల్లో చెప్పండి.

అందరూ చదువుతున్నారు!

కుమారి వి. కె, ఆత్మకూరు

జన్మలో పెళ్ళి చేసుకోకూడదని భీష్మించుకున్న వ్యక్తులుకూడా ఒక సమయంలో మూడుముళ్ళు వేయడానికి క్షణం కూడా ఆలోచించరు. ఈ మార్పు ఎలా వస్తుంది?

కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదన్న సామెత ఇందుకే పుట్టింది చిట్టితల్లీ దీన్నే ముహూర్తబలం అని కూడా అంటూ ఉంటారు.

కె. ఎస్, ఖర్గపూరు

తాము చేస్తున్నపనే యితరులు చేస్తున్నప్పుడు కువిమర్శ చేస్తారెందుకు?

'నేచెప్పిన మాటలువిని, చేసే చేతలుమాను' అని కదా! తన వెనక వలుపు వుందన్న సంగతి గురివింద గింజ ఎన్నటికీ గుర్తించదు!

కె. టి., కె. కె, జయపురం

కో—ఎడ్యుకేషన్‌పై మీ అభిప్రాయం ఏమిటి?

అదే ఉంటే ఆడపిల్లల వెర్రివేషాలు అబ్బాయిల అల్లరి చాలామటుకు తగ్గిపోతాయని నా విశ్వాసం.

కుమారి జి. ఆర్, రాయకుదురు

నోటితో మాట్లాడుతూ, నొసటితో వెక్కిరించే మహిళలే ఎక్కువ అంటే నమ్ముతారా?

అదొక కళగా ఆడవారు పెంపొందించారు. నమ్మకపోవడం ఎలాగ? అందుకేగా ఆడవారి మాటలకు అర్థాలు వేరు అన్న నానుడి వచ్చింది!

బి. కె, హైదరాబాదు

రోడ్డువెంగ వెడుతున్న అమ్మాయిలని చిన్నవాళ్ళే కాదు, ఆఖరికి పెద్దవాళ్ళు కూడా వెనక్కి తిరిగి చూస్తారేం తలతిక్క?

చూడడం అన్నది సహజమే. కాని అసభ్యకరమైన కామెంటులు ప్రతిపాదించడం సహించరానిది.

ఏ. ఎస్, విజయవాడ

లోకంలో మనుష్యులు (ఒక్క పిచ్చివాళ్ళు మినహా) ఇతరులను చూసి నవ్వుతారేగాని తమని చూసి నవ్వుకోలేరు ఎందుచేత?

తమలోపాలు తెలుసుకుని నవ్వుకోకలిగినవాళ్ళు అటు మహా జ్ఞానులో, ఇటు పిచ్చివాళ్ళో కావాలి. సామాన్య మానవులు ఈరెండు తెలిగలకీ మధ్య ఊగిసలాడేవారే.

వి. వి. ఎస్. ఎమ్, కొత్తగూడెం

స్త్రీ స్వతంత్ర భావాలుకల్గి, వివాహ సంస్థలో కూడా తన అభిరుచులు ఆచరణలో పెట్టాలనుకొంటున్న సమయంలో ఒక స్త్రీని తన భర్తకు ఇష్టమైనట్టుగా ఉద్యోగం చేయవద్దని సలహా యివ్వడంలో ఆంతర్యం ఏమిటి?

దాన్లో పెద్ద ఆంతర్యం ఏముంటుంది మూర్తిగారూ, తన అభిరుచులకు అనుగుణ్యంగా వివాహం చేసుకొన్న స్త్రీకూడా భర్త అభిరుచికూడా పాటించేపాటి యింగితం కల్గివుందని నానమ్మకం. సంసారం రెండు చక్రాల బండి జీవితమూ గతుకులరోడ్డు. సాఫీ ప్రయాణానికి కనీసం చక్రాలయిన—భార్యాభర్తలైనా— సమావంగా దొర్లేవి ప్రధానం కదా?

ఎ. ఎస్. జి, భాన్స్‌వాడ

ఈ రోజులలో మృత్యువుకు భయపడని మానవుడు దేనికి భయపడాలి?

దైనందిన జీవితాన్ని తల్చుకుని.. .....

జి. అనంతపురం

కలం పేర్లు పెట్టుకోవడం తప్పంటారా?

తప్పులేదు ఆ కలంపేరుతోనైనాసరేయువారి విషయంకాక స్వంత ఉత్తరం వ్రాస్తే చాలు! (ఇరుగు పొరుగు వారిని ఇరికించే ప్రబుద్ధులే ఎక్కువగా కనబడుతున్నారు!)

ఎమ్. కె, తెనాలి

మానవునికి మంచి, చెడు తెలుసు. కాని చెడుచేసినట్టు మంచి చేయలేడు. దానికి కారణం అతని బలహీనతా? దేవుని అనుగ్రహమా?

మాట్లా మంచి చేయని దేవుని అనుగ్రహాన్ని ఎందుకు శంకిస్తారు. మానవుని బలహీనతే అనండి.

**జి. వి. ఎల్, చిన్నగంజాం**

స్త్రీ, పతి అడుగు జాడలలో నడవాలంటారు. కాని భార్య భర్తకు అడుగడుగునా సలహాలిస్తూ మంత్రివలె మెలగా లంటారు. ఏది అనుసరించాలి?

ఏది అనికాదు, ఎప్పుడేది సరైతే అప్పుడా పద్ధతి అనుసరించాలని పురుషునికి భార్య పని విషయంలో దాసి అయితే సలహాలకు మంత్రి జీవన మాధుర్యం చవిచూపడానికి రంభ! అయితే కష్ట సుఖాలు సహనంగా భరించడానికి భూమాత అన్నారు

**ఎ. ఎల్. ఎస్, టిట్లాఘర్**

మోడువారిన హృదయం చిగురించే ఆశ ఉందా?

హృదయం ఎప్పుడూ మోడు వారదు. కొత్త చిగుళ్లు తొడుగుతూనే ఉంటుంది., ఆకులు రాలుస్తూనే ఉంటుంది.

**సి. ఎమ్, వైరా**

మనిషిలోని సద్గుణంగాని, దుర్గుణం గాని ఎప్పుడు బయట పడుతుంది?

ఎదుటివాడు కష్టాల్లో ఉన్నప్పుడు సద్గుణం, సుఖపడుతున్నాడన్నప్పుడు మన దుర్గుణం బయట పడడం లోకం పోకడ!

**బి. ఎల్. సి, విజయవాడ**

ఏమండోయి గయ్యాళి భార్యలతో వేగే భర్తలకు మీరు ఇచ్చే సలహా ఏమిటి?

ఓర్మివహించునాయనా! అని సోక్రటిస్ భార్య అయిన జాంథిపి గురించి వినలేదా? ఒకసారి స్నేహితులతో కూర్చుని సోక్రెటిస్ చర్చిస్తున్నాడట లోపలి నుంచి భార్య గంటకిపైగా తిట్టి పోస్తోందట. చివరికి భార్యకే ప్రాణం విసిగి ఓ బొచ్చెనీళ్లు తెచ్చి వాళ్లమీద గుమ్మరించిందట అపుడు సోక్రెటిస్ ఏమన్నాడో తెలుసా? "ఉరిమిన మేఘం వర్షించకుండా పోతుందా నాయనలారా!"

**వి. ము. ల, ఉమెన్సుకాలేజి. బరంపురం**

ఎవరైనా ప్రశ్నలకు సమాధానాలు యిస్తున్నారంటే చాలు ప్రేమ, పెళ్లి, పిల్లలు గురించే అడుగుతారు. ఇవన్నీ ఎవరికి వాళ్ల తమలో ఉంచుకోకుండా బయట పెడతారెందుకు? ముఖ్యంగా 'లవ్' గురించే లక్ష ప్రశ్నలు!

అడిగేవారికి చెప్పేవారు లోకువ అన్నది ఎప్పుడూ వినలేదా ఫ్రెండ్స్! సరదాగా కబుర్లు చెప్పేవాళ్లు, ఇంటిదగ్గర నిర్మొహమాటంగా జీవిత రహస్యాలు సత్యాలు చెప్పకల్గిన పెద్దలు, తెలిసీ తెలియని విషయాలలో సతమతమయే మనస్సులే— ఈ ప్రశ్నలు వేయడానికి ప్రబల కారణాలు ప్రేమంటే సినిమాలోలాగే అనీ, పెళ్లి అంటే సినిమాలోలాగే అని యువతీ యువకులు తల పోయడం, పిల్లల పెంపకంలో ఏమీ తెలియని గృహిణులు అలాంటి ప్రశ్నలు వేయడంలో ఆశ్చర్యం లేదు. తప్పులేదు.

# చైతన్యుడు

'సోదరులారా దైవ కృపకి జాతి, కులంబ విచక్షణలేదు!' అని చాటాడు ఒక పుణ్య పురుషుడు అయిదు శతాబ్దాలకి పూర్వం. అతని సందేశ ప్రభావాన్ని నేటికీ జగన్నాథపూరిలో చూడవచ్చు ప్రతి సంవత్సరం జరిగే ఒక పండుగలో ఇక్కడ అన్ని కులాలవారూ కలిసి భోజనం చేస్తారు!

ఈ సందేశం చాటిన మహా పురుషుడిని ఎందరో చైతన్య స్వామిగా పూజిస్తారు. ఈయన క్రీ. శ. 1485లో వంగదేశంలో నాడియాలో జన్మించాడు. ఇది కలకత్తాకి ఉత్తరాన సుమారు అరవయి మయిళ్ల దూరంలో ఉన్నది. భాగీరథీ నది పశ్చిమ తీరం మీద ఉన్నది. నాడియా అప్పటి వంగదేశానికి రాజధాని. అక్కడి సంస్కృత పండితులు జగత్ ప్రసిద్ధి పొందినవారు. చైతన్యుడు ఒక బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు. అందరిలాగే భగవద్గీత, భాగవత పురాణాలని చదువుకున్నాడు. కాని అతనికి ఈ రెండు గ్రంథాలంటే ఎంతో ఇష్టంగా ఉండేవి.

చైతన్యుడు వల్లభాచార్యుడి కుమార్తెని వివాహం చేసుకున్నాడు. అయితే, తన 25వ ఏట గృహస్థాశ్రమం వదిలి సన్యాసి అయి పోయాడు. దేశం అంతా తిరిగాడు. చివరికి కటక్‌లో స్థిరపడిపోయాడు జీవిత శేషం అక్కడే ఉండిపోయి భక్తి ప్రచారం చేస్తూ ఉండేవాడు. మోక్షం భక్తి ద్వారానే సాధ్యం అవుతుందని చైతన్యుడు చెప్పాడు. భక్తి సిద్ధాంతాన్ని ఇంకా ఎందరో వైష్ణవాచార్యులు బోధించారు. చైతన్యుడు తన సిద్ధాంతాన్ని ప్రేయసీ ప్రియుల మధ్య ప్రేమతో పోల్చాడు. ప్రతి భక్తుడూ తన వ్యక్తిత్వాన్ని కోల్పోయి పరమాత్మతో లీనమయి పోవాలన్నాడు.

చైతన్యుడు అహింసా సిద్ధాంతాన్ని కూడా బోధించాడు. లోకంలోని ప్రాణులన్నీ సమానాలే అన్నాడు. ఈ సిద్ధాంతం అప్పటి సాంఘిక పరిస్థితికి కొంత విరుద్ధంగా ఉండేది. బ్రాహ్మణ వర్గాలు చైతన్య మతానికి దూరంగా ఉండేవి. బ్రాహ్మణేతరులే ఎక్కువగా అతని శిష్యులుగా చేరేవారు.

చైతన్యుడు కృష్ణావతారమని ఎందరో నమ్ముతారు. ప్రతి మాఘమాసంలోనూ అతని ఊరిలో చైతన్యమహోత్సవాలు జరుపుతారు.

—ఎస్.



# మల్లన్నమంత్రి మాతృహృదయం

కౌటిల్య



మల్లన్న మంత్రి ఒకసారి తీర్థయాత్రలకు బయలేరి కాశీ పట్టణాన్ని చేరుకొన్నాడు. అంతకుముందే కాశీరాజు మల్లన్న మంత్రి తెలివితేటలను గురించిన కథలను వినియుండంవలన అతనికి ఘనమైన స్వాగతాన్ని యేర్పాటు చేశాడు. తరువాత మల్లన్న మంత్రిని నిండుకొలువులో గౌరవించాడు. కాశీరాజు.

'అమాత్యా! మీ తెలివి తేటలను గురించిన కథలను మేము చాలా విన్నాము. ఇప్పుడు మీబుద్ధి కుశలతను మాకు స్వయంగా చూపించి మమ్మల్ని సంతోషింపచేయ కోరుచున్నాము' అని కాశీరాజు మల్లన్న మంత్రితో అన్నాడు. తరువాత కాశీరాజు సంజ్ఞచేయగానే నెలరోజులు మాత్రం వయస్సు కలిగిన శిశువుతో పాటు పదిమంది స్త్రీలనుకూడా రాజభటులు సభలోనికి ప్రవేశపెట్టారు. వారిని కాశీరాజు మల్లన్న మంత్రికి చూపించి యిలాగ అన్నాడు.

'మంత్రివర్యా! ఈ పది మంది స్త్రీలలో యీ శిశువుకు తల్లియెవరో' వారిని మీరు మాట్లాడించ కుండానే తెలుసుకోవాలి!'

రాజు ఆ స్త్రీలను తీవ్రంగా హెచ్చరించి ఉండడంవలన వారి ముఖాల్లో యేవిధమైన భావమూ మల్లన్న మంత్రికి కన్పించలేదు మల్లన్నమంత్రి అప్పుడు రాజుతో యిలాగ అన్నాడు.

'ప్రభూ! ఈ సాయంకాలం మా బసలో తమకు విందు యేర్పాటు చేసినాము. ఆ సమయంలోనే మీ ప్రశ్నకు సమాధానం యివ్వగలను'

సాయంకాలం కాగానే కాశీరాజు తన మంత్రులు సామంతులతోసహా మల్లన్న మంత్రి బసకువచ్చాడు. రాజ భటులు ఆపదిమంది స్త్రీలను శిశువును కూడా అక్కడకు తీసికొని వచ్చేరు.

మల్లన్న మంత్రి తనబసలో శిశువు నిమిత్తం ప్రత్యేకంగా ఒక ఉయ్యాల తొట్టి కట్టించాడు రాజభటులు శిశువును ఆ ఉయ్యాల తొట్టిలో పడుకోబెట్టారు పదిమంది స్త్రీలు తొట్టెకుకొంచెందూరంలోనిలబడ్డారు.

ఆ ఉయ్యాలకు కొంచెం దూరంలో మల్లన్న మంత్రి కాశీరాజుతో యేదో మాట్లాడుతున్నాడు అంతలో ఆకస్మికంగా మీదనుంచి ఒకపాము శిశువును ఉంచిన తొట్టిలో పడింది. అందరూ పాము! పాము! అని కేకలువేస్తుండగా ఆ స్త్రీలలో ఒకామె తటాలున తొట్టివద్దకువచ్చి పామును తనచేతితో తీసి దూరంగా పారవేసి శిశువును యెత్తుకొంది.

అప్పుడు మల్లన్న మంత్రి కాశీరాజుతో యిలాగ అన్నాడు 'ప్రభూ! ఆమెయే ఆ శిశువుతల్లి. విషములేని పామును పైనుండి ఉయ్యాల తొట్టిలో పడేటట్లు నేనే యేర్పాటు చేయించాను. తన ప్రాణాన్ని కూడా లెక్కచేయకుండా తనచేతితో పామును శిశువునుండి తీసివేసినదే తల్లి. ఒక్క తల్లి మాత్రమే తన బిడ్డకొరకు అటువంటి త్యాగాన్ని చేయగలదు!'

మల్లన్న మంత్రి తెలివితేటలకు కాశీరాజు సంతోషించి అతన్ని యెంతగానో గౌరవించాడు. ●

# ఎస్కిమో సుందరి



# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

(క) ఎస్కిమో సుందరి

ఉత్తర ధ్రువప్రాంతంలో నివసించే ఒకానొక జాతివారు చర్మంతో కుట్టిన సంచులలో పడుకుని నిద్రపోతారు. వాళ్ళల్లో పెళ్ళిళ్ళు తమాషాగా జరుగుతూ ఉంటాయి. భార్య కావలసినవాడు రాత్రిపూట రహస్యంగా మరో గూడెంలోకి వెళ్ళి, తోలు సంచిలో పడుక్కుని నిద్రపోతున్న తనకు నచ్చిన కన్య నొకదానిని సంచీతో సహా ఎత్తుకుని పారిపోతాడు. దరిమిలాని వాళ్ళిద్దరూ భార్యాభర్తలు అవుతారు.

మాంచి వయస్సులో ఉన్న యువకుడొకడు చక్కని భార్యను తెచ్చుకోవాలనుకున్నాడు. ఒక గూడెంలో ఫలానా ఇంట్లో చక్కని చుక్క ఒకతె ఉందని విన్నాడు. రాత్రివేళ బయలుదేరేడు. చాలా దూరమే ఉంది. వెళ్ళేటప్పుడు గంటకు 5 మైళ్ళ వేగంతో నడిచి, ఆ గూడెం చేరుకుని, తనకు కావలసిన తోలుసంచీ భుజం మీద వేసుకుని, గుట్టుచప్పుడు కాకుండా తిరిగి బయలుదేరేడు. ఆ బరువు వల్ల గంటకు 3 మైళ్ళ వేగంతో మాత్రమే నడువగలిగేడు. రానూ పోనూ మొత్తం 7 గంటలు పట్టింది. తెలతెలవారబోతుంది. తన గూడెం పొలిమేరలో నిలుచుని తన కోసం ఎదురు చూస్తున్న స్నేహ బృందం ముందు సంచీ దింపి, 'చూసుకోండి, ఎంత అందమైనదాన్ని తెచ్చానో!' అని రొమ్ము విరుచుకున్నాడు. ఆ సంచీలో ఉన్న వ్యక్తిని చూచి, స్నేహితులు నోటమాట లేకుండా నిలువబడి పోయారు. అతడు పొరపాటున ఆ పిల్ల తాతను మోసుకు వచ్చేశాడు!

ఆ ముసలాయనకు క్షమాపణ చెప్పుకుని, ఇంటి దగ్గర దిగబెట్టెయ్యడం, స్నేహితుల ముందర ఆ యువకుడు నవ్వులపాలు కావడం వగైరా విషయాలతో మనకు సంబంధం లేదుకాని, ఆ యువకుడు ఉండే చోటుకీ, ఆ పిల్ల ఉండే గూడెంకీ మధ్య ఎంత దూరం ఉందో చెప్పగలరా?

*　　*　　*

(చ) శాకటాయనం:

చదరంగం బల్ల మీద తెల్ల శకటు 32 తెల్ల గదులలోనూ, నల్ల శకటు 32 నల్ల గదులలోనూ ప్రవేశించగలదని మనకు తెలుసు.

తెల్లగది శకటు (లేదా నల్లగది శకటు) సాధ్యమైనన్ని తక్కువ ఎత్తులలో 32 తెల్ల గదులలోనూ ప్రవేశించడం ఎల్లాగో చూపించగలరా? శకటు ఒక గది విరామంగా నడిచి వెళ్ళిపోయినా, లేదా ఆ గదిలో ఆగినా ఆ గదిని చూచినట్లే లెక్క. ఒకే గదిలో అనేక పర్యాయములు ప్రవేశించినా అభ్యంతరం లేదు. (దీనిని నేనైతే 7 ఎత్తులలో సాధిస్తాను. మరి మీరో?)

# శాకటాయనం



*　　*　　*

(ట) ఆశ్విక బలం:

చదరంగం బల్ల మీది గదులనన్నింటినీ కాపలాకాయడానికి (లేదా ఎదుర్కోడానికి) కనీసం 12 గుర్రాలు అవసరం. కాళీ చదరంగ బల్ల మీద 12 గుర్రాలను ఏయే

# ఆశ్విక బలం



స్థలాలలో ఉంచితే ఇది సాధ్యమవుతుందో చూపించగలరా?

గుర్రాలకు తమలో తమకు కాపు అవసరం లేదనుకుంటే ఈ విధంగా 12 గుర్రాలను మాత్రమే ఉపయోగించి అన్ని గదులనూ కాయవచ్చు. గుర్రములన్నింటికీ తమలో తమకు పరస్పరం కాపుదల ఉండాలనే నియమం కూడా పెట్టుకుంటే అధమం 14 గుర్రాలు అవసరం. వాటిని ఏయే గదులలో నిలుచోబెడితే తమ్ము తాము కాపాడుకుంటూ మిగిలిన అన్ని గదులనూ కాపాడగలవో చూపించగలరా?

*　　*　　*

(త) i. ఐదు 1లతో 100 వ్రాయడం ఎల్లాగ?

ii. ఐదు 3లతో 100 వ్రాయడం ఎల్లాగ?

iii. ఐదు 5లతో 100 వ్రాయడం ఎల్లాగ?

(జవాబులు 64వ పేజీలో)




ఆతను వచ్చే సమయం ఆసన్నమౌతున్న కొలదీ అనూరాధకి ఆత్రుత హెచ్చసాగింది. అది కేవలం ఆత్రుత మాత్రమే కాదు. అందులో భయం వుంది. సంతోషమూ వుంది. ఆవేదనకూడా వున్నది. ఇవేమీ పట్టనట్లు అత్తగారూ ఆమె మనుమడూ పొంగిపోయే సంతోషంతో ఆతనికి స్వాగతం పలకడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఇళ్లు కడిగించారు. రంగులు వేయించారు. తోరణాలు కట్టించారు. రంగవల్లులు దిద్దించారు... అద్దంలా అలంకరించారు. స్టేషన్‌కి వెళ్ళడానికి ఏ బట్టలు వేసుకోవాలో తెలియక సతమతమైపోతూన్న కొడుకుని చూసి జాలిగా నవ్వుకుంది అనూరాధ. ఆతను స్వదేశం విడిచేనాటికి వీడింకా భూమిమీద పడలేదు. ఎన్నడూ చూసి ఎరుగని వ్యక్తి మీద ఎంతో గౌరవం, ప్రేమా పెంచుకుని అతని ఆగమనంకోసం మనస్సంతా కళ్లు చేసుకుని ఎదురుచూస్తున్న ఈ కుర్రకుంక భవిష్యత్తెలా వుంటుందో? వాడికి అతని నుంచి ఎలాంటి ఆదరణ లభిస్తుందో!

'అమ్మా... త్వరగా తెములూ—అవతల రైలు వేళైంది...' అత్తగారు కేకలు పెడుతోంది. బొంబాయి నుంచివచ్చే రైలు—ఇంకో గంటకి వస్తుంది. కారులో స్టేషన్‌కి వెళ్ళడం పది నిముషాలు!

ఆవిడ కెందుకూ యింత తొందర!

నానిగాడు బడినుంచి రావడం ఆయిదు గంటలకైతే తనెందుకూ నాలుగుగంటల నుంచీ గడపలో నిలబడడం! అందుకే అనూరాధ నిలువుటద్దం దగ్గర నిలబడి తన ప్రతిబింబాన్ని అద్దంలో చూసుకుని నిట్టూర్పు విడిచింది.

అందానికి తలోకరూ తలోక నిర్వచనం చెబుతారు. ఎవరి కళ్లు చెప్పే భాష్యాన్ని వాళ్లు నమ్ముతారు! తనకేమిటి తక్కువని! తను కట్టుకున్న లేతనువుపురంగు పట్టు చీరెకీ, తన వంటిరంగుకీ తేడా కనిపెట్టగలరా ఎవరైనా! వత్తుగా నిడుపైన జడ నాగుబాములా లేదా! తను నాజూకుగా నూట్లాడదా! సభ్యతగా మెలగదా! ధనం లేదా ఏమిటి కొరత! కొరత తనలో లేదు అతని మనస్సులో, అతని ఆలోచనల్లోనే వుంది. తనెందుకు ప్రతినిముషం ఆరాటంతో కృంగిపోవాలి! రానున్న పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కొనే శక్తి తన కున్నది... తనెందుకు భయపడాలి!

అలంకరణ పూర్తి చేసుకునివచ్చి కారులో అత్తగారి ప్రక్కన కూలబడింది అనూరాధ. నానిగాడు డ్రయివర్ ప్రక్కన కూర్చుని డ్రయివింగ్ శ్రద్ధగా గమనిస్తున్నాడు. విజయవాడ పట్టణం బద్ధకంగా నిద్రలేస్తోంది. సోమరితనానికీ, అపరిశుభ్రతకీ రూపం కల్పిస్తే అది విజయవాడ అవుతుందేమోననుకుంది అనూరాధ. అద్దంలోనుంచి చూస్తూ. లండన్ న్యూయార్క్ నగరాలు చాలా అందంగా ఎంతో పరిశుభ్రంగా వుంటాయి కాబోలు! అవి చూసిన కళ్లతో విజయవాడలో అడుగు పెట్టిన వాళ్ల అనుభూతులెలా వుంటాయో!

స్టేషన్‌లో పరిచితులు చాలామంది కనిపించారు. అందరూ అతన్ని రిసీవ్ చేసుకోడానికి వచ్చిన వాళ్ళే. కొందరు పూలమాలలు పట్టుకొచ్చారు. ఎక్కువమంది అతని స్నేహితులు, కొంతమంది బంధువులు. అతనికి బాగా సన్నిహితుడైన స్నేహితుడు ప్రకాశరావు గులాబీపూల దండ చేత్తో పట్టుకొని హడా

వుడిగా తిరుగుతున్నాడు ప్లాట్‌ఫారంమీద. అతనికి అనూరాధపైనా, వానిగాడిమీదా అభిమానం మెండు ప్రతి ఆదివారం ప్రకాశరావు వాళ్ళయింటికి తప్పకుండా వస్తాడు.

'ఈ దండ ఎందుకు తెచ్చావ్ ప్రకాశ్ మామయ్యా'' అంటూ అతని వెంట తిరగడం మొదలుపెట్టాడు నానీ—

'మీ నాన్న కోసమోయ్. అతను రైలు దిగగానే ఈ దండ అతని మెడలోవేసి తప్పట్లు కొట్టాలి—'

'నాకు తెలిస్తే, నేనూ తెచ్చేవాడిని—అమ్మ చెప్పలేదు. నాయనమ్మకూడా చెప్పలేదు—' నానీ ముఖం చిన్నబోయింది. దాదాపు కళ్ళవెంట నీళ్ళొచ్చాయి.

'అదేమిట్రా నానీ! ఈ దండ మీ నాన్నకి నీ చేతే వేయిస్తాను—సరేనా!' అన్నాడు. ప్రకాశరావు వాడిని ఎత్తుకొని...నానికి తల్లి మీద కోపం వచ్చినట్లుంది. ఆమెతో అసలు పలకడం లేదు. అనూరాధ నవ్వుకుంది. ముఖంలో ఏ భావమూ కనుపించనివ్వకుండా గంభీరంగా హుందాగా నిల్చబడింది...జరీపమిట చెంగు భుజం నిండుగా కప్పుకొని ఒకచేత్తో హాండ్‌బ్యాగ్ పట్టుకుని......

ట్రెయిన్ వచ్చింది. జనం పరిగెత్తారు. ఫస్టుక్లాస్ కంపార్ట్‌మెంట్ వాకిట్లో నిలబడి చెయ్యి వూపుతున్న అతన్ని గుర్తించడం కష్టం కాలేదు. దేశం వాతావరణం, ఆహారం య్యిత్యాది మార్పులు అతనిలో ఏ మార్పు తీసుకురాలేదు. నానీని ఎత్తుకొని ప్రకాశరావు ఆయాసపడుతూ పరిగెత్తి వాడిచేత దండ వేయించాడు. స్నేహితులంతా చుట్టూ మూగారు. అనూరాధ ఒక అడుగు వెనక్కి నిలబడింది. ఆమె అత్తగారు కొడుకుని నిలువునా పరీక్షచేసి కళ్ళల్లోనే సంతోషాన్ని నింపుకో ప్రయత్నం చేస్తున్నది. అతను క్రిందికి దిగాడు. నానీ అతనివంక ఆపేక్షగా గౌరవంగా చూస్తున్నాడు.

'నీ కొడుకోయ్' అన్నాడు ప్రకాశరావు రెండు నిమిషాలు - ఆగి నానిని అతనికి అందిస్తూ

'ఓ...వెరీగ్లాడ్—' అతను నానీని ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు.

'అమ్మ ఎక్కడ?' అని అడగలేదు.

కారు కదిలాక 'నీ వంట్లో యిప్పుడు బాగా కులాసాగా వుంటోందా అమ్మా' అని ప్రశ్నించాడు తల్లిని. స్టేషన్‌లో తనకి కొంచెం ఎడంగా నిలబడి నమస్కారంచేసిన అనూరాధని అతను ఏమీ అడగలేదు. నవ్వి వూరుకున్నాడంతే......

'ఈ గుక్కెడు ప్రాణం నీ కోసమే నిలిచి వుంది. నాయనా!' అంది తల్లి.

అతనింకేమీ అనలేదు. అద్దంలోనుంచి అనూరాధ ముఖం కనపడుతోంది.

గంభీరంగా నిండుగా వుంది ఆ ముఖం.

నానీ తన వొళ్ళోనుంచి కదలడం లేదు. చెయ్యి మెడచుట్టూవేసి ఏమిటో అడుగుతున్నాడు. ప్రకాశరావు ఫుల్‌స్టాప్ లేకుండా మాట్లాడుతున్నాడు. అతను వూకొడుతున్నాడు. ఇంటికివచ్చి కాఫీ త్రాగి తన గదిలో పడుకొని నిద్రపోయాడతను. ఆ గది పూర్వంలాగా లేదు. ఏవో కొత్త మార్పులొచ్చినట్లు కనపడ్డాయి. పరిశీలించే ఆసక్తి ఓపికాలేక దిండులో ముఖం దూర్చాడు... నిద్రపట్టేసింది.

'పాపం ట్రెయిన్‌లో నిద్రలేదు కాబోలు రెస్ట్ తీసుకోవోయ్—' అనేసి ప్రకాశరావు వెళ్ళిపోయాడు.

మళ్ళీ లంచ్‌కి రమ్మని బలవంతంచేసింది అనూరాధ. అతను వంటరిగా ఫీలవడం తనకి మాత్రం ఏం బావుంటుంది!

తండ్రి పనులన్నీ నానీ చకచక చేసేస్తున్నాడు. స్నానానికి టవల్, సబ్బూ అందించడం అన్నీ.

డైనింగ్ టేబిల్‌దగ్గరకూడా ఎంతో ఉత్సాహంగా కబుర్లు చెబుతున్నాడు. ప్రకాశరావు నానీని పొగుడుతున్నాడు. అతనేమీ తినడంలేదు. వ్రేళ్లతో అన్నీ మెలిపెట్టి ప్రక్కకి తోసేస్తున్నాడు. అవ పెట్టిన పనస పొట్టుకూర, ఆవకాయ, పప్పుచారు, వడలు, పాయసం- ఒక్కటీ అతను తినడంలేదు. ఇవన్నీ పూర్వం అతనికి చాలా యిష్టమని దగ్గరుండి చేయించింది అన్నపూర్ణమ్మగారు.

'మీకు బ్రెడ్ తెమ్మన్నారా?' అన్నది అనూరాధ చివరికి.

'థాంక్స్—నాకేమీ వొద్దు—'

అనూరాధ యింకేమీ అడగలేదు. ఫ్రిజ్‌లో నుంచి ఐస్‌క్రీం పట్టుకొచ్చి యిచ్చింది అదొక్కటే తినేసి లేచిపోయాడతను.

తండ్రి తెచ్చిన టేప్‌రికార్డర్, మూవీ కెమేరా, ట్రాన్సిస్టర్ రేడియో వగైరా అన్నీ చూసి మురిసిపోతున్నాడు నానీ. నానీతోతప్ప ఇంకెవరితోనూ అతను చనువుగా మాట్లాడడంలేదు. గది తలుపులు వేసుకుని ఇద్దరూ ఆడుకుంటూండగా అనూరాధ కాఫీ తీసుకొచ్చి టీపాయ్‌మీద వుంచి అక్కడేవున్న కుర్చీలో కూర్చుంది. అతనికి కాఫీ, వానీకి హార్లిక్స్ యిచ్చి, తను ఏమీ తీసుకోలేదు......

'అమ్మతో మాట్లాడరేం డాడీ!... ఉన్నట్లుండి నానీ వేసిన ప్రశ్నకి ఉలిక్కిపడ్డాడతను.

'అమ్మ చాలా మంచిది. మీరు రాకముందు అమ్మ నన్ను ఎంతో బాగా ఆడించేది—అమ్మ కాఫీ తీసుకుంటేగాని నేను హార్లిక్స్ త్రాగను—'

'నేనూ, నాయనమ్మా ఇందాకే తీసుకున్నాం—! మీరు కానివ్వండి—' అంది అనూరాధ. అతనేమీ మాట్లాడడంలేదు. ఏమని పలకరించాలో, ఎలా మాట్లాడాలో అతనికి తెలియడంలేదు.

'మీ ప్రయాణం సుఖంగా సాగిందనుకుంటాను—' మర్యాదకోసం అడిగింది అనూరాధ—

'బాగానే సాగింది...నీవు ఆరోగ్యంగా వుంటున్నావనుకుంటా—' అతని మాటలు అతనికే కృత్రిమంగా అనిపించాయి. కిటికీ వైపు తిరిగి, 'వూ' అంది అనూరాధ.

'అమ్మని నువ్వెప్పుడూ చూడలేదా డాడీ!' నానీ మళ్ళీ అడిగాడు.

'ఏం!'

మరిద్దరూ ఎక్కువ మాట్లాడరేం! ప్రకాశ్ మామయ్య నువ్వూ మాట్లాడుకున్నట్లు!'

ఐదేళ్ల కుర్రవాడికి తనేమీ సమాధానం చెప్పలేకపోతున్నాడు. పావుగంటసేపుకూర్చుని లేచిపోయింది అనూరాధ. అతను విదేశాల నుంచి తిరిగి వచ్చిన సందర్భంగా సాయంత్రం చిన్న టీ పార్టీ జరుగనున్నది. అన్నీ అమర్చడంలో లీనమైంది ఆమె...డాబామీద కుర్చీలూ టేబిల్సూ వేయించి, లైట్సు పెట్టించింది. నానీ తండ్రిపట్టుకొచ్చిన కొత్త సూట్ వేసుకున్నాడు. అనూరాధ లేత ఆకుపచ్చ జరీచీరెకట్టి, సిగ పైకిచుట్టి సన్నజాజులు తురిమింది. ఆమె సహాధ్యాయినులు పదిమంది వచ్చారు. అతని స్నేహితులు' వారి భార్యలు పిల్లలు!

కరుణాకరం అదృష్టాన్ని పొగడుతూ పద్యాలు చదివా డొకాయన. ' కరుణాకరం

# ఇంటిదీపం

పుట్టగానే విదేశాలు వెడతాడనుకుందట ఒకావిడ. పొగడ్తలుతప్ప ఏమీ వినపడడం లేదు అక్కడ. అనూరాధ అతిథి మర్యాద చేస్తున్నది. కరుణాకరం తండ్రి రామమూర్తిగారు ముచ్చటపడి చేయించిన సింహాసనంలాంటి కొయ్యకుర్చీలో కూర్చుని వేడుకచూస్తున్నది అన్నపూర్ణమ్మగారు. అయిదేళ్లుగా ఆమె మోస్తూవచ్చిన భారం నేటికి ఆమె భుజాలపైనుంచి దింపుకోగలిగింది. ఈ ఇల్లు, ఆస్తి, అనూరాధా, వానిగాడూ అన్నీ కరుణాకరానివి. అతనివి అతనికి అప్పగించేస్తే తనకేమిటి కచింత! రెండు సంవత్సరాలలో తిరిగి వస్తానన్న కరుణాకరం అయిదు సంవత్సరాలు రాకపోయేసరికి ఆమె మూగగా అనుభవించిన బాధ కొలిచేశక్తి భగవంతుడికి సైతం లేకపోయింది. అనేక శంకలు, అనుమానాలు ఆమె మెదడు చుట్టూ నిత్యమూ పరిభ్రమించేవి. ఒక్కడే కొడుకు! మరి జీవితంలో అతనితో కలిసి బ్రతికే యోగ్యత వున్నదో, లేదో! పాశ్చాత్య దేశపుస్త్రీలు నవనాగరికులు, జాణలు—అని విన్నది. ఎవరినైనా వివాహమాడి అక్కడే వుండి పోతాడేమో కొడుకు. అనేది ఒకటే పురుగులా మనస్సుని తొలిచివేసేది.

కాని అలా జరుగలేదు కరుణాకరం ఒక్కడే తిరిగివచ్చాడు. టీపార్టీ అయి అందరూ వెళ్ళాక కొడుక్కి దిష్టితీసి పోసింది. వానిగాడికీ అనురాధకి కూడా తీసింది డాబా మీద సన్నజాజితీగెలకి మొగ్గలు తొడిగాయి. మాలతి విరబూసింది. తొట్లలో ఏవో పూలు పగలబడి నవ్వుతున్నాయి. 'తన ఇల్లు కలకలలాడుతోంది.' అనుకున్నాడు కరుణాకరం. ఎన్నిరోజులుగా తను వేగానికీ, యాంత్రిక జీవనానికి అలవాటుపడ్డాడు. ఇక్కడ అంతవేగం లేదు. నిలిచి ఊపిరి పీల్చుకోవచ్చును. అస్తమానూ వాతావరణం గురించి మాట్లాడే వాళ్ళిక్కడ లేరు. మాటల్లో ఆప్యాయత తొణికిసలాడుతోంది. భోజనాలయ్యాక నానీ, అన్నపూర్ణమ్మగారి దగ్గర పడుకుని నిద్రపోయాడు. అనూరాధ కూజాతో మంచినీళ్లు తీసుకుని డాబామీద తనకోసం ఏర్పాటుచేసిన గదిలోకి వచ్చింది. అది అమ్మ బలవంతం అని కరుణాకరం గ్రహించాడు. అతని మెదడులో పూర్వ స్మృతులు మెదిలాయి అప్పుడూ ఇలాగే! అనూరాధని అలంకరించి బలవంతంగా గదిలోకి త్రోసి బయట గడియ వేసేది.

అమ్మ! అనూరాధ జాలిగా నవ్వేది. కిటికీపైపు జరిగి వొదిగిపడుకుని నిద్ర నటించేవాడు తను. అనూరాధ వచ్చి తన భుజంమీద చెయ్యివేసి, 'మీరు విశ్రాంతిగా పడుకోండి' అంటూ సోఫాని ప్రక్కలాగా తయారుచేసుకుని నిద్రపోయేది. అందుకే అనూరాధంటే ఒకవిధమైన గౌరవం వుండేది తనకి. ఆమె చాలామంది స్త్రీల లాంటిదికాదు. ఆత్మాభిమానం ఎంతవుందో ఇతరులను అంతే గౌరవిస్తుంది. వాళ్ల అభిప్రాయాలను మన్నిస్తుంది. మంచినీళ్ల కూజా బల్లమీద పెట్టి సోఫాకంబెడ్ మీద దిళ్లువేసుకుని, ఏదో పుస్తకం తీసుకుంది అనూరాధ. అతను కిటికీలోనుంచి బయటికి చూస్తున్నాడు. వెన్నెలతెల్లగా, మరీ తెల్లగా పూలవానలాగా కురుస్తోంది. సీలింగ్‌ఫ్యాన్ నెమ్మదిగా తిరుగుతోంది. గడియారంచేసే చప్పుడుతప్ప మరేం వినపడడంలేదు.

అనూరాధ దీక్షగా చదువుతోంది.

ఆమెతో ఏదో చెప్పాలనిపించింది. ఏమీ చెప్పలేకపోయాడు. పుస్తకం మూసివేసి ఆమె నిద్రపోయేవరకూ అతనేమీ చెప్పలేకపోయాడు. నిద్రలోకూడా అనూరాధముఖం శాంత గంభీరంగా వుంది. ద్వంద్వాల కతీతమైన మహాయోగిని ముఖంలా వుంది. ప్రక్కమీద ఒత్తిగిలిపడుకుంటే ఎదురుగా గోడకి తండ్రి ఫోటో వ్రేలాడుతూ కనపడి, గతం మనస్సు చుట్టూ తిరిగింది

రామమూర్తిగారంటే చాలామందికి పెద్దపులిని చూసినట్లే వుండేది. పరిచయస్థులకీ, బంధువులకీ, పాలంచేసే రైతులకే కాదు, ఆఖరికి అన్నపూర్ణమ్మగారికీ, కరుణాకరంకికూడా మెలి తిరిగిన మీసాలతో రౌద్రమూర్తిలావుండి, కోపంవస్తే హుంకరించే వాడాయన. ఒక్కడే కొడుకైనా కరుణాకరానికి గారాబం పెట్టలేదు. భార్య అన్నపూర్ణమ్మగారు ఆయనకి పరాయిది కాదు మేనమామ కూతురే. అయినా ఆయన ఆవిడకి రవ్వంత చనువుకూడా యివ్వలేదు. మల్లెపూల దగ్గర్నుంచి ముగ్గుల వడ్డాణంవరకూ ఆయనే కొనాలిగాని ఆవిడకు పైసఖర్చుచేసే స్వాతంత్ర్యం వుండేదికాదు. అయినా ఆవిడకేలాంటి లోటూ రాలేదు. ఆవిడ మనస్సులో ఏ చిన్నకోరిక కదిలినా కనిపెట్టి పెదవివిప్పి అడిగించకుండానే తీర్చేవాడాయన ఆవిడ కట్టని రకం చీరెలూ, ధరించని సొమ్ములు లేవంటే అతిశయోక్తికాదు. కరుణాకరంకీ ఏ లోటూ వుండేదికాదు. అయితే బడికి వెళ్ళకపోతే పెద్దశిక్షేపడేది. ఆ విషయంలో రామమూర్తిగారి మనస్సు కరిగేదికాదు. ఒక్కకొడుకైనా నిర్దాక్షిణ్యంగా శిక్షించేవారు. అందుకే కరుణాకరం ప్రతిక్లాసులోనూ ఫస్టువొచ్చేవాడు. వాళ్ళు పొంచి చదివేవాడు. వేళపట్టున తిని నిద్రపోయేవాడు స్కూల్ ఫైనల్‌వరకూ తండ్రికి ఎదురు చెప్పవలసిన అవసరం కరుణాకరంకి కలుగలేదు. ఆయన కుట్టించిన బట్టలు ధరించడం, అమ్మపెట్టిన భోజనంతిని బడికి వెళ్ళడం — ఇవే తప్ప ఫలానాది కావాలనీ, ఫలానాదివద్దనీ అతను ఎప్పుడూ చెప్పలేదు. ప్రతిశనివారం రామమూర్తిగారే కుటుంబాన్నంతనీ సినీమాకి తీసుకుని వెళ్లేవారు. అంచేత రహస్యంగా సినిమాకి వెళ్లే అగత్యంకూడా కరుణాకరంకి లేదు

స్కూల్‌ఫైనల్ చదువుతూండగా జరిగిన ఈ సంఘటన అతని జీవితాన్నీ, ఆలోచనా పధాన్నే మార్చివేసింది

తనకి బాగా గుర్తు...ఆ రోజు ఆదివారం. వర్షాకాలం కాబోలు పొద్దుటినుంచీ వర్షం కుండపోతగా కురుస్తున్నది ఎక్కడికీ వెళ్లడానికి లేక ఇంట్లోనే కూర్చున్నాడు తను పన్నెండు గంటలవేళ టెలిగ్రాం వచ్చింది.

వెంకట్రామయ్యగారికిసీరియస్‌గావుందట. వెంటనే బయలేరాలని వెంకట్రామయ్యగారు రామమూర్తిగారికి చాలాదగ్గర స్నేహితుడు. ఆయనకి రెండోపెళ్లి భార్యకూడా చనిపోయింది మొదటి భార్య సంతానం పెద్దవాళ్లై పెళ్లిళ్లుచేసుకుని వెళ్లిపోగా, రెండవ భార్య కూతురుమాత్రం ఆయన దగ్గరే వుండిపోవలసివచ్చింది. ఆ పిల్లకప్పుడు పన్నెండేళ్లు. ఫోర్త్‌ఫారం చదువుతోంది. తనకన్న నాలుగేళ్లు చిన్నది.

వెంకట్రామయ్యగారు ఎక్కడికివెళ్లినా ఆ పిల్లను తీసుకునివెళ్లేవారు కూతురంటే ఆయనకి ఆరో ప్రాణం. ఆ పిల్లకి ఆరో ఏట కాబోలు తల్లి గతించింది. అప్పటినుంచీ ఆయనే తల్లీ తండ్రీఅయి పెంచుతున్నారు. మొదటి భార్య కొడుకు లిద్దరూ

పెద్దవాళ్లు బాగానే సంపాదించుకుని దర్జాగా జీవిస్తున్నారు. అయినా ఆయన ఎన్నడూ కూతుర్ని వాళ్ల యిళ్లకి పంప లేదు. ఆయనకు తరచూ గుండెనెప్పి రావడంమూలాన ఆస్తి సంతటినీ ఏనాడో విల్లు వ్రాసి పంచేశారు. ప్రస్తుతం ఆయన పేర పదెకరాల మాగాణి వుంది. పల్లెటూళ్లో చక్కని డాబా వుంది ఆ రెండూ ఆయన తదనంతరం కూతురికి వస్తాయి. వెంకట్రామయ్యగారి సుస్తీమాట వినగానే టాక్సీలో బయల్దేరారు రామమూర్తిగారు. ఆ వూరు బెజవాడకి యాభై మైళ్లుంటుంది 'కరుణా, నువ్వు కూడా పద—' అంటూ కొడుకునికూడా బయల్దేరదీశారు

'అక్కడికి వాడెందుకూ క్షురవేధన! జడుసుకోడానికా!' అంటూ అడుతగిలింది అన్నపూర్ణమ్మగారు

క్షురవేధవేమిటి పదహారేళ్లొస్తేనూ—జీవితాన్ని చూడం నేర్చుకోవాలి' అని కొడుకుని చెయ్యిపట్టుకుని టాక్సీ ఎక్కించారు రామమూర్తిగారు. టాక్సీ ఆ వూరు చేరేసరికి నాలుగు గంటలైంది. ఇంటినిండా బంధువులున్నారు. వాకిట్లో డాక్టర్‌గారి కారుంది. పొలంచేసే రైతులు, పనివాళ్లు అందరూ కన్నీళ్లు తుడుచుకుంటున్నారు ఇంకా వర్షం కురుస్తూనేవుంది. నాలుగు గంటలకే బాగా చీకటిపడినట్లయింది. గదులలో దీపాలు వేశారు వెంకట్రామయ్యగారికింకా స్పృహ వున్నది. నీరసంగా మాట్లాడుతూనేవున్నాడు. కొడుకులిద్దరూ కుర్చీలు వేసుకుని చెరొక వైపునా కూర్చున్నారు కూతురు దిగాలుగా తండ్రి కాళ్లదగ్గర కూర్చున్నది.

'అదుగో నాన్నా రామమూర్తిగారువచ్చారు' అన్నాడు పెద్దకొడుకు తమని చూసి లేచి నిలబడి. వెంకట్రామయ్యగారి కళ్లు సంతోషంగా మెరిశాయి. రామమూర్తిగారువెళ్ళి కుర్చీలో కూర్చుని ఆయన చెయ్యిపట్టుకున్నారు.

'నీ కోసమే. .' అన్నారు వెంకట్రామయ్య గారు చాలా నీరసంగా...

'నీకేం ఫరవాలేదు' రామమూర్తిగారు ఊరడించారు. కరుణాకరం తండ్రి వెనక నిలబడ్డాడు.

'పాపని గురించే నాకు దిగులు...దాన్ని నువ్వు—తీసుకెళ్ళాలి ..'

పాపని రమ్మని సంజ్ఞ చేశాడు. ఆమె వెళ్లి దగ్గరగా నిలబడింది. ఆమె చేతులు రామమూర్తిగారి చేతిలో పెట్టారు కన్నీళ్లు ధారలు కట్టాయి. పెద్దకొడుకూ, చిన్న కొడుకూ, కోడళ్ళూ ముఖాలు చూసుకున్నారు. కోడళ్ళిద్దరూ మూతి విరిచారు. బంధువులు ఆశ్చర్యం ప్రకటించారు.

ఇద్దరు కొడుకులు వుండగా ఎవరో పరాయి వ్యక్తికి అప్పగించడం ఏమిటి చిన్న పిల్లని!

ఆయన భార్య సవ్యంగా చూస్తుందా!

ఆ ఇంట అప్పుడెవరూ మాట్లాడలేదు వెంకట్రామయ్యగారి ప్రాణం మరి రెండు రోజులకుగానీ పోలేదు. ఈ రెండు రోజులూ ఆయన బంధువుల సూటీపోటీలు భరిస్తూ అక్కడే వుండిపోయారు రామమూర్తిగారు. ఆయనతోపాటు కరుణాకరం. అతనికి అదివరకు శవాలంటే తగని భయంగా వుండేది. వెంకట్రామయ్యగారి మృతదేహాన్ని చూస్తూ వుంటే ఏ భయమూ కలుగలేదు. వెంకట్రామయ్యగారి అంత్యక్రియలూ, కర్మకాండా అయిపోయిన తరువాత లాయర్ అందజేసిన వీలునామాను, పాపనూ తీసుకుని ఇంటికి వచ్చారు రామమూర్తిగారు.

కరుణాకరం మళ్లీ అనూరాధ వంక చూశాడు...ఆమె నిశ్చింతగా నిద్రపోతున్నది. మళ్ళీ గతాన్ని త్రవ్వడం మొదలుపెట్టాడు. పదిరోజులుగా తిండీ నిద్రాలేని పాప కారులో పడుకుని అలసటగా నిద్రపోతూ వుంటే ఆమె తల వాళ్లో పెట్టుకుని కూర్చున్నారు రామమూర్తిగారు. పాపముఖం అమాయకంగా వుంది.

'ఈ పిల్ల ఇకనుంచీ మనకు పరాయిది కాదు. కరుణాకరాన్ని ఎలాచూస్తావో పాపను కూడా అలాగే చూడాలి నువ్వు—ఏమాత్రం లోటు కనిపించినా నేను సహించను' అని ప్రకటించి పాపను అన్నపూర్ణమ్మగారికి అప్పగించారు. పాప స్కూల్లో చేరి చదువుతోంది. అన్నపూర్ణమ్మగారిని అత్తయ్యా అంటుంది. ఆయన్ని మామయ్యా అంటుంది. కరుణాకరాన్ని ఏమీ అనదు. అతనికెందుకో పాపంటే ఎక్కువ యిష్టం వుండేదికాదు. ఎవరోపిల్ల తమ యింట్లోవుండి సర్వహక్కులూ అనుభవించడం ఏమిటనిపించేది. ఆమెని పిలిచే వాడు కాదు. పలికేవాడు కాదు.

అతని దృష్టి ఎప్పుడూ చదువుమీద వుండేది. ఇంజినీరింగ్ చదవాలని, ఫారిన్ వెళ్లాలనీ, కీర్తీ, ధనమూ ఆర్జించాలనీ, ఇలాకలలు కనేవాడు

స్కూల్ ఫైనల్ పరీక్షలు చాలా సంతృప్తికరంగా వ్రాశాడు కరుణాకరం. వేసవిలో రామమూర్తిగారికి బాగా జబ్బు చేసింది. నెలరోజులు మంచంలోనుంచి లేవలేదు. ఆ జబ్బు ఆయన ఆలోచనలమీద బాగా పని చేసింది పత్యం తీసుకున్న వారం రోజులకి ఎవరికీ చెప్పకుండా పురోహితుడిని పిలిచి కరుణాకరం పెళ్లికి ముహూర్తం పెట్టమన్నారాయన. 'పెళ్ళికూతురు ఎవరూ?' అని ఆశ్చర్యంగా అడిగింది అన్నపూర్ణమ్మగారు.



# ఇంటిదీపం

'పాప!' అన్నారు రామమూర్తిగారు. అన్నపూర్ణమ్మగారు ఏమీ అనలేదు. ఆవిడ అన్నకూతురు విశాలని కరుణాకరంకి చేసుకోవాలని చాలాకాలంగా అనుకుంటూ వుండేది. విశాల కన్న పాప అందంగానే వుంటుంది. పాపకి ఆస్తి వున్నది గుణవంతురాలు. అంతకన్న కావలసిందేవుంది! ఈ వార్త విని ఎగిరి పడ్డాడు కరుణాకరం! పదహారేళ్ళకి పెళ్ళేమిటన్నాడు. పాపంటే తన కిష్టం లేదన్నాడు. ఇంకా ఎన్నో అన్నాడు. వారంరోజులు భోజనం చేయకుండా సత్యాగ్రహం చేశాడు. అతనిమాట ఎవరూ వినిపించుకోలేదు. అనుకున్న ముహూర్తానికి కరుణాకరం పెళ్ళైపోయింది

* * *

'ఇవాళ సినిమాకి వెడదాం డాడీ!' అన్నాడు నానీ మూడురోజుల తరువాత. కరుణాకరంకి ఏమీ తోచడంలేదు. నానీ ఒక్కడే అతనికి కాలక్షేపం నానీని విడిచి నిమిషంకూడ వుండలేక పోతున్నాడతడు. నానీకి తెలుగు సినిమాలంటే యిష్టం. కరుణాకరం తెలుగుసినిమా చూసి ఎన్నాళ్ళో అయింది.

'అలాగే వెడదాం' అన్నాడు.

నానీకి టాయిలెట్ చేసి పంపింది అనూరాధ, అతనూ తయారయ్యాడు. బయలుదేరబోతూండగా, మరి అమ్మో! ఆవిడని పిలూ! అమ్మ లేకపోతే నేను రాను... అని మొండికేశాడు వాడు. అనూరాధనికూడా పిలవాలని అతనికి తోచలేదు.

'సరే వెళ్ళి పిలుచుకురా!' అన్నాడు.

'నువ్వే పిలు.. నేను పిలవను' మూతి ముడుచుకుని గారంచేశాడు.

వాడి మొండితనం కరుణాకరంకి తెలుసు. నెమ్మదిగా లోపలికివెళ్ళి గదులన్నీ వెదికాడు. వంటయింట్లో కూర్చుని వంటావిడచేత ఏదో వండిస్తున్నది అనూరాధ. స్నానంచేసి మామూలు చీరె ధరించింది. అతన్ని చూసి లేచి నిలబడి ఏంకావాలని అడిగింది,

'నిన్ను సినిమాకి రమ్మని బాబు గోల చేస్తున్నాడు...రాకూడదూ?'

అనూరాధ విస్తుబోయింది! ఒక్కక్షణం ఆలోచించి, 'పదండి' అని తన గదిలోకి వెళ్ళి చీరె మార్చుకుని వచ్చింది.

తన వివాహమైన యిన్ని సంవత్సరాల తరవాత మొట్టమొదటిసారిగా ఆమె ప్రక్కన కూర్చుని సినిమా చూస్తూ, తనకు అనూరాధపైగల అయిష్టానికి కారణాలు వెదకసాగాడు కరుణాకరం...'

హైదరాబాద్, బెంగుళూర్ నగరాల్లో అందమైన అమ్మాయిలో పరిచయం అయింది. అందులో సునందా, హేమమాలినీ చాలా సన్నిహితులయ్యారు. అయితే ఏం, వాళ్ళల్లో తనకేదో లోటు కనిపించింది. తనకు ఒక్క అనూరాధ పైనేకాదు వివాహం అంటేనే ఏదో వైముఖ్యం. దానికి కారణం బాల్యవివాహం కావచ్చు, తన యిష్టానికి వ్యతిరేకంగా చేయడంవలన కావచ్చు. తండ్రిపైన కోపం కావచ్చు. నిజానికి అనూరాధకేం లోటని!

సినిమా చూస్తున్నంత సేపూ కరుణాకరం ఆలోచిస్తూనే వున్నాడు.

విదేశాల్లో ఎంతోమంది స్త్రీలు పరిచయం అయ్యారు అక్కడి వివాహవ్యవస్థ నచ్చలేదు కరుణాకరంకి వాళ్ళని గౌరవిస్తూ ఎప్పుడూ దూరంగానే వుంచేవాడు. అప్పుడప్పుడు అనూరాధ జ్ఞాపకం వచ్చేది. అయినా ఒక్క ఉత్తరం వ్రాయాలని కూడా అనిపించేదికాదు. అమ్మకి వ్రాసేవాడు. నానిగాడిక్షేమం మాటవరసకి అడిగేవాడు. అందులో అనూరాధ ప్రసక్తి లేదు. అనుకున్న దానికన్న ఎక్కువ చదువుకోగల్గాడు. ఆశించిన డిగ్రీకన్న విలువైన డిగ్రీ సంపాదించ గలిగాడు అయినా అతనికేదో లోటు కన్పిస్తూనే వుంది.

సినిమానుంచి తిరిగి వచ్చాక పాలుత్రాగి నానీ నిద్ర పోయాడు యధాప్రకారం అనూరాధ మంచినీళ్ళు తీసుకుని గదిలోకి వచ్చి సోఫాపైన పడుకుంది. భోజనాల దగ్గర కూడా ఆమె ఎక్కువ మాట్లాడలేదు. కరుణాకరం నిద్రకోసం వెర్రిగా ప్రయత్నిస్తున్నాడు.

సోఫామీద పడుకున్న అనూరాధ కెందుకో తన వివాహంనాటి సంగతులు గుర్తుకొచ్చాయి.

* * *

జబ్బుతో అవస్థపడుతూ కూడా తనపై ఎంతో శ్రద్ధ తీసుకుంటూన్న రామమూర్తిగారిని చూస్తే తనకి చాలా గౌరవంగా వుండేది.

ఎప్పుడూ ఆయన మంచందగ్గరే కూర్చుని సేవచేయా లనిపించేది. స్కూల్‌కి వెళ్ళకపోతే ఆయన కోప్పడేవారు.

'నేనులేనా పాపా! నీకెందుకు శ్రమ! స్కూల్‌కి వెళ్ళమ్మా!' అనేది అన్నపూర్ణమ్మగారు...

అన్నపూర్ణమ్మగారు తనని ఎంతో ప్రేమగా చూసేది. ఆ రోజు 'కరుణాకరంకి పాపనిచ్చి పెళ్ళి చేస్తాను' అని రామమూర్తి గారు ప్రకటించిన రోజుకూడా ఆవిడ చాలా నిబ్బరంగా ప్రవర్తించింది. తనని దగ్గరకు తీసుకుని చెంపలు నిమిరింది.

కరుణాకరం ప్రవర్తన చూసి భయపడి పోతూ 'అతని కిష్టంలేని ఈ పెళ్ళి ఆపించండి' అని చెప్పాలని ఎంతో ప్రయత్నించింది తను. కానీ నోట మాట రాలేదు కరుణాకరం అంటే తనకి చాలా యిష్టంగా వుండేది అతను తనని ఛీదరించుకున్నా. తనతో పంక్కపోయినా, అతనంటే కోపం వచ్చేదికాదు ఎంతో అభిమానించేది. అతను తనకి భర్త కావడం తనకి సంతోషమే కలుగజేసింది. పన్నెండేళ్ళ పిల్లకి అంతకన్న ఏం తెలుస్తుంది! పీటలమీద అతను ముఖం అంతా చిన్నబుచ్చుకుని కూర్చోడం, తను వినేటట్లు ఏవో అనడం కాలికి అడ్డంవచ్చిందల్లా తన్నడం, అవన్నీ అప్పుడు తనకేమీ మనస్సుకి పట్టలేదు. పట్టు లంగాలు, జరీ వోణీలు, నగలు, విందుభోజనాలు అనేక మంది బంధువులు, హాస్యాలు, వినోదాలు— తన కెంతో సంబరంగా వుండేది.

వేసవి వెళ్ళిపోయింది. కరుణాకరం కాలేజిలో చేరాడు ఇంటర్మీడియట్‌లో. లామిద్దరికీ స్నేహం కలపాలని అన్నపూర్ణమ్మ గారు తంటాలు పడేది ఒకేసారి భోజనం వడ్డిస్తే లేచిపోయి భోజనం తన గదిలోకే తెమ్మనేవాడు రెండేళ్ళు అలాగే గడిచి పోయాయి. కొత్త బట్టలు కొనుక్కోడం స్నేహితురాళ్ళతో కలిసి చదువుకోడం గృహోవరణలో పూల మొక్కలు పెంచడం యివీ తన నిత్యకృత్యాలు...అప్పుడప్పుడూ తండ్రి జ్ఞాపకం వచ్చేవాడు చాలా దిగులని పించేది. ఎవరో స్నేహితురాలు వచ్చి కబుర్లు చెబుతూంటే దిగులు మర్చిపోగలిగేది స్కూల్ ఫైనల్ మంచి మార్కులతో పాసయింది తను. అతనికి ఇంటర్‌లో క్లాసు రావడం బి. ఇ.లో సీట్ రావడం జరిగాయి. ఇంటినుంచి వెడుతూ అతను చాలా సంతోషం వెలిబుచ్చాడు. అతన్ని ఒంటరిగా కలుసుకుని ఏదో చెప్పాలని, తనకి ఒక్క ఉత్తరం వ్రాయమని అడగాలని ఎంతో తపించింది. ఆ అవకాశం తనకి చిక్కనేలేదు సావానుతో అతని కారు సాగి పోతూవుంటే డాబామీదనుంచీ చూసి కళ్ళు తుడుచుకుంది. అతను తన కెంతో ఆప్తుడైనట్లూ, అతని వియోగం తను భరించ లేనట్లూ అనిపించింది. ఎవరికి కావాలి తన వేదన! ఆ ఆవేదన అక్కడికక్కడే అణగారి పోయింది.

రామమూర్తిగారు తనని కాలేజీలో చేర్పించారు. మరి నాలుగు సంవత్సరాలు అలాగే గడిచిపోయాయి. సెలవులకి వచ్చినా తన వంక చూసేవాడేకాదు కరుణాకరం. స్నేహితురాళ్ళెవరైనా వచ్చి, 'మీ ఆయన్ని పరిచయం చేస్తే అరిగిపోతావుటోయ్' అనేవాళ్ళు యాంత్రికంగా పరిచయంచేసేది.అతను నమస్కారం పెట్టి 'నాకు పనుందండీ' అంటూ వెళ్ళిపోయేవాడు.

బి. ఇ. అయిపోయి ఇంటికి సెలవులకి వచ్చిన కరుణాకరం తండ్రి మరణాన్ని చూడ వలసివచ్చింది తుదిఘడియల్లో ఆయనేమీ ఎక్కువ చెప్పలేదు. 'పాపని నీకు అప్పగిస్తున్నాను. దాన్ని అన్యాయం చెయ్యకు.' అన్నారు, అంతే

రామమూర్తిగారి మరణం అనూరాధను కృంగదీసింది. ఆ ఇంట్లో యింక తన సంగతి పట్టించుకొనేది అత్తగారే! ఆవిడే దిగులుతో కృశించిపోతున్నది. ఇంక తన నెవరు ఊరడిస్తారు! కరుణాకరం చాలా గంభీరంగా వుండేవాడు తల్లిని కూడా ఎక్కువ ఓదార్చేవాడు కాదు. అనూరాధే అన్నపూర్ణమ్మగారిని కనిపెట్టి వుండేది.

ఎం. ఇ.లో సీట్ సంపాదించుకొని వెళ్ళిపో బోతున్న కొడుకుని ఆటకాయించి 'ఇన్నాళ్ళుగా వాయిదాలు వేస్తూ వచ్చావు—ఈ శుభకార్యం కాస్తా కానిచ్చి వెళ్ళు—' అని ఒట్టుపెట్టుకుంది తల్లి...

గుమ్మాలకు తోరణాలు కట్టించింది. అందరినీ భోజనాలకి పిలిచింది. అనూరాధకి కొత్త చీరెకట్టి మల్లెపూల జడవేసింది. సెంటు రాచింది. గదిలోకి పంపి బయట గొళ్ళెం వేసింది. కరుణాకరం చిక్కులో పడిపోయాడు. ఇలాంటి అవాంతరం వచ్చి పడుతుందని అతను అనుకుంటూనే వున్నాడు. తల్లి అసలే దిగులుపడి వున్నది. కృశించి పోతున్నది. పైగా బెదిరిస్తున్నది. ఆవిడ మాట తలదాల్చక తప్పలేదు.

అనూరాధ లోపలికి వచ్చి చాలాసేపు సోఫాలో కూర్చున్నది. చివరికి సోఫాని పడక లాగా తయారు చేసుకుని నిద్ర పోయింది. అతన్ని పలకరించలేదు. వేడుకోలేదు. ఏడవ లేదు. ఇవ్వన్నీ ఆశించి నిద్రనటిస్తున్న కరుణాకరం ఆశ్చర్యపడ్డాడు.

మూడు రాత్రులూ ముళ్ళమీద ఉన్నట్లు గడిపేసి వెళ్ళిపోయాడు కరుణాకరం. ఎప్పు



# ఇంటి దీపం

జైనా సెలవులకి వస్తే మళ్ళీ ఇదే తంతు. భోజనం కూడా అనూరాధే వడ్డించేది. తల్లి అతనిదగ్గరకే వచ్చేదికాదు. బి. ఏ. పూర్తి చేసి అన్నపూర్ణమ్మగారికి తోడుగా ఇంట్లోనే వుండి పోయింది అనూరాధ. అతను వస్తున్నాడంటే ఇద్దరికీ సంతోషంగా వుండేది. అన్నపూర్ణమ్మగారి ఆరోగ్యంకూడా బాగుండడంలేదు. మనవడో, మనవరాలో పుడితే చూసి చనిపోవాలని ఆవిడ కోరుకుంటూ వుండేది. అనూరాధ తలలో స్వయంగా మల్లెచెండు తురిమి మనసులో దీవించేది ప్రతి రోజూ. ఆమెకి కొడుకూ కోడలూ గడుపుతూన్న బ్రహ్మచారి జీవితం సంగతి తెలియదు. ఎం. ఇ. కూడా పూర్తిచేసి విదేశాలకు వెళ్ళడానికి ప్రయత్నిస్తూన్న కొడుకుని ఆవిడ బ్రతిమిలాడింది. చదివినంతవరకూ చాలన్నది. తన కళ్ళెదుటవుండి ఏదైనా ఉద్యోగం చెయ్యమన్నది. మనవడికోసం ఆవిడ కలవరించని రోజంటూ వుండేది కాదు. కోడలిని, కొడుకుని స్నేహితులను చెయ్యాలని విడరాని జంటగా బంధించాలని ఎంతో ప్రయత్నించేది...

రోజూలాగే ఆరోజు అనూరాధ మంచి నీళ్ళు కూజా తీసుకుని మేడమీదకు వచ్చింది. తెల్లని జరీపువ్వులున్న తెల్లరంగు బెనారస్ పట్టుచీరె కట్టి తెల్లనిజాకెట్టు వేసుకుంది మెడలో ముత్యాలదండ, చెవులకి రవ్వల దుద్దులు, తలలో మల్లెచెండు. చల్లగా తెల్లగా మబ్బుతునకలా వచ్చింది. ఈ అలంకారం అంతా అమ్మ పిచ్చేనని కరుణాకరంకి తెలుసు. లేకపోతే 'నిద్రపోవడానికి ఇంత ఆడంబరమా?' అనిపించింది.

అనూరాధ చాలా మంచిది, బొమ్మలా కూర్చుని అమ్మచేత అలంకారం చేయించుకుంటుంది, తనని బాధించదు. గది బయట సన్నగా వర్షంతుంపర పడుతోంది. చల్లని గాలి చలిగాలిగా మారుతోంది. ఆలోచనల్తో కరుణాకరం బుర్ర వేడెక్కిపోతున్నది అనూరాధకి తను అన్యాయం చేస్తున్నాడనిపించింది తండ్రిపైన కోపంతో ఒక అమాయకురాలిని బాధించడం తగదనిపించింది. జాలి హృదయాన్ని కదిలించసాగింది. దానికి వాతావరణం తోడైంది. అతను లేచి, అనూరాధ దగ్గరగా వచ్చాడు. భుజంమీద చెయ్యివేసి తనవైపు తిప్పుకున్నాడు. గడ్డం పైకెత్తి 'అనూరాధా' అన్నాడు. బయట వర్షం జోరు ఎక్కువైంది. ఉరుములు, మెరుపులూ ఎక్కువైనాయి. అనూరాధ అతని గుండెపై తల ఆన్చి వెక్కివెక్కి ఏడవడం సాగించింది. ఎన్నో చెప్పాలనే కోరిక వుంది.

ఆమె అసహాయతవెక్కిళ్ళరూపందాల్చింది అతను ఆమె కళ్ళు తుడిచాడు. నుదుటి మీద ముద్దుపెట్టుకుని మంచం దగ్గరకు తీసుకుని వెళ్ళాడు. 'నేను ఓడిపోయాను— ఓడిపోయాను — నువ్వే గెలిచావు.' అని గొణుక్కున్నాడు.

తెల్లవారింది. అతనికి అనూరాధ ముఖం చూడాలనిపించలేదు. కాఫీతాగి సూట్‌కేసు సర్దుకుని 'అమ్మా నేను బెంగుళూరు వెడుతున్నాను. పది రోజుల్లో వస్తాను' అని వెళ్ళిపోయాడు.

అతనికి విదేశాలు వెళ్ళడానికి స్కాలర్ షిప్పు వగైరాలన్నీ వచ్చాయి. ప్యాస్‌పోర్టులూ అవీసంపాదించుకొనడానికి నెలరోజులుపట్టింది. నెల రోజులు తిరిగి తిరిగి ఇంటికి వచ్చాక ఆ రోజు ప్రొద్దున్నే అనూరాధ బాత్‌రూం దగ్గర వాంతి చేసుకోడం చూశాడు.

అతని మెదడులో మెరుపులాంటి ఆలోచన మెరిసింది. తన బలహీనతవలన అమ్మకోరిక తీరుతున్నది కాబోలు! ఇంక తను నిశ్చింతంగా వెళ్ళవచ్చు.

భోజనాలదగ్గర అమ్మ చెప్పింది 'అమ్మాయిని డాక్టరుకి చూపించు నాయనా— ఈ మధ్య ఏమీ కులాసాగా వుండడం లేదు' అని.

లేడీ డాక్టర్‌ని ఇంటికి పిలిచారు ఆవిడ చెప్పింది అనూరాధ ఆంతర్వత్ని అయిందని. అమ్మ ముఖంలో వెయ్యిదీపాలు వెలిగాయి.

'మీరు వెడుతున్నారు—నా కెప్పుడైనా ఉత్తరం రాయకూడదూ?......'అనడిగింది అనూరాధ బొంబాయి ఎయిర్‌పోర్టులో... నవ్వుతూ తల వూపాడు.

నానీ పుట్టినప్పుడు అనూరాధ మొట్టమొదటిసారిగా అతనికి ఉత్తరం వ్రాసింది. జవాబు రాయాలని కూర్చుంటే కలం సాగలేదు— వ్రాయడం—చింపడం — చివరికి వ్రాయనేలేదు...

*　　*　　*

కరుణాకరం స్టీల్‌ప్లాంట్‌లో ఉద్యోగానికి ప్రయత్నం చేస్తూవుండిపోయాడు నెల రోజులు—నెలరోజుల్లో నానీ అతనికి బాగా చేరువవడమేకాదు, అనూరాధనికూడా ఎంతో దగ్గరకు తెచ్చాడు.

రోజూ షికారుకి తీసుకెళ్ళమని వేధించే వాడు. బయలుదేరాక అమ్మ రానిదే కదలనిచ్చేవాడు. ఇద్దరూ కలిసివస్తేగాని ఊరుకునేవాడుకాదు.

ఆ రోజు అనూరాధ ఏనిమిదైనా నిద్రలేవలేదు. నానీ వచ్చిలేపితే మూలిగింది. అన్నపూర్ణమ్మగారు నుదురు పట్టుకుచూసి 'బాబోయ్— వొళ్ళు పేలిపోతున్నది. డాక్టరుకి కబురుచెయ్ నాయనా?' అన్నది. నానీ తల్లి చుట్టూ తిరుగుతున్నాడు.

తల్లికేదైనా సుస్తీచేస్తే వాడికి క్షణం తోచదు. పాలైనా త్రాగకుండా తల్లిదగ్గరే కూర్చున్నాడు. వాడు పాలు త్రాగకపోవడం కరుణాకరంకి బావుండలేదు. అతను కాఫీకప్పు అక్కడే వదిలి డాక్టర్‌కోసం పరిగెత్తాడు. డాక్టర్ వచ్చి ఇంజక్షనిచ్చేవరకూ అనూరాధ మూలుగుతూనే వుంది ఇంజక్షనిచ్చిన అరగంటకి కళ్ళుతెరచి చూసి కాఫీత్రాగింది. వెంటనే పాలుత్రాగాడు నానీ—తండ్రిని కాఫీ త్రాగమని బలవంతం చేశాడు. అమ్మ అన్నం తినకపోతే తనూ తిననని మొండికేశాడు. వాడితోపాటే అనూరాధ గదిలో కూర్చుని ఆమె అడిగినప్పుడల్లా గ్లూకోజ్ నీళ్ళు యిస్తున్నాడు కరుణాకరం. చంటివాడి అవస్థచూస్తే అతనికి చాలా బాధగావున్నది. అనూరాధకి త్వరగా నయమైతే బాగుండుననిపించింది

అతనికి భోజనం సయించలేదు మందులు కూడా అతనే యిస్తున్నాడు జాగ్రత్తగా. ఆమె నోట్లో టాబ్లెట్‌వేసి, నీళ్ళుపోస్తే మింగుతున్నది. అనూరాధ జ్వరం వారం రోజులుకిగానీ తగ్గలేదు. ఈ వారంలో నానీ తండ్రిచేత బాగా సపర్యలు చేయించాడు తల్లికి. వాడు చిక్కిపోయి సగమైనాడు...

'అనూరాధా— కొంచెం హార్లిక్స్ త్రాగక పోయావా! ఈపూట మందువేసుకున్నావా! నువ్వేం పనిచెయ్యకు' ఇలా కరుణాకరం చెబుతూంటే అనూరాధేకాదు అన్నపూర్ణమ్మగారు కూడా ఆశ్చర్యపడ్డది.

'అమ్మకి తగ్గితే తిరపతి వస్తానని దండం పెట్టాను డాడీ. మనందరం తిరపతి వెళ్ళాలి' అన్నాడు నానీ.

'ఎప్పుడు పెట్టావోయ్ దండం?'

'నాయనమ్మ పెట్టమంది...పెట్టాను. అమ్మకి తగ్గిందిగా.'

కరుణాకరంకి మొక్కులమీద నమ్మకం ఎప్పుడూ లేదు. చాలా మొండిగా వాదించే వాడు దేవుడి ఉనికిని గురించి.

నానిగాడిమాట త్రోసిపుచ్చడం కూడా అతని కిష్టంలేదు. అనూరాధ జ్వరం తగ్గినందుకు అతనికీ సంతోషంగా నేవుంది. ఒక వారంరోజులు నానితో కులాసాగా గడిపనూ వచ్చు. అందుకని సరే నన్నాడు.

'మీరు వెళ్ళండి నాయనా — నేను రాలేను' అన్నది అన్నపూర్ణమ్మగారు.

తిరుపతి, కంచి, కాళహస్తి, మద్రాసు, మహాబలిపురం, బెంగుళూరు, మైసూర్ అన్నీచుట్టి ఇంటికి బయలుదేరుతూ, మైసూర్‌లో అనూరాధకి పట్టుచీరె ఒకటి కొని, 'అందరూ ప్రేమించి పెళ్ళాడా నంటారు. పెళ్ళాడిన ఏ యువతినైనా ప్రేమించాలని కొందరంటారు. అసలు ప్రేమ అంటే ఏమిటో నాకు తెలీదు— కానీ ఇప్పుడిప్పుడే నిన్ను చూస్తే నువ్వు వాడానివనీ, నాకెంతో కావలసినదానివనీ అని పిస్తున్నది అనూరాధా! నీకో చీరె కొనాలని ఇవాళే అనిపించింది' అన్నాడు కరుణాకరం. అనూరాధ హుందాగా నవ్వింది ఆ హుందా తనమే కరుణాకరంకి యిష్టం. యాత్ర లన్నీ అయి ఇంటికి వచ్చాక కొడుకూ కోడలూ, ఆప్యాయంగా మాట్లాడుకోడం, చమత్కారాలు, చెణుకులూ విసురుకోడం చూసి 'నేను ఇన్నేళ్ళుగా సాధించాలను కున్నది. నువ్వు రెండునెలల్లో సాధించావ్ నానీ అందుకే మనవడు కావాలని ఎంతో కలవరించాను మనదేశంలో ఎన్నో సంసారాలు పిల్లల మూలంగా నిలుస్తున్నాయి. అదే మనకీ విదేశీయులకీ తేడా. ఆపేక్షలూ, అంతఃకరణలూ హృదయంలోనుంచి పుట్టుకు రావడానికి పిల్లలు కారణం అంటే ఎంత గర్వంగా వుంటుంది!' అనుకుంది అన్నపూర మ్మగారు.

నానికివేవీ తెలియవు. అమ్మా, నాన్నా నవ్వుతూ మాట్లాడుతూవుంటే వాడి కళ్ళు కోటిదీపాల వెలుగులు విరజిమ్ముతాయి. వాడి కళ్ళల్లో వెలుగు అనూరాధ జీవితానికి పూలబాట! వాడే ఆ ఇంటికి దీపం! ●

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## వనితాలోకం వ్యాసరచన పోటీ

**(ముగింపు తేదీ 16.9-1967)**

మొదటి బహుమతి ... రు. 200

రెండవ బహుమతి ... రు. 150

మూడవ బహుమతి ... రు. 100

**ఇవి కాక అయిదు రు. 50 కన్సొలేషన్ బహుమతులు!**

13—10—1967 ఆంధ్రసచిత్రవారపత్రిక, దసరాసంచిక, వనితాలోకం ప్రత్యేక సంచికగా వెలువడుతుంది.

ఈ సందర్భంలో 'వనితాలోకం వ్యాసరచన పోటీ' ఒకటి నడుపుతున్నాము

పోటీ వ్యాసం వస్తువుగా, నేడు మనదేశం ఎదుర్కొనే అతి ముఖ్యసమస్య అయిన జనాభాసమస్యని ఎన్నుకున్నాము. జనాభా పెరుగుదలని అరికట్టకపోయినట్లయితే మనదేశం చాలా కష్టాలని ఎదుర్కొనవలసివస్తుందని నిపుణులు అంటున్నారు దీనిని గుర్తించి మన ప్రభుత్వం 'కుటుంబ నియంత్రణ'కి సంబంధించిన పథకాలను అన్నివిధాలా అనుసరించాలని ప్రయత్నిస్తున్నారు. అయితే ప్రభుత్వం ఎంత ప్రయత్నించినా ప్రజల అంగీకారం, సహకారం అత్యవసరం

నేటి పరిస్థితులలో కుటుంబ నియంత్రణ పథకాలు, ఉద్యమాలు ఎటువంటి అవరోధాలని, సమస్యలని ఎదుర్కొంటున్నాయి? ఈ పథకాలు, ఉద్యమాలు ఎంతవరకు విజయవంతం కాగలవు? అవి విజయవంతం కావటానికి సామాన్యప్రజలు, ప్రత్యేకంగా వనితలు వహించవలసిన పాత్ర ఏమిటి?

ఈ ప్రశ్నలకి సరయిన సమాధానాలు కొంతవరకు స్త్రీలే ఇవ్వగలరేమో అని పిస్తుంది అందుచేతనే ఈ వ్యాసరచన పోటీని వనితాలోకం శీర్షికక్రింద నడుపుతున్నాము రచయిత్రులందరూ సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము

ఈ కింది పట్టికలో భారతదేశం జనాభా పెరుగుదలకి సంబంధించిన వివరాలు స్థూలంగా ఇవ్వబడ్డాయి. సంవత్సరం సుమారు 'పంటసంవత్సరం', అంటే జూన్ చివరికి అనుకోవచ్చు. జనాభా అంకెలు కోట్లు.

| సంవత్సరం......... | 1964 | 1976 | 1986 |
|---|---|---|---|
| జనాభా ............ | 47 2 | 64.8 | 85.6 |

నిబంధనలు 1. ఈ పోటీలో వనితలు మాత్రమే పాల్గొనవచ్చు. 2 వ్యాసాలు స్వంత రచనలు అయిఉండాలి ప్రతి వ్రాతప్రతితోనూ రచయిత్రి వ్యాసం తన స్వంత రచన అని హామీ ఇవ్వాలి 3 వ్యాసాలు 3 (మూడు) అరఠావు (అంటే ఎక్సర యిజు పేజీకి రెండు రెటు కల) పేజీలు మించరాదు 4 కాగితానికి ఒక వయిపునే సిరాతో రాయాలి 5 రచయిత్రి పూర్తి పేరు, చిరునామా వ్యాసం చివర రాయాలి వేరే కాగితం మీద రాసి జతపరచరాదు 6 కవరుమీద 'వనితాలోకం పోటీ' అని స్పష్టంగా రాయాలి. 7 రచనలు సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1కి పంపాలి 8 రచనలు మా కార్యాలయానికి 16-9—1967 లోగా చేరాలి. 9 రచనలు ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపబడవు అందుచేత రచయిత్రులు తమ రచనలతో స్టాంపులు, స్వంత చిరునామాల కవర్లు పంపరాదు 10. పోటీ తుది నిర్ణయం సంపాదకుడిదే ఈ విషయమయి ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపటం సాధ్యంకాదు. 11 ఫలితాలు 13-10-67 సంచికలో ప్రచురిస్తాము

—సంపాదకుడు

## జరిగిన కథ

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. అతని అక్కయ్య జ్యోతికి ఆనందరావుతో వివాహమవుతుంది. ప్రాణస్నేహితు లయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసుకుంటారు. రమణ భర్త వెంకట్రావు. పార్టీ రాజకీయాలతో విరోధివర్గాలయిన కుటుంబాలు వాళ్ళవి. సెలవుల నెపంమీద వేణు సుశీలను చూడ్డానికి జ్యోతి యింటికి వెళ్తుంటాడు. తన మీద ఆదినుంచి శత్రుత్వం వహించినా, వరదరాజులు హాస్పిటల్లో వుండడాన్ని విని కలతపడి శంకరంగారు భార్యతోసహా ఆయన్ని చూడ్డానికి వెళ్తారు. వేణు సుశీలను వివాహం చేసుకుంటానని వాగ్దానం చేస్తాడు అపవాదుని భరించలేక పార్వతి చదువు మానేస్తుంటుంది.

# 21

సీరియల్

తేజోవతి

'ఇది చూశారా వేంకటేశ్వరుని ఆలయం... అటు కొంచెం దూరంలో చర్చి వుంది... అదుగో అక్కడ మసీదు ... మూడు మతములు భగవంతుడనే గమ్యం చేర్చడానికి మూడుమార్గాలేతప్ప వేరుకాదని వీటి ఆశయమట...' అని వివరించింది ఉష.

'ఆలయానికి వెళ్దామంటారా ?...' ఆసక్తితో అడిగాడు డేవిడ్...

'ఆలస్యమౌతుంది .. పోదాం పదండి...' ఫ్రాంక్లిన్ హెచ్చరించాడు.

అందరూ చకచకా నడక సాగించారు...

'డగ్గర్ షిప్ రిపేరులోవుంది ... వెళ్ళి చూద్దామంటారా?.. ' 'డాక్ యార్డ్'లోకి రాగానే లీలను అడిగాడు ఫ్రాంక్లిన్...

'పదండి...' అంది వుత్సాహంగా లీల... వెంటనే ఫ్రాంక్లిన్ వెళ్ళి అక్కడున్న యింజనీరు పర్మిషను అడిగివచ్చాడు .. అంతా డగ్గరు షిప్ చూడ్డానికి బయలుదేరారు... 'షిప్' పైకెక్కడానికి అక్కడ పరిచివున్న చెక్కలమీదనుండి ఎట్లా ఎక్కడమా అని ఆలోచిస్తుంటే, అక్కడ పని చేస్తున్నతడు, 'జాగ్రత్తగా ఎక్కండి బాబూ! ... ఆ కొయ్యపట్టుకు ఎక్కచ్చు గానీ...తారవుతుందేమో బాబూ...పోనీ యిలా చెయియ్యండి బాబూ..' అంటూ వేణుకు డేవిడ్ కు చేయూత నిచ్చాడతడు .. డేవిడ్ లీల చేతిని పట్టుకుని పైకి లాక్కున్నాడు ... తలవని తలంపుగా చెయి అందిచ్చింది ఉష.. వేణు ఉషను పైకిలాగి చెయ్యి వదిలేశాడు...కానీ ఆ అనుభూతిని మాత్రం మర్చిపోలేకపోయింది ఉష...

'డగ్గరుషిప్' చూశాక దిగి, అక్కడి నుంచి సాగిపోతున్న నౌకలను చూచు కుంటూముందుకు సాగారు అంతా ... డాక్ యార్డ్ లో నుండి హార్బర్ లోకి వెళ్ళాలంటే చిన్న కాలువలా వున్న సముద్రాన్ని చిన్న బోటు మీద దాటాల్సి వచ్చింది ... బోటు ఎక్కగానే డేవిడ్, 'అదే కాబోలు!... నాకు సముద్రయానం చేసే గీతుందని వెనక ఓ పామిస్ట్ చెప్పాడు!...' అన్నాడు డేవిడ్... ఆ మాటకు అందరూ నవ్వు కున్నారు...

పోర్ట్ లోకి వెళుతూ కెమెరా ఆఫీసులో వుంచి వెళ్ళాల్సి వచ్చింది. హార్బర్ లో రెండు మూడు కార్గోషిప్స్ వున్నయి... దగ్గరలో వున్న గ్రీన్ షిప్ ఎక్కి చూస్తూ, 'నాకు ఫారిన్ వెళ్ళే గీత వుందన్నారు'... ఇదే కాబోలండీ...' అన్నది డేవిడ్ వైపు చూసి నవ్వుతూ ఉష...

'ఆ గీతేదో మీ ఒక్కరికే కాదండోయ్ ... మా అందరికీ వున్నట్లే ...' అన్నాడు డేవిడ్...అందరూ నవ్వుకున్నారు...

'వేణూ!...ఈ ఫ్రెజిగ్ పైప్ చూడండి.. ఎంత తమాషాగా వుందో.. మనం మూతి పెట్టినట్టు పెట్టి పీల్చగానే మంచి నీళ్ళు వస్తున్నయి నోట్లోకి !...' ఉష ఆశ్చర్యంగా వేణును పిల్చుకెళ్ళి చూపించింది...

'వేణూ!...ఆ 'క్రూ'లో అతడు యిచేదో చూయింగ్ గమ్ లా వుంది ... ఇచ్చాడు చూడండి...' తెల్లగా తుమ్మ జిగురులా వున్న చిన్న ముక్క వేణు చేతిలో పెడుతూ అంది ఉష...

హార్బరు చూసి తిరిగి వచ్చేసరికి పదకొండు దాటింది ... హోటల్ చేరుకోగానే, 'ఈ పూట మీరంతా మా అతిధులు...' అన్నది లీల...త్వరత్వరగా భోజనాలు ముగించుకుని మళ్ళీ అంతా బయలుదేరారు...నెంబర్ టెన్ బస్సుకి అప్పుడే రద్దీ ఎక్కువవు తోంది...యూనివర్శిటీ కాంపస్ చేరుకుని ముందు ఆర్ట్స్ కాలేజి చూడ్డానికి వెళ్ళారు... అక్కడి నుండీ లైబ్రరీ లైబ్రరీ ముందు అందర్నీ ఫోటో తీశాడు వేణు...సాయంత్రం దాకా అంతా తిరిగి చూచారు... నాలుగయ్యాక ఉష అందర్నీ తమ క్వార్టర్సుకి తీసుకెళ్ళి కాఫీ యిచ్చింది.. అక్కడ నుండీ యూనివర్శిటీ హాస్టలుకు చేరుకున్నారు అంతా...

'ఏమండోయ్! మీరు 'సిద్ధార్థ'లో వుంటున్నారు...బుద్ధుని భక్తులన్నమాట ., అని లీల అనగానే, 'అబ్బెబ్బె! నేనేమి భక్తుడ్ని కాదండీ..' అన్నాడు వేణు ... అంతా అక్కడే కాన్వొకేషను గౌన్సు తొడుక్కున్నారు...

'పద...పద...పెళ్ళి నడకలు మానేసి... అప్పుడే హాలు నిండి పోతుంది...' అంటూ లీలను తొందర చేశాడు డేవిడ్...

'ఏమోబాబూ! ... ఈ గౌను వేసుకుని వెళ్ళాలంటే నాకు సిగ్గేస్తోంది...'

'మరి దాని కోసమేగా నాలుగేళ్ళు అహోరాత్రాలు కష్టపడ్డావ్!...' అన్నాడు డేవిడ్...

హడావుడి చేసి బయలుదేరబోతున్న డేవిడ్ ను చూసి, 'హార్నీ హడావుడి!...డేవిడ్!... నీ సర్టిఫికెట్ అక్కడ ఎవ్వరికీ యిచ్చెయ్యరుగాని...ఆగవోయ్ ఫోటో తీస్తాను..' అన్నాడు వేణు నవ్వుతూ...

అందరికీ ఫోటోలు తీసిన వేణును చూసి, 'మాకు ఒక్కొక్కరికీ ఫోటో తీశారు, బాగుంది .. మరి మీకెలా వేణూ! .. పోనీ కేమెరా 'ఎడ్జస్ట్' చేసి యివ్వండి నేను తీస్తాను...' అని అడిగింది

ఉష...

ఆ తర్వాత కెమెరా హాస్టల్లో వదేసి, యించుమించు ఓ ఫర్లాంగు దూరంలోవున్న కాన్వొకేషను గ్రౌండ్‌కి వెళ్ళారు అంతా... అప్పటికే చాలామంది ఎవరి సీట్లల్లో వాళ్ళు కూర్చుని వున్నారు ... డేవిడ్ వాళ్ళూ వెళ్ళి కూర్చున్న కాస్సేపటికల్లా సెనేట్ మెంబర్సు, ఛాన్సలర్, వైస్‌ఛాన్సలర్ అంతా డయాస్‌మీదికి వచ్చారు...

వెనుక సీట్లల్లో వున్న డేవిడ్‌కు, వెనుక వైపునుండీ వినబడుతున్న నవ్వులు వ్యాఖ్యానాలు వింటుంటే, 'పట్టా' తీసుకోడానికి వచ్చి ఏమిటి గొడవ ... అనిపించింది ... 'ఓత' తీసుకోడం అయిపోగానే, లేచి వెళ్ళిపోతే బాగుండునని గూడా అనిపించింది డేవిడ్‌కు...పట్టభద్రులైనవాళ్ళే, అత్యంత క్రమశిక్షతో జరగవల్సిన పట్టప్రదానోత్సవంలో యిట్లా ప్రవర్తిస్తుంటే ... ఇక అక్షరజ్ఞానంలేని మామూలు ప్రజానీకం నుండి ఎటువంటి ప్రవర్తన ఆశించగలం మనం?...అనుకున్నాడు.

'వేణు బి.ఎస్సీ...యూనివర్సిటీ ఫస్టు... మెడల్...' అని వినబడగానే ముందు సీట్లల్లో కూర్చున్న వేణు లేచాడు తడబడే అడుగులతో ... ఆ సమయంలో అతడికి అనిర్వచనీయమైన ఆనందం కలిగింది. 'హేట్' తీసి ఛాన్సలర్ ముందు వంగి మెడల్ అందుకున్నాడు ... ఛాన్సలర్‌గారు షేక్‌హేండ్ యిస్తున్నప్పుడు వేణు కళ్ళముందు శంకరంగారు మెదిలారు. 'చిక్' మంటున్న 'ఫ్లాష్' లైట్లతోబాటు ఓజత కళ్ళుగూడా ఆ సమయంలో అతడి ఫోటోను మనోఫలకంపై చిత్రించుకున్నయ్యని వేణుకు తెలియదు!...

'ఈ ఘనత నాదికాదు, శంకరం మేష్టరుది' అనుకుంటూ 'డయాస్' మీదనుండి తిరిగి వచ్చేస్తున్న వేణును మనస్ఫూర్తిగా అభినందిస్తూ కరచాలనం చెయ్యడానికి వచ్చిన ఉష, అతడి చేతిలోని పుస్తకాల బొత్తిని అందుకుంటూ అభినందనలు తెలిపింది ... పట్టప్రదానోత్సవం పూర్తికాగానే సత్యవతి అటునుండీ అటు హాస్టలుకి వెళ్ళిపోయింది...అందరూ తిరిగి 'సిద్ధార్థ' చేరుకున్నారు ... ఇంతదాకా కాన్వొకేషను గౌనుతోనేవున్న డేవిడ్‌ను చూసి, 'తమరు డిగ్రీ పుచ్చుకున్నారని మా అందరికి తెల్సుగానీ, యికే ఆ గౌను విప్పెయ్యండి మహాప్రభో!...' అంటూ వేళాకోళం చేసింది లీల.

'సర్లే!...ఈ కాస్సేపటికి అద్దె రూపాయలిచ్చాను...ఉండనీ...' అన్న డేవిడ్ మాటలకు అంతా నవ్వుకున్నారు.

'ఉషా!...మీరిటు మీ క్వార్టర్సుకి వెళ్ళిపోతారా ?...' హాస్టల్‌కిరాగానె అడిగాడు వేణు.

'అయ్యో!...అదెలా?... అతిదుర్భి దింపి



# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

రావద్దా?..!'

'డేవిడ్!.. ఇక్కడ బస్సుచిక్కడం కష్టం గానీ...కొంచెం ముందుకు వెళదామా?...' అని అడిగాడు ఫ్రాంక్లిన్.. డేవిడ్ 'సరే' అనగానే, కాంపస్ దాటి ఒక సందులోకి తీసుకువెళ్లాడు ఫ్రాంక్లిన్ .. 'ఒరేయ్!.. అక్కడికి బస్సు వస్తుందో రాదో? ... ఖాళీ వుంటుందో వుండదో? ... కాస్సేపు ఆ మెయిన్‌రోడ్డు మీదనే నిలబడదాం...' అన్న వేణుకు, 'నీ కెందుకు పద ... బస్సెక్కిస్తాను. .'అంటూ దారితీశాడు ఫ్రాంక్లిన్...

'అరె! . ఇదేమిటండీ! ఈ దోవన తీసుకు వచ్చారు?...చీకటి . లైట్లు కూడా లేవు... అసలు వైజాగ్ ఎల్లల్లోనే వున్నామా?... కాళ్లు పీక్కుపోతున్నాయి .. ఇంకా ఎంత దూరం నడవాలి బాబూ ?...' అంది లీల యిక నడవలేక .

'ఇదో ... యిక్కడేదో చిన్న కిళ్లీ కొట్టుంది .. సోడా తాగుదాం రండి ' అంటూ డేవిడ్ అందరికీ సోడా ఇప్పించాడు... సోడా త్రాగి సేదదీర్చుకుని, 'ఏమండీ . అది ఇంతకు ముందు నడిచినదానికి. మరి ఇకముందు నడవబోయ్యేదానికి?...' అని అడిగింది లీల...

'లేదండీ ... ఈ అడ్డ దోవన వెడితే అక్కడ బస్ అందుకోవచ్చు. చాలా ఖాళీ కూడా వుంటుంది...' అని నచ్చచెప్పాడు ఫ్రాంక్లిన్..

లీల, డేవిడ్, ఫ్రాంక్లిన్ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు...వాళ్లతోనే నడుస్తున్న వేణు, ఉష వెనుకబడ్డం చూచి దగ్గరకొచ్చి, 'ఇదేం, ఉషాదేవీ! అందరికంటే యింత వెనకబడిపోయ్యారు ... కాళ్లు బొబ్బలు పుడుతున్నయ్యా?' అని అడిగాడు ..'అబ్బే లేదండీ ... ఆ తాటిచెట్ల మధ్యనుండీ, అందంగా కనిపిస్తున్న ఆ చందమామను చూస్తూ నడుస్తున్నాను... చూడండి ...ఆ చక్కటి చంద్రుడు. మధ్య చిన్న మచ్చ, నవ్వుతున్న నక్షత్రాలు. వీటి మధ్యగా పరుగెత్తుతున్న ఆ చంద్రుడు .. ఇవన్నీ చూస్తుంటే మీ కేమనిపిస్తుందో చెప్పండి...' అన్నది ఉష.

'చెప్పమంటారా !...రష్యావారు, అమెరికా వారు ప్రయోగించిన రాకెట్లతో కొంత మనసు గాయపడ్డా, 'ఇంకా మీ మనుషులు నామీద కాలు మోపలేదుగా?... అంటున్నట్టున్నాడా చంద్రుడు, మానవుని విజయానికి చిహ్నంగా వున్నది ఆ చిన్న మచ్చ! మీ మొహం మీరింకా చంద్రుడి దాకానే రాలేదు ... మా దాకా వచ్చే దెప్పుడూ ? అని ఎగతాళి చేస్తున్నట్లుగా నవ్వుతున్నాయి నక్షత్రాలు.. పాపం! నిర్ణీత కాలంలో భూప్రదక్షిణం పూర్తి కాదేమో నని వురుకులు పరుగులు పెడుతున్నట్టున్నాడు చంద్రుడు ..చూశారా ఉషాదేవిగారూ! ప్రకృతి కూడా మనల్ని కాస్త తొందరగా నడవమనే చెబుతోంది, పెళ్ళినడకలు మానేసి !...'




'బాగుంది ! ... అందమైన ముఖాన్ని, అందమైన చంద్రుణ్ణి తనివిదీరా చూడాలని ఎవరి కనుపించదు!...'

'ఓహో.. అయితే యింకేం!.. మీరిలా అందంగా చంద్రుణ్ణి చూస్తూ నడవండి... అక్కడ పదిహేడోనెంబరు బస్సు అందంగా వచ్చి, మరీ అందంగా తుర్రుమంటుంది!... అప్పుడు మనం అందరం చాలా అందంగా నడవాల్సివస్తుంది!'. అని వేణు వ్యంగ్యంగా హెచ్చరించేసరికి, 'మొత్తానికి మీరు చెప్పడంమాత్రం చాలా అందంగా వుంది !' అంటూ త్వరత్వరగా నడిచి వాళ్లను కలుసుకున్నారు...

'అదో !...ఆ లైట్లు వెలుగుతున్నాయి. అదే విజయనగరం మహారాజావారి పాలెస్... ఇటు పోతే మెంటల్ హాస్పిటల్ వస్తుంది... మనం ఇప్పుడిటే వెళ్లాలి ...' అని ఫ్రాంక్లిన్ చూపిస్తుంటే. 'అయ్యో! మా కెవ్వరికీ పిచ్చెక్కలేదండీ బాబూ మెంటల్ హాస్పిటల్ రోడ్డు చూపించడానికి!...' అంది లీల నవ్వుతూ...

'అది నీకాదు లీలా !...నాకు చూపిస్తున్నాడు .. నీలాంటి భార్యను కట్టుకున్నందుకు ఎందుకైనా మంచిదని, ముందుగానే మెంటల్‌హాస్పిటల్ రోడ్డు చూపించివుంచుతున్నాడు.. అంతేనా ఫ్రాంక్లిన్ ?...'

'పోనీ అలాగే అనుకున్నా మన ముంటున్న నెల్లూరికి కీల్పాక్ దగ్గరగదా ?...'

'సరేలే. పిచ్చెక్కాక కూడా నీకు దగ్గరోనే వుండాలా !... ఇక్కడైతే మా ఫ్రెండ్స్ అయినా వుంటారు దగ్గర!...' అన్న డేవిడ్ మాటలకు అంతా కడుపుబ్బా నవ్వుకున్నారు...

మర్నాడు వాళ్ళకు వీడ్కోలు చెప్పడానికి స్టేషనుకు వచ్చిన ఉషతో, 'నిన్నంతా మీకు చాలా శ్రమయిచ్చాం...' అంది లీల...

'ఫర్వాలేదు. వేణులాంటి మంచి మిత్రుడ్ని పరిచయం చేశారుగా!...' అన్నది ఉష నవ్వుతూ...

రైలు ప్లాటుఫారం దాటేదాకా రుమాలు వూపుతూ నిలబడ్డారు ముగ్గురూ...ఆతర్వాత ముగ్గురూ బయలుదేరి తిరిగి వచ్చేస్తుంటే దారిలో 'వేణూ!...మీరు అన్ని ఫోటోలు తీశారుగదా...మాకు కాపీలివ్వరా?' అని అడిగింది

ష...'ఓయస్. అలాగే యిస్తా లెండి..., అన్నాడు వేణు.

వేణు ఫ్రాంక్లిన్ హాస్టలు చేరుకోగానే వేణూ రూమ్మేట్ రాజా అడిగాడు. 'నిన్నంతా / విా మొఖమే కన్పించలేదు మాకు...ఎవరోయ్ ఆ మిత్రులు?...'అని...

'డేవిడ్ నేనూ చిన్నప్పటి మంచి ఫ్రెండ్స్ము...ఈ వేణు ముందు క్రికెట్‌లో ఫ్రెండ్ అయి తర్వాత కాలేజిలో క్లాస్ మేట్ అయ్యాడు ... డేవిడ్ బి. ఎస్సీ కాగానే 'జాబ్' చూసుకున్నాడు...అదిడేమో అక్కడ కో—ఎంప్లాయీ ఆట... మొన్నీ మధ్యన 'మారేజి' అయింది...' అని వివరంగా చెప్పాడు ఫ్రాంక్లిన్...

'వేణూ! ... నీకేదో లెటర్ వచ్చింది...

# పూరాం సంధ్యా ప్రవర్తతే..

'టేబిల్‌మీద పెట్టాను చూడు...' అనగానే ఆత్రుతగా వెళ్ళి కవరు తీసుకుని చించాడు వేణు...

జ్యోతి దస్తూరీ! ... సహజంగా జ్యోతి వుత్తరమే వ్రాయదు...వ్రాసిందంటే ఏదో పెద్ద విశేషమే వుండాలి!...అనుకుంటూ ఆత్రుతగా చదివాడు...

'ఏరా అబ్బాయి !...

ఈమధ్య మమ్మల్ని బొత్తిగా మర్చిపొయ్యావ్!...దీన్నిబట్టి నువ్వు ఎంత దీక్షగా చదువుతున్నావో అంచనా వేసుకోమంటావా?...ఏమైనా బాధ్యత తెలుసుకునే వయసు వచ్చింది నీకు...కష్టపడి చదవమని మేము హెచ్చరిస్తే అది హాస్యాస్పదంగానే వుంటుంది...

'ఇంతకూ నీకు రెండు విశేషాలు వ్రాయాలని మొదలుపెట్టాను... మొదటిది...మా సుశీల...(ఇలా కావాలనే వ్రాస్తున్నాను.)...గత సెప్టెంబరులో గుంటూరు వెళ్ళి మెట్రిక్, పరీక్ష వ్రాసియిచ్చింది .. వ్రాయడమేమిటి? రిజల్టుకూడా వచ్చాయి... సుశీల పాసయింది ఈ విషయం... ముఖ్యంగా నీకు సంతోషం కలిగిస్తుందని నాకు తెలుసు...'ఇదంతా బావ ప్రోద్బలం నీ సహాయం వదినమ్మా...' అంటూ ఎంతో యిదయింది...నీకుకూడా ధన్యవాదములు తెలుపమన్నది... 'పోనీ అడ్రసు యిస్తాను...నువ్వే వ్రాయరాదా' అన్నాను... కాని ఎందుకో భయపడింది...

'ఇక రెండో విషయం.. సుశీలకు పెళ్ళి సంబంధాలు వస్తున్నయి. దుర్గమ్మగారు యిక ఎక్కువ రోజులు బ్రతికేట్టు లేదన్నారుట వైద్యులు...ఆవిడ యీ పిల్ల పెళ్ళి కళ్ళారా చూసిపోవాలని తాపత్రయపడుతోంది... మొన్నా మధ్య ఓ సంబంధం చూశారు...వాళ్ళ పిన్ని పడుతూ లేస్తూ అన్ని ఏర్పాట్లూ చేసుకుంది పెళ్ళిచూపులకు వస్తారని...తీరా పెళ్ళివారు వస్తే సుశీల ఎక్కడా కనిపించలేదు గాభరాగా అన్నిచోట్లా వెతికాం. ఇంతా చేస్తే మన మేడమీద కూర్చుని ఏడుస్తోంది సుశీల!... నేను నివ్వెరపొయ్యాను...

'అక్కడ వాళ్ళొచ్చి కూర్చున్నారు పిల్లను చూపమని... ఇదా యిక్కడ నువ్వు చేస్తున్న 'ఘనకార్యం...' అంటూ కసిరాను...

'నువ్వూ ఆలాగే అంటున్నావా వదినమ్మా?...' అంటూ బావురుమని ఏడ్చింది సుశీల.. నేను దగ్గరకు వెళ్ళి తల నిమురుతూ, 'ఎందుకు ఏడుస్తావు పిచ్చిదానిలా?' అని అడిగాను.

'నాకీ పెళ్ళి యిష్టంలేదు వదినమ్మా...' ఆచి చెప్పింది. మెల్లగా...

'ఇష్టంలేని దానిని ముందు సంబంధం మాట్లాడేటప్పుడే చెప్పాల్సింది...లేదా పెళ్ళిచూపులయ్యాక నాకు నచ్చలేదన్నా కొంత వరకూ బాగుంటుంది... కానీ తీరా వాళ్ళు వాకిట్లోకి వచ్చి కూర్చున్నాక యిలా ఏడిస్తే ఎలా.. లే . లేచి పిన్ని మర్యాద కాపాడు...' అంటూ నచ్చచెప్పి ఎలాగో తీసుకువెళ్ళాను... ఆతగాడి వైపు కన్నెత్తి అయినా చూడలేదు మన సుశీల. పిన్ని చెప్పిందానికల్లా గంగిరెద్దుల్లా తలవూపే సుశీల యింత మొండిగా, యింత నిర్దయంగా ఎందుకు ప్రవర్తిస్తోందా అని సందేహం వచ్చింది నాకు...

'మర్నాడు సుశీల మనింటికి వచ్చినప్పుడు అడిగాను... ఎంతడిగినా చెప్పలేదు సుశీల...' ఎన్నాళ్ళిలా వచ్చిన సంబంధాలన్నీ తిరగగొడుతూ, మనసులోమాట ఎవరికీ చెప్పకుండా నీలో నువు కుమిలిపోతావ్?...' అని కోప్పడితే అప్పటికి చెప్పింది... వేణుబావను చేసుకోవాలని వుందని...నువ్వు కూడా చదువయ్యాక తప్పక పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చావట కూడా?...

'మా వేణు అన్నమాట ఎప్పటికీ తప్పడని ధైర్యం చెప్పాను...ఇప్పుడు యీ విషయం వాళ్ళ పిన్నితో ఎలా చెప్పాలో నాకు తెలియటం లేదు... 'చదువు చదువంటూ యిందుకా , మా యింటికి తీసుకెళ్ళావ్?' అని నిలేస్తుందేమోనని భయంగా వుంది... ఈ విషయం... సూచన ప్రాయంగానైనా ముందు తెల్పివుండాల్సింది నాకు...ఇప్పుడు యీ సమస్యను పరిష్కరించేందుకు నీకేమన్నా వుపాయం తోస్తే చెప్పు...

'ఇక యిక్కడికి విశేషాలు...మా బావగారి ఎన్నిక చెల్లదని వెంకట్రావుగారు పిటీషను, మిగతా పంచాయతీ మెంబర్ల ఎలక్షను గూడా చెల్లదని మా బావగారు పెట్టిన కౌంటరు పిటీషను గూడా గెలిచాయి ... అంటే పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చిందన్నట్టు.. ఎవ్వరి ఎన్నికా చెల్లదు...కాబట్టి మళ్ళీ ఎలక్షను జరుగుతుందిట పంచాయతీకి...ఈ మాటు అంతా చాలా పట్టుదలతో వున్నారు .. ఏమి జరిగేదీ ఆ భగవంతుడికే తెలియాలి . '

వేణు వుత్తరం మడిచి జేబులో పెట్టుకున్నాడు .. అతడి మనసులో సుశీల మెదిలింది ... తన డైరీ తెరిచి సుశీల ఫోటో చూసుకున్నాడు...ఎలా వుందో తన సుశీ?... సుశీలను చూసి చాలా రోజులయింది ... రెండేళ్ళ క్రితం చూచిందే మళ్ళీ వెళ్ళనే లేదు...క్రిందటి ఎండాకాలం అక్కా బావా గుంటూరులోనే వుండడంతో, సుశీలను చూసే అవకాశం చిక్కలేదు ఎన్నో సార్లు వుత్తరం వ్రాయాలనిపించింది. కానీ వాళ్ళ పిన్ని చూస్తే ఏమంటుందోననే భయంతో వ్రాయలేక పొయ్యాడు...అక్కపేరట వ్రాయడానికి అంతకంటె మనసొప్పలేదు. ఇప్పటికి గూడా అక్కకి తెలిసిందంటే వేణుకు సిగ్గుగానే వుంది ఆ వుత్తరానికి ఏం జవాబు వ్రాయడానికీ తోచక వూరుకున్నాడు ..

మరి కొద్ది రోజులకల్లా క్రిస్మసు సెలవులిస్తారుగదా. . గుంటూరు వెళ్ళినపుడు అక్కా వాళ్ళ వూరికి వెళ్ళి మాట్లాడవచ్చును కున్నాడు.. కానీ... చిన్నాన్నకొడుకు ఖరగ్‌పూర్ రమ్మని వ్రాయడంతో సెలవులు అక్కడ గడిపి వచ్చాడు వేణు .

సెలవులయి వచ్చాక ఒకరోజు లైబ్రరీ ముందు కన్పించింది ఉష ... చూస్తూనే 'ఫోటోలు యిస్తామన్నారు ఏమయ్యాయి?. ' అని ప్రశ్నించింది...

వేణు అసలా విషయమే మర్చిపొయ్యాడు... ఉష రూపం అతడి మనోఫలకం మీద నుంచీ ఎప్పుడో చెరిగిపోయింది...

'నేను యిన్నాళ్ళూ వూర్లో లేను గదండీ! .. సాయంత్రం పట్టుకొచ్చి మీ యింట్లో యిస్తాలెండి ' అప్పటికి తోచిందేదో అనేశాడు.

'తప్పక వస్తారా!...అయితే సాయంత్రం ఎన్నిగంటలకు వస్తారో చెప్పండి...' అని అడిగింది సంతోషంతో ఉష...

వేణు యిరుకున పడిపొయ్యాడు ... 'సాయంత్రం నాలుగూ ఐదు గంటల మధ్య

వస్తానండి...' అనేశాడు...

ఆ సాయంత్రం అక్క వ్రాసిన జాబుకు జవాబివ్వకపోతే ఏమనుకుంటుందో, జరిగిందంతా వ్రాద్దామని, చదువయ్యాక తప్పక పెళ్ళిచేసుకుంటాడని వాళ్ళ పిన్నికి నచ్చ చెప్పమనీ వ్రాద్దామనుకొని కూచున్న వేణుకు రాజా జ్ఞాపకం చేశాడు... 'ప్రొఫెసరుగారింటికి వస్తానని ప్రామిస్ చేశావుగా వాళ్ళమ్మాయికి?' అని.

వేణు విధిగా లేవాల్సివచ్చింది. ఫోటోలు తీసుకుని ప్రొఫెసర్‌గారి క్వార్టర్సు చేరుకున్నాడు ... అతడికోసమే ఎదురు చూస్తున్నట్లు ఉష వాకిట్లోనే నిలబడివుంది !... వేణును చూడగానే సంతోషంతో ఆహ్వానించి లోపలకు తీసుకెళ్ళింది..

'డాడీ! ... నేను చెప్పాను వేణుగోపాల్ అని! ... వీరే డాడీ!...' అంటూ తండ్రికి పరిచయం చేసింది...

'కమిన్ మిస్టర్ వేణుగోపాల్!... బి సీటెడ్...'

వేణుకు అక్కడ ఎక్కువ సేపు కూర్చోడానికి భిడియం వేసింది...

'డాడీ!... ఆయన మంచి ఫోటోగ్రాఫరు కూడా... మొన్న మా ఫ్రెండ్ వచ్చినప్పుడు చాలా ఫోటోలు తీశారు...' అది ఉష విషయం ఎత్తడంతో...

'ఇదిగోనండి ఫోటోస్' అంటూ ఉష చేతికి కవరు అందిచ్చాడు వేణు...

విప్పారిన మొఖంతో కవరందుకున్న ఉష, ఒక్కొక్క ఫోటో తీసి తండ్రికి చూపించింది...అన్నీ చూసి ఆయన 'గుడ్' అని మాత్రం అన్నారు...

చంద్రశేఖరంగారు మితభాషి ... ఆయన తరహానే వేరు... ఉష ఐదేళ్ళ పిల్లగా వున్నప్పుడు భార్య చనిపోయింది... అప్పటి నుండీ ఆయనకు ఉష ... తర్వాత పుస్తకాలూ...ఈ రెండే లోకం...ఆయనకు ఉష మీద అపారమైన నమ్మకం వుంది... ఉష యిన్నిగూడని వాళ్ళకు చనువు యివ్వదని తెలుసు... ఉష యింతగా ప్రశంసిస్తున్న వేణు చాలా యోగ్యుడై వుండాలని ఆయన ముందే అనుకున్నారు ... దానికి తోడు వేణు ఆకర్షణీయమైన విగ్రహం, ప్రవర్తనలోని వినయంతో కూడిన హుందాతనం ... అదీ చూస్తే ఆయనకు వేణు మీద సదభిప్రాయమే కలిగింది .. 'వస్తా'నని లేచిన వేణును...'కాఫీ తీసుకు

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

వెళుదురుగాని వుండండి.' అంటూ కాస్సేపు కూర్చోబెట్టింది.. కాఫీ తీసుకున్నాక వచ్చేస్తున్న వేణుకు గేటుదాకా వచ్చి మరీ వీడ్కోలిచ్చింది ఉష...

* * *

'అరె! ఇదేమిటి! మీ రిక్కడికి వచ్చారు?...' వుమెన్స్ హాస్టలునుండి బయటకు వస్తున్న ఉష.. లోపలికి అడుగుపెట్టబోతున్న వేణును చూసి ఆశ్చర్యపోతూ అడిగింది...

ఆ ప్రశ్నకు నవ్వొచ్చింది వేణుకు... 'ఇదేమీ ప్రొహిబిటెడ్ ఏరియా కాదు గదండీ?...' అని చిలిపిగా అడిగాడు...

'అహ...అదికాదు...మీ కావల్సిన వాళ్ళెవరైనా యిక్కడున్నారా? అని... అడగబోయి...' ఉష నసిగింది...

'ఇంతదాకా మీ దయవల్ల...నాక్కావల్సిన వాళ్ళెవ్వరూ యిక్కడ లేరులెండి...' అని జవాబు చెప్పాడు వేణు.

ఉష తేలిగ్గా గాలి పీల్చుకుంది... ఇద్దరూ బస్సుకోసం ఓ చెట్టుక్రింద నిలబడ్డారు...

'ఏదో పనిమీద హాస్టలుకు వచ్చినట్లున్నారు? నన్ను చూడగానె వచ్చేస్తున్నారేం?' అని అడిగింది ఉష.

'వచ్చిన పని అయిపోయింది గనుక... రావల్సిన వారు వచ్చేశారు గనుక...' రకీమని జవాబిచ్చాడు వేణు. నిజానికి వేణు ఒక యువతి దగ్గర రిఫరెన్సు పుస్తకం తీసుకోడానికి వచ్చాడు...కానీ ఆ విషయం చెప్పి ఉష వుత్సాహం చెడగొట్టడం యిష్టం లేక అలా అనేశాడు...బస్సు వచ్చేదాకా యిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నిలబడ్డారు...

ఆ రాత్రి డైరీ తియ్యగానే సుశీల ఫోటో కన్పించింది వేణుకు ... వెంటనె ఉష జ్ఞాపకం వచ్చింది...లేత నీలిరంగు జార్జెట్ చీరెలో, అదే రంగు బ్లౌజు వేసుకున్న ఉష పలుచని మబ్బుతెరల మధ్యనుండీ తొంగిచూచే నెలవంకలా వుంది అనుకున్నాడు వేణు.. కానీ సుశీ... కళ్ళల్లో వున్న ముగ్ధత్వం యీ అమ్మాయి కళ్ళల్లో లేదు... అని గూడా అనుకున్నాడు ... ఆ రాత్రి సుశీల ఉష యిద్దరూ కల్లోకి వచ్చారు వేణుకు...

ఓ నాలుగురోజులు గడిచాయి...

ఆ రోజు అదివారం. వేణు నెంబర్ సిక్స్‌బస్ దిగి ఏకాఏకి ఘాట్‌రోడ్డువైపు నడుస్తున్నాడు .. .

'వేణూ!...'

సన్నని, తియ్యని ఆ స్వరం ఎక్కడో బాగా పరిచయమైందిలా తోచి వేణు చుట్టూ చూశాడు సింహాచలం బస్సు దిగి కొండమీదికి వెళ్ళే దేవస్థానంబస్సు ఎక్కబోతున్న ఉష కన్పించింది...అతడు యాంత్రికంగా అటు వెళ్ళాడు

'ఏమిటి?.. అటు వెళుతున్నారు? మీరు బస్సులో రారా? ..'

'అబ్బే! నేను ఘాట్‌రోడ్డున నడిచి వెళ్ళామనుకుంటున్నాను...' అని వేణు అనగానే బస్సు ఎక్కబోతున్న ఉష దిగి ఇవతలకు వచ్చి, 'అదేం? నడిచి వెళితే ముక్తి వస్తుందనా?...' అని అడిగింది ..

'ముక్తి!...అదేదో ఆ సంగతి మీరు వాల్తేరులోనే గ్యారంటీ యిచ్చుంటే నేను అక్కడినుండి నడిచి వచ్చేవాడినే!...ఇంతకీ మీరు నే వచ్చిన బస్సులో రాలేదు...కొంపదీసి వాల్తేరునుండీ నడిచి వచ్చారేమండీ?..' అని అడిగాడు వేణు నవ్వుతూ...

అబ్బ! ... ఇతడెందుకిలా మత్తుమందు చల్లినట్లు నవ్వుతాడేం!...అనుకుంది ఉష...

'నేను మీరువచ్చిన బస్సుకంటె ముందు బస్సులో వచ్చానులెండి ... ఇంతకూ మీ పాదయాత్రకు కారణం వివరించారు కారు!'

'ఘాట్‌రోడ్డుమీద నడిచి వెళుతూ ఫోటోలు తీసుకోవాలని...'

'అయితే యిదివరలో మీరెప్పుడూ సింహాచలం రాలేదా?...'

'వచ్చానుగానీ ... మీలానే బస్సులో ఎక్కి బస్సులో దిగాను ... మంచి సీనరీ తియ్యడానికే లేకపోయింది...అందుకని ప్రత్యేకంగా యీ ప్రోగ్రాం ఏర్పాటు చేసుకున్నాను...'

'అయితే పదండి...మీకే అభ్యంతరం లేకపోతే నేనూ వస్తాను మీతో...'

'తోడు వస్తామంటే అభ్యంతరమా?... భలేవారే! పదండి...'

వేణూ కెమెరా 'లోడు' చేసుకున్నాడు అక్కడే ... ఇద్దరూ ఘాట్‌రోడ్డున నడక సాగించారు నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ...

'ఫోటోగ్రఫీ ఒక పిచ్చిలాంటిదండీ ... ఆకలీదప్పులూ అనిపించవు ... అన్నిటికంటె జనసంచారం లేని యీ రోడ్డుమీద యిలా నడవడమంటే నాకు భలే యిష్టం ... మీకెలా వుందోగానీ...' అన్నాడు వేణు.

'ఒంటిగా అంటే నాకూ భయంగానీ...యిలా ఎవరన్నా తోడుంటే నాకూ సరదాయే...' అంది ఉష....

దూరంగా మబ్బుల మసకలో బూడిదరంగుతో కన్పిస్తున్న కొండల వరుసలు, బొమ్మల కొలువలా కన్పిస్తున్న యిళ్ళూ చూచుకుంటూ నడుస్తున్నారు యిద్దరూ...

'వేణూ! ... అదో ఆ కొలను ... మధ్య మంటపం' నాలుగువైపులా ప్రతిబింబాలు చూసుకుంటున్నట్లున్న తాటిచెట్లు... ఆ సీనరీ తియ్యండి...' ఉష అడిగింది...

'బ్యూటిఫుల్ వ్యూ ... అరె! ఇదేమిటి కెమెరా సరిగా వర్క్ చెయ్యటం లేదే?... ఇందాక రెండు 'స్నాప్స్' బానే వచ్చాయి...' వేణు కంగారుగా దాన్ని బాగుచెయ్యడానికి ప్రయత్నించాడు ... అటు తిప్పాడు యిటు తిప్పాడు ... వేణు తిప్పలు పడుతుంటే ... పిట్టగోడ దాటి జాగ్రత్తగా వెళ్ళి సువర్ణగన్నేరు పూలు కోసుకొచ్చుకున్న ఉష వస్తూనే, 'ఏమంటోందండీ మీ కెమెరా?...' అని అడిగింది.

సమయానికి చెడికూచున్న కెమెరాను కసిగా చూస్తూ తల అడ్డంగా తిప్పాడు వేణు లాభం లేదన్నట్టు...

పక్కనే వున్న ఓ కొండరాయి మీద కొండల రాణిలా కూర్చున్న ఉష, 'అయితే నెక్స్ట్ ప్రోగ్రాం?...' అని కీవిగా ప్రశ్నించింది...

'కొండ దిగాలి...' దీనాతి దీనంగా ముఖం పెట్టాడు వేణు...

ఫోటోగ్రఫీ ఒక హాబీ ... అందులోనూ ఖరీదయిన హాబీ ... కడుపులో ఆకలి దహించుకు పోతుంటే, ఎదుట పంచ భక్ష్య పరమాన్నాలూ పెట్టి చేతులు కట్టేసినట్లుంది వేణుకు...

'దిగి?...'

'ఏముంది?... సింహాచలం వూళ్ళో ఎవరన్నా కంసాలి వుంటే చాలు...బాగు చేయించుకుని, మళ్ళీ పైకి రావాలి...'

'పోనీ మరోసారి రాకూడదా?...'

'ఇప్పటికి ఆరు నెలల నుంచీ అనుకుంటుంటే, యిప్పటి కిలా అయింది ... మళ్ళీ రావాలంటే, యిప్పట్లో వీలుపడుతుందో పడదో ... పోనీ మీరిక్కడ కూర్చుని వుండండి ... నేను పరుగున వెళ్ళి బాగు చేయించుకు వస్తాను...'

'అమ్మయ్యో! ... ఒక్కతినా?... వద్దులెండి నేనూ వస్తాను మీతో ... ఇద్దరం వెళ్దాం...'

'అబ్బే వద్దండీ...ఇప్పటికే పువ్వులాంటి మీ మొఖం వడలిపోయింది...పోనీ భయమంటే అదో అక్కడ కారు ఆపి ఒరియా వాళ్ళెవరో కూర్చుని వున్నారు...వాళ్ళదగ్గర దింపుతాను పదండి...'

'అదేం ఒప్పుకోను ... నేనూ మీతో వస్తాను పదండి ... అయితే ఓ షరతు ... మీరు తీసినవి, తియ్యబోయ్యేవీ అన్నీ ఫోటోలు నాకో కాపీ యివ్వాలి...'

'ఓష్!... అంతేగదా...అన్నీ మీరే తీసుకోండి ..ఫర్వాలేదు...'

'వేణూ!... మీకు అలుపొస్తోందా? ...'

'అలుపా !...చక్కని కన్నెసమీపమున ... అని అదేదో పాటపాడినట్లు...నాకు హాయిగా వుంటే...ఇంకా మీరే రొప్పుతున్నారు...'

ఆ మాటలకు ఉష సిగ్గుపడింది ... అయినా ఏదో తృప్తి కలిగింది.

'నాకు మాత్రం రొప్పెందుకు వస్తుంది ... ఇట్టిగా మాట్లాడే చక్కని యువకుడు ప్రక్కన నడుస్తుంటే? ...' చాలా చిన్నగా అంది ఉష...

వేణు వులిక్కిపడి చూశాడు ఉష కళ్ళల్లోకి ... ఉష అతడి కళ్ళల్లోకి చూచింది నవ్వుతూ. హృదయం తెలియని ఆనందంతో నిండిపోయింది . ఆ ఆనందాన్ని మాటల్లో వివరించ లేక వేణు పక్కనే మౌనంగా నడుస్తోంది... వేణు కూడా యిలాగే ఆలోచిస్తున్నాడా?.. అనుకుంది ఉష...

ఇంతా వెళితే అక్కడ కంసాలి దొరుకుతాడో దొరకడో అనుకుంటూ నిశ్శబ్దంగా నడుస్తున్నాడు వేణు...

(ఇంకా వుంది)




"కాఫీ తీసుకోండి" కాఫీ కప్పు బల్ల మీదపెట్టి చెప్పింది లలిత.

రామారావేదో సీరియస్‌గా ఉత్తరం చదువుతుండటం చూసి, 'ఎక్కడ్నించిట?' అనడిగింది.

విసురుగా తలత్రిప్పి 'నీకే' అంటూ ఆమె మీదకు విసిరేసాడు.

"నాకా?" ఆశ్చర్యంగా చూసింది. ఆ వుత్తరం రుక్మిణిదగ్గర్నుంచి వచ్చింది.

'చింపి చదివేసారా?" కోపం, రోషం మిళితమైన కంఠంతో అరిచింది.

వెటకారంగా నవ్వేడు రామారావు 'అవును. భార్యాభర్తల మధ్య రహస్యాలేం ఉంటాయి? భార్య ఉత్తరం భర్త చదవకూడదా?"

'అయితే మాత్రం? ఒకరి ఉత్తరాలు యింకోళ్ళుచదవడం మానర్స్‌కాదని తెలీదా? నన్నడగకుండా యెందుకలా చింపి చదవడం?' అవమానంతో రాబోతున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అంది.

'ఇప్పుడేం పోయింది? నీ రహస్యాలన్నీ తెలిసిపోయాయనేగా ఆ యేడుపు? అయితే యింకా వాడ్ని మరిచిపోలేదన్నమాట. స్కూల్ యెడ్రస్‌కు రప్పించుకునేదానివి కాబోలు నాకు తెలియకూడదని. సెలవురోజులు. పాపం, యింటికి రావడం, అందులో నాచేతిలో పడటం—'అంతా నీ దురదృష్టం'.

"పోనీ లెండి ఒకరి అదృష్ట దురదృష్టాలకు యింకోళ్ళు బాధ్యులుకారు. అసలెందుకు మరచిపోవాలి? మామధ్య మీ రూహించుకునేంత నీచ సంబంధ మేమీలేదు. మాది నిష్కల్మషమైన స్నేహం. మీలాంటి వారెన్నటికీ అర్థం చేసుకోలేరు దీన్ని' విసురుగా వంటింట్లోకి వచ్చేసింది.

'అవును. అంత విశాలహృదయం నాకు లేదు మరి. ఇంత కుచ్ఛితుడైన మొగుడు దొరకటం నీ ఖర్మ! నువ్వు మొదట్నించి అంటున్న మాట అదేగా! ఇంకిప్పుడు చింతించి లాభంలేదు. అసలు నీకర్మకాదు వాది. అన్నీ తెలిసుండి నిన్ను చేసుకోవడం' రామారావు మాటలు ఈటెల్లా తగులుతున్నాయి.

'ఛీఛీ, పాడు సంసారం' జోళ్ళువేసుకొని బయటకు వెళ్ళిపోయాడు కాఫీయైనా త్రాగకుండా.

లలితచేతిలో ఉత్తరం వంక చూసింది. అసలు దీనికోసం తను రోజూ యెదురు చూస్తోంది. పోస్టుమెన్ వచ్చే సమయానికి వీధిలోనే నుల్చుంటోంది యిది రామారావు చేతిలో పడకుండా ఉండాలని. ఇప్పుడింత రభస జరిగినతర్వాత చదవబుద్ధే కావట్లేదు. ఒక ఐదు నిముషాలు నిశ్శబ్దంగా ఉండిపోయింది విపరీతంగా కలవరపడిపోయిన యెద యధాస్థితికి వచ్చేవరకూ. తరువాత విప్పి చదివింది ఉత్తరాన్ని.

'రాధాకృష్ణను సెలవుల్లో యింక లెటర్సు వ్రాయవద్దన్నావుట. ఎందుకో అర్థంకావ టేందు, ఏం పొరపాటు చేసానో తెలిస్తేనైనా బాగుండు నంటూ బాధపడుతూ ఉత్తరం రాసాడు లలితా! ఏం చెప్పను? చెప్పి అతన్నెలా కష్టపెట్టగలం? ?అతనిది సరళ హృదయంకదా అని, అందరూ అతనిలాగే ఉంటారనుకుంటాడు. మన స్నేహంగురించి యెవరూ సరీగా అర్థం చేసుకోలేరేమో? మన హృదయాలకే తెలియాలి. పురుషులకూ, స్త్రీలకూ మధ్య యేవిధమైన స్వార్థమూలేని పవిత్ర స్నేహబంధం ఉందంటె అర్థం చేసుకోలేదు ఈ సంఘం. నీ బాధ నేనర్థం చేసుకోగలను.

అన్నట్లు అతనికి పెళ్ళి కుదిరిందిట బహుశా యీ నెలలోనే జరిగిపోవచ్చుకూడా ఆవిషయం యెంతో ఆనందంగా నీకు రాద్దామనుకున్నాట్ట. పోనీ ఉత్తరాలు మానేసినా పెళ్ళికైనా వస్తావో, రావోనని దిగులు పడుతున్నాడు. ఇప్పటికి రేవతి వస్తుందని నమ్మకంలేదు ఇంక ఉన్నవాళ్లు మీయిద్దరు అంటున్నాడు. అతనికేం జవాబు రాయమంటావో నీ యిష్టం

ఇదీ రుక్మిణి వుత్తరంలో సారాంశం లలిత కాసేపు తనబాధ మర్చిపోయింది రాధాకృష్ణ కు వివాహం అనేసరికి ఆనందంలో మునిగిపోయింది. అప్పుడు తను బియ్యేచదివే రోజుల్లో తాము నలుగురూ—రుక్మిణీ, తన రేవతి, రాధాకృష్ణ—యేమీభేదం లేదన్నట్లు యెంతో కలిసిమెలిసి ఉండేవారు. రుక్మిణీ రేవతి? తనూ, చెల్లాయి లీల ఒకేయింట్లో వుండేవారు చుట్టుప్రక్కల ఊళ్ళనుంచి వచ్చి అక్కడ ఆడపిల్లలకు హాస్టలులే కారణాన ఎవరో రుక్మిణి దూరపు బంధవౌకావిడ నలుగురికీ వండిపెట్టేది. రాధాకృష్ణ యెంతో స్వేచ్ఛగా వచ్చేవాడు ఆయింటికి.

ఎప్పుడైనా అతను స్వగ్రామం వెళ్ళి వస్తే ముగ్గురూకలిసి యేడిపించేవారతన్ని. 'ఇంటర్వ్యూకి వెళ్ళివచ్చారా? అమ్మాయి యెలాగుంది? మా ముగ్గురికీ చూపించకుండా చేసేసుకుందామంటే వీలుపడదు' అంటూ.

అని జ్ఞాపకమొచ్చి లలిత పెదవులపై చిన్న దరహాసం వెలిసింది.

ఇప్పుడతను నిజంగానే పెళ్ళిచేసుకుంటున్నాడు. కనీసం పెళ్ళికి వెళ్ళగలిగే స్థితిలో కూడా లేదు తను. ఆపేరువింటే మండిపడతాడు రామారావు అతనికి మొదట్నించీ రాధాకృష్ణంటే యిష్టం లేదు. అందుకు కారణం...లలిత మనస్సుకు ఆ సంఘటనలు జ్ఞాపకమొచ్చాయి.

రామారావు లలితకు మేనత్తకొడుకు. లలిత ఫైనలియర్ చదువుతూండగా, రామారావుకి ఆ వూరికి దగ్గర్లోనున్న పల్లెటూర్లో వుద్యోగం వచ్చింది. అప్పుడప్పుడూ మరదళ్లని చూడటానికి సైకిలుమీద వచ్చేవాడు. అతనికి తను మొగపిల్లలతో మాట్లాడ్డం పెద్దయిష్టం లేదు అవిషయం అతని ప్రవర్తనతో అణువణువునా కన్పించేది.

ఆరోజు రామారావు వచ్చేడు. లలితా, లీలా గదిలో కూర్చుని అతనితో మాట్లాడుతున్నారు. బావతో మాట్లాడుతున్నా మనస్సు మనసులో లేదు తనకు. ఆ రోజు రాధాకృష్ణను యింటికి రమ్మని చెప్పేరు కాలేజీలో. ఇప్పటిదాకా అతను రాలేదు. పైగా రుక్మిణీ, రేవతీ యెక్కడికో వెళ్లడానికి తయారవుతున్నారు. బావ ఉండగా రాధాకృష్ణ వస్తాడేమోనని భయం భయంగా వుంది లలితకు.

ఆమె భయపడ్డంతా జరిగింది రాధాకృష్ణ రానేవచ్చాడు అడుగుల చప్పుడు వినగానే బయటకు వచ్చింది లలిత

'హలో లలితా' చిఱునవ్వుతో పలకరించాడు తను లలిత యేదో చెప్పేలోగానే, రేవతీ, రుక్మిణీ బయటకువచ్చి, 'రండి' అని యింకోగదితోకి తీసుకెళ్ళారు.

"ఎవరతను? చనువుగా యింటికి కూడా వచ్చాడు" భ్రుకుటి ముడుచుకుని రామారావు అడిగేడు.

'మాక్లాస్‌మేటు. వాళ్ళకోసమని వచ్చారులాగుంది' ఇక్కడి విషయాలన్నీ యింటి దగ్గర చేరవేస్తాడీ మహానుభావుడు. నాన్నగారు మరీ ఛాందసులు

'ఉహు' బావ యింకేమీ అనకపోయినా లలితకు తెలుసు అతనామాటలు నమ్మలేదని. రేవతి, రుక్మిణి యేదో దెబ్బలాడుతున్నారు రాధాకృష్ణమీద. చిద్విలాసంగా వింటున్నట్లున్నాడు

'లలితా' కేకపెట్టింది రుక్మిణి. గతుక్కుమంది లలిత.

'పిలుస్తున్నారు ఒక్కసారి వెళ్తాను' అనేసి జవాబుకోసం చూడకుండా వచ్చేసింది. ఎంత నెమ్మదిగా మాట్లాడినా అవతల గదిలోకి వినిపిస్తాయి.

'మీకోసమే వెయిట్ చేస్తున్నాం రండి రండి' రాధాకృష్ణ పిలిచాడు

నవ్వలేక నవ్వింది లలిత "త్వరగా తెమల్చాలి. మాకు టైమైపోతోంది" రేవతి తొందరచేస్తూ అంది.

'మీకు టైమైపోతే మీరు వెళ్ళిపొండి. లలిత ఉంటారుగా. మీరు చెప్పండి లలితా' చాలా స్వచ్ఛంగా అన్నాడతను.

'అచ్ఛా, అలాగైతే మేము పోతున్నాం బైబై' యిద్దరూ వెళ్ళిపోయారు తననూ, కృష్ణనూ అక్కడ వదిలేసి.

'నేనిప్పుడేం దెబ్బలాడలేను దయచేసి యివాళ్టికి వెళ్ళిపొండి' 'నెమ్మదిగా అంది.

'అదేం? మీరేకదా రమ్మని పిలిచేరు?' ఆశ్చర్యంగా అంటున్నాడతను.

'అవును కానే వెళ్ళిపొమంటున్నా గూడా' మనస్సు బిగపట్టుకుని చెప్పింది వింతగా చూసాడు. ఒక్కసారిగాలేచి, 'ఆల్‌రైట్, నేను పోతున్నా. రమ్మనిపిలిచి మంచి మర్యాద చేసారు' వెళ్ళిపోయాడు. చివరిమాటలుతో దెబ్బతిన్న దానిలాచూసింది అతను మనసు కష్టపెట్టుకు వెళ్ళాడని తెలిసింది. బరువుగా నిట్టూర్చి యివతలగదిలోకి వచ్చింది. లీల ఒక్కత్తే కూర్చుని చదువుకుంటోంది. 'లీలా! బావేడీ?'

'అతనువచ్చినా వదిలేసి, యింకొకళ్ళతో మాట్లాడుతూ కూర్చున్నావుట చక్కటి మర్యాద అని వెళ్ళిపోయాడిప్పుడే' లీల చెప్పింది విని తెల్లబోయింది

ఇద్దరి మనసులూ బాధపెట్టింది రెండవ వారికోసమని. కానీ రెండు ఫలితాలు దక్కలేదు.

ఇంకోరోజు.. పరీక్షలు దగ్గర కొచ్చేస్తున్నాయి. శ్రద్ధంగా చదువుతున్నారందరూ. అప్పుడే రాధాకృష్ణ వచ్చాడని విశ్రాంతిగా అందరూ నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు. నవ్వుల మధ్యమండి సైకిలు బెల్లువిని ఉలిక్కిపడింది. లలిత మెల్లగా 'మాబావ' అంది రుక్మిణి చెవిలో.

'పోనిద్దూ లీల మాట్లాడుతుందిగా, కూర్చో' రుక్మిణి వెళ్ళనివ్వలేదు.

రాధాకృష్ణ నవ్విస్తూంటే, బావమాటే

కుర్చిపోయి తనూ నవ్వేసింది మిగతా వారితో పాటు, ఏం జరిగినాసరే అనే ధైర్యం చిక్కబెట్టుకుంది.

కొంచెం సేపటికే రాధాకృష్ణ వెళ్ళిపోయాడు చదువుకోవాలంటూ.

లలిత యీగదిలోకి వచ్చింది. రామారావు తలెత్తి చూసాడు.

'ఓహో, ఇప్పటికి ఖాళీ అయిందన్నమాట యింటికొచ్చినవాళ్లను పలకరించడానికి' ఆ ఆక్షేపణ కేమీ సమాధానం చెప్పకుండా మౌనంగా ఊర్కొంది లలిత.

'చదువు యెలా గుందిట? సినిమాలూ, షికార్లూ ఎక్కువయినాయటగా' వ్యంగ్యంగా మాట్లాడుతా డతడు మనస్సులో చాలా అసహ్యించుకుంది ఏమిటి, తనమీద అంత అధికారమున్నట్లు మాట్లాడుతాడు? ఏదో గౌరవ మిస్తోందనా? బలవంతంమీద నిగ్రహించుకుంది ఆవేశాన్ని ఆ రోజు.

బావతో పెండ్లి నిశ్చయం చేస్తున్నామని చెప్పినపుడు యెన్నివిధాలో ప్రయత్నించింది తప్పించుకోవడానికి. ఏమాత్రం యిష్టంలేని అతనితో తనేం సుఖపడుతుంది? కాని హిందూ కుటుంబాల్లో ఆడపిల్ల మాటకూ, మనసుకూ నిలువలేదు. అందువలనే ఓటమి అంగీకరించి తలవంచి మంగళసూత్రం కట్టించుకోవాల్సివచ్చింది

పాత అభిప్రాయాలు తోసేసి, రామారావును భర్తగా ప్రేమించి అతన్ననుసరించడానికే ప్రయత్నిస్తోంది కాని యెంత అణచుకుందామనుకున్నా కొన్ని స్వతంత్రభావాలు

# స్నేహవలయం

వదులుకోలేకపోయింది మనసు. స్కూల్లో టీచరుగా పనిచేస్తూ, అంతమంద పిల్లలని అదుపులో పెట్టగలిగే లలిత భర్త మాటకు యెదురుచెప్పక, తల ఒగ్గుతుంది.

పెండ్లయి ఎనిమిది నెలలయినా తన స్నేహితులతో సంబంధబాంధవ్యాలు తెంచుకోవడం యిష్టంలేకపోయింది.

తన వివాహంనాడు శివపార్వతుల దంతపు విగ్రహాన్ని బహూకరించి, అభినందిస్తున్న రాధాకృష్ణను భర్త అప్రసన్నంగా చూడటం గమనించకపోలేదు లలిత. అందుకే అతనికి తెలియనివ్వలేదు యిలా ఉత్తరాలు రాసుకుంటున్నారని.

వేసంగి సెలవులు రావడంతోనే రాధాకృష్ణకు ఉత్తరాలు యింక రాయవద్దని విజ్ఞప్తి చేసింది. రుక్మిణికి యింటి యడ్రస్ యిచ్చింది.

ఎప్పుడో ముందు జీవితంలో జరుగబోయే వివాహాన్ని, భర్తనూ దృష్టిలో పెట్టుకుని ముందర్నించీ మనసుకు వచ్చిన యెవ్వరితోనూ పరిచయం పెంపొందించుకోకూడదంటే నచ్చదు తనకు. అయినా నిలువకట్టలేని ఆ అభిమానాన్ని యెందుకు దూరం తోసుకోవాలి? కూడని పాపమేమీ చేయట్లేదుకదా.

ఇన్ని ఆలోచనలున్నా, ఆడదికాబట్టి బలవంతంగా బంధం తెంచుకుంది.

జీవితంలో తిరిగిరాని ఆనందాన్ని అందిచ్చిన ఆ స్నేహపరిణతం యిలా ఉంటుందని తాము కలలోకూడా అనుకోలేదు. నవ్వుతూ తుళ్లుతూ గడిపేసిన ఆ జీవితంలో యిలాంటి సంకుచిత ఊహలు తట్టనేలేదు.

లలిత నిట్టూర్చింది. ఇక యింతే. తనను ప్రేమించే స్నేహితులకు దూరంగానే తన జీవితం గడపాలి. అప్పుడంత మధుర మనిపించిన స్నేహం యిప్పుడింత అశాంతిని రేపుతోంది. ఏమీచేయలేక నిస్సహాయంగా యేడుస్తూ ఉండిపోయింది లలిత.

* * *

తన యెదురుగాఉన్న పెండ్లి ఆహ్వానాన్ని పదేపదే చూసుకుంటోంది రేవతి. రాధాకృష్ణకు పెండ్లి మాపులు అక్షరాలను చదువుతున్నా, మనస్సు గతంలోకి జారిపోతోంది. అబ్బ, యెంతచక్కటి జీవితాన్ని గడిపారు ఆ చదువుకునే కాలంలో. ఒకళ్లనొకళ్ల సమానంగా ప్రేమించుకున్నారు.

గడిపిన ప్రతిక్షణమూ తమ స్నేహలతకొక నూతన చిగురును ప్రసాదించింది. పరీక్ష లయిపోయి, యెవరికివారు విడిపోయే రోజు యెంత భయకరమయింది? కళ్లెత్తి యింకొకళ్లను చూడ్డానికి భయంవేసింది నీళ్లపొరలు అడ్డొస్తాయేమోనని. గంటలకు గంటలు కబుర్లు చెప్పుకునే తామంతా ఒక్కమాట కూడా మాట్లాడుకోలేదు గొంతులో జీర తెలుస్తుందేమోనని. కాని, ఆ రోజు నిర్దయగా రానేవచ్చింది. నలుగురూ నాలుగు వైపులకు భారమైన హృదయాలతో చీలిపోయారు.

ఇంటికివచ్చిన నాలుగురోజులదాకా మనిషి కాలేకపోయింది. రోజూ మనస్సులో ఆవేదన వెళ్లగక్కుకుంటూ మిగతా ముగ్గురికీ ఉత్తరాలు రాసేది. కొంతకాలం ఉత్తరాలతో కడుపు నింపుకున్నారు.

అప్పుడు అనుకోకుండా హఠాత్తుగా తన పెళ్లి నిశ్చయం చేసేశారు. రాధాకృష్ణ ఎమ్. ఏ లో జాయినవడంమూలాన. లలిత బి యిడీలో అప్పుడే చేరవలసిరావడం మూలాన. రుక్మిణి చాలాజ్వరంలో ఉండటం వలన యెవ్వరూ రాలేదు పెళ్లికి.

ఆ క్షణంలోనే విరక్తి పెంచుకుంది తను. ఈ స్నేహబంధాన్ని గుప్తంగా మనస్సులో దాచేసుకుంది. తన భర్త యీ మనుతల్ని సరిగా అర్థం చేసుకోవచ్చు. లేక అపోహపడవచ్చు. గడిపినంతవరకూ యెంతో



# కుసుమ-కోమలం





కుసుమం వంటి కోమలం, పూబంతి వంటి సౌందర్యం. హిమాలయా బుకే స్నో వల్ల మీ చర్మ సౌందర్యం అంత మనోహరం. దాని మృదులత మీ చర్మాన్ని మునుపటికంటె అతి కోమలంగా వుంచుతుంది... పట్టు వంటి కోమలం, సౌరభము ఎంతో చక్కగా అంటి యుంచుతుంది కూడా. ఆ పరిమళమే మోహనం. కోమలం, సౌమ్యం, దివ్యం- కుసుమం వంటి కోమలం పూబంతి వంటి సౌందర్యం.....




...అట్టి మనోహరమైన చర్మసౌందర్యం కోసం

## హిమాలయా బుకే స్నో

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి శ్రేష్ఠమైన ఉత్పత్తి.

అపూర్వమైన స్నేహాన్ని చవిచూపింది. అంతే చాలు. ఇంకేవిూ కోరదు. ఇక తమ దాంపత్య జీవితం సాఫీగా నడచుకునేట్లు చూసుకుంటే చాలనుకొని సంతృప్తిపడింది. తన పెళ్లయిన తరువాత మిగతా ముగ్గురిలో యేవొకరికీ ఉత్తరాలు రాయలేదు. ప్రశాంతంగానే ఉంటోంది మనసు. కానీ వారం రోజుల క్రితం.. రేవతి బాధగా కళ్లు మూసుకుంది.

తను రాధాకృష్ణ నేడ్పించటం గుర్తొచ్చింది.

'తర్వాత జీవితంలో యెప్పుడైనా కన్పడితే మీలో యెవ్వరైనా పలకరిస్తారా? పోనీ పలకరింపుగా చిఱునవ్వైనా నవ్వుతారా?' అన్నా డొకరోజు. అవును. అతను మగవాడు తాము స్త్రీలు. ఇద్దరి మధ్యా సంఘం యెన్ని కట్టుబాట్లు పెట్టింది? అప్పుడు తను అంది.

'నేను చెప్తావాగు కృష్ణా! నువ్వు నీమిసెస్‌తో కలిసి అలా వెడుతూ వుంటావు అప్పుడు లలితా, మొగుడూ కూడా కన్పడ్డారనుకో లలితేమో నిన్నుచూసి నవ్వుతుంది అప్పుడు నీకు భయం శ్రీమతి యెక్కడ అనుమానపడుతుందేమోనని. ఎరగనట్లు వెళ్లిపోతావు. లలిత మటుకు తన భర్త పక్కనున్నారు, యేదైనా అనుకుంటాడని తలవదు. నువ్వెళ్ళిపోయావనే బాధ పడుతుంది' అందీ ఉడికిస్తూ.

'చూద్దాంగా' అన్నాడతను సవాలుచేస్తూ.

# స్నేహావలయం

ఆరోజు యేనోటితో అందో వారం రోజుల క్రింతం అదే సంఘటన నిజంగా జరిగింది.

అత్తవారింటికి బందరు వెళ్ళారు తనూ రాఘవరావూ.

బజారునుంచి రిక్షాలో వస్తూంటే, హఠాత్తుగా రాధాకృష్ణ నడుస్తూ యెదురు పడ్డాడు. రిక్షాలో తమనుచూసి, కళ్ళు పెద్దవి చేసుకుని తరువాత ఆనందంగా నవ్వేడు. విచ్చుకోబోయిన తన పెదవులు తక్షణం ముడుచుకున్నాయి. ఎన్నాళ్ళయింది కృష్ణనుచూసి పలకరించాలనీ, మనసారా మాట్లాడుకోవాలనీ మనస్సెంత గోల పెడ్తున్నా, తన ప్రక్కనున్న రాఘవరావుని గుర్తుకు తెచ్చుకుని నిశ్శబ్దంగా ఆకోరికను చంపేసుకుంది. అవును అదే క్షేమం ఇద్దరికి కూడా. కానీ కృష్ణ బాధపడుతాడని తనకు తెలుసు. తెలిసీ యేం చెయ్యగలదు? అశక్తురాలు. మారిపోయింది. పూర్వం మాటలన్నీ మర్చిపోయింది అనుకుంటాడు. అనుకోనీ, అదే మంచిది ఈ మమకారాలకూ ఆప్యాయతకూ యెంతదూరంగా వుంటే అంత మంచిది.

మూసుకున్న కనురెప్పలనుండి టప్‌టప్‌మని బిందువులు రాలిపడ్డాయి. ఉలిక్కిపడి కళ్ళు తుడుచుకుంది.

'ఏవరిదేమిటి పెళ్ళి? ఇందాకనించీ తదేకంగా ఆహ్వానాన్ని చూస్తున్నావు?'

రాఘవరావు నవ్వుతూ అడిగేడు ఆమె వెనకవైపున ఉన్నాడతను.

పద్దుకుంది రేవతి 'బియ్యేలో మాక్లాస్‌మేటు' అంది ముక్తసరిగా.

'జ్ఞాపకం వుంచుకుని పంపించాడే?' మెచ్చుకోలుగా అన్నాడు.

నిర్లిప్తంగా నవ్వుకుంది. చెరుపుకుంటే పోయే జ్ఞాపకాలా అవి? ఇప్పుడింత మెచ్చుకుంటున్న భర్తే తమమధ్య యెంతో పెరిగిపోయిన స్నేహబంధం ఉందం టేగనిరసిస్తాడు. అనుమానిస్తాడు. అవమానిస్తాడు.

'వేడతావేమిటి?' వేళాకోళం ధ్వనించిందా కంఠంలో.

'గ్రీటింగ్సు పంపిస్తాను' చెదిరిపోయిన మనస్సు ఒంటరితనం కోరుకోవడంతో లోపలకు వెళ్ళిపోయింది రేవతి.

* * *

తండ్రి దగ్గిర కూర్చుని భాగవతం చదివి వినిపిస్తోంది రుక్మిణి,

'పోస్ట్' బయటనుంచి కేక వినబడింది.

'వెళ్ళి పుచ్చుకోఅమ్మా' తండ్రి చెప్పాడు. లేచివెళ్ళింది. తనకే ఒక కవరు. 'ఎక్కడనుంచి?' తండ్రి అడిగితే.

'నాకు నాన్నా! మా ఫ్రెండ్ దగ్గిర్నించి' అంది. ఇంక ఆయనేవిూ ప్రశ్నించలేదు. భాగవతం చదవడం పూర్తిచేసి, గదిలోకి వెళ్ళి తీరిగ్గా విప్పింది కవరు.



రాధా కృష్ణదగ్గర్నించి వచ్చింది. పెండ్లి అయిన తరువాత మళ్ళారాయలేదు. రెండు నెలలవుతోంది. పెళ్ళికి వెళ్ళలేదని కోపం కాబోలు.

మొదట తమ ముగ్గురిలో యెవ్వరూ పెండ్లికిరాలేదని బాధ వ్యక్తపరిచాడు.

'మన స్నేహం చాలా పవిత్రమయిందనీ, యెంతో గొప్పదనీ మురిసిపోయాం రుక్మిణీ, కాని యేమయింది? నెమ్మది నెమ్మదిగా యీ వలయంలోంచి ఒక్కొక్కళ్ళూ తప్పుకున్నారు. అప్పుడు లలిత ఉత్తరాలు రాయ వద్దందని యెంతో ఖేదపడ్డాను. క్షణ క్షణంబుల్ జవరాండ్ర చిత్తముల్ అనుకున్నా, అప్పుడెందుకు అనవసరంగా యింత మమతలు పెంచుకోవాలి? ఇప్పుడెందుకు బాధ అనుభవించాలి? అని తిట్టుకున్నాను. కానీ, యీనాడు అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. రేవతి మనస్సు, లలిత మాటలు అన్నీ యిప్పుడర్థం అవుతున్నాయి స్పష్టంగా అవన్నీ ఊహల్లోకాని, నిత్యజీవితంలో మనం అనుకున్నట్లు జరగదనీ, మన చుట్టుపక్కల ప్రభావాలనీ, పరిసరాలనీ, మనుష్యులని బట్టి మన నడవడిక మార్చుకోవాలనీ బాగా బోధపడింది.

నువ్వు బాధపడతావనీ, నీ మనసు గాయపడుతుందనీ తెలుసు. కానీ ఒకమాట చెప్పకుండా ఉండలేకపోతున్నాను రుక్మిణీ! ఏం వినడానికైనా సిద్ధంగా ఉండు. ఒక కథ లాంటి నిజం.

రెండేళ్ళ క్రితం, మన పరీక్షలయిపోయి వీరారు ఊరు వెళ్ళిపోతున్న రోజు నిన్నూ, రేవతినీ ట్రైను యెక్కించాను స్టేషనులో. మీ రెక్కిన కంపార్టుమెంటులోనే ఆరోజు ఒక అమ్మాయి యెక్కిందిట. మిమ్మల్ని పలకరించిందిట. మీ మాటలన్నీ శ్రద్ధగా వింటిట. జ్ఞాపకముందా?'

రుక్మిణికి జ్ఞాపకమొచ్చింది. అవును. తనూ, రేవతి రాబోతున్న యేడుపు నాపుకుంటూ నీళ్ళునిండిన కళ్ళతో కృష్ణని చూస్తూ ఉండిపోయారు.

గార్డు యీలవేయడంతో రైలు నిర్దాక్షిణ్యంగా కృష్ణను వెనక్కు నెట్టేస్తూ, భయంకరంగా కూతపెట్టి బయలుదేరింది.

తనూ, రేవతి చాలాసేపు మాట్లాడుకోలేకపోయారు.

[illegible]

లంతి, 'మధురమైన కలకరిగిపోయింది.'

అంతవరకూ యెదురుగా కూర్చుని కుతూహలంగా తమవంకే కూర్చుంది ఒక అమ్మాయి. పదహారేళ్ళుంటాయేమో.

తమ వంక చూస్తూ 'చదువుకుంటున్నారా ?' అంది.

'అవును. ఎక్కడినుంచో వచ్చాం. ఇక్కడ కలుసుకుని చదువుకున్నాం. విడిపోతున్నాం.'

'అతనెవరు? మీ క్లాస్ మేటా?'

రేవతీ, తనూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

ఇద్దరూ ఒకేసారి 'అవును' అన్నాము.

'బాగా స్నేహం కాబోలు. అంత మొగవాడూ ఆడదానిలా యేడుస్తున్నాడు.'

తను, రాబోతున్న కన్నీరాపుకుందుకు కిటికీలోంచి చూస్తూ కూర్చుంది.

'ఎందుకో తనకీ వివరాలన్నీ? పైగా

# స్నేహావలయం

యెంత వ్యంగ్యంగా అడుగుతోందో చూడు' రేవతి తన చెవులదగ్గిర గుసగుసలాడింది.

కాస్సేపట్లో యిద్దరూ ఆ అమ్మాయిని మర్చిపోయి జరిగినవన్నీ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. ఇప్పుడింతకూ ఆ అమ్మాయి సంగతెందుకో?

మళ్ళీ ఉత్తరం చదవసాగింది.

'ఆ సంగతి యిప్పుడెందుకు అనుకుంటున్నావా? చాలా ముఖ్యమైనది. ఆ అమ్మాయే చి॥ సౌ॥ విజయ అంటే శ్రీమతి విజయాకృష్ణ అన్నమాట ఆశ్చర్యపోతున్నావా? ముందు జీవితంలో యిలాగవుతుందని ఆనాడు మీకేం తెలుసు? మీరు ఆవిడని మర్చిపోయినా, తను మీ మాటలు మరచిపోలేదు. నిండుజీవితం నాతో గడపటానికి సిద్ధమై వచ్చిన తనకు నామీద యేమాత్రమూ నమ్మకంలేదు. నేను అపర గోపాలకృష్ణుడినని తన ఉద్దేశం. మీరు పంపిన శుభాకాంక్షలు చూస్తే తనకు హేళన. ఇంక యెన్నని రాయను రుక్మిణీ! మనస్సు బాగోలేక యింతకాలమూ లేఖ రాయలేకపోయాను. పిచ్చెక్కినట్లుంటోంది. నేనుచేసే ప్రతిపనీ విజయకు అనుమానమే. ఏదైనా ఉత్తరం వచ్చిందంటే...పోనీలే, అవన్నీ చెప్పి యింకా నీ మనస్సెందుకు పాడుచేయడం? ఇలాంటి పరిస్థితులలో యేం చెయ్యాలో, నా జీవితంలోకి శాంతిని యెలా తెచ్చుకోవాలో తెలియట్లేదు రుక్మిణీ...'

రుక్మిణి నిట్టూర్చింది. అయింది దీనికి ఒక్కటే మార్గం. తనకూ, కృష్ణకూ కూడా యేవిధమైన సంబంధం ఉండకుండా ఉండటమే ఉత్తమం. నెమ్మదిగా సర్దుకుంటుంది విజయ. అప్పుడే వాళ్ల కాపురం బాగుపడుతుంది.

లోకంలో యెంతమంది స్నేహితులుండట్లేదు? తమకే యెందుకిలా జరగాలి? ఏ దేవతైనా యీ అభిమానికి అసూయ చెంది శాపం యివ్వలేదుకదా! జీవితం అంతా విలసిల్లుతూ ఉండాలని కోరుకున్న తమ స్నేహావలయం యిలా బేధింపబడి ముక్కలు ముక్కలుగా అయింది.

అందరకూ చెప్పరానిబాధే మిగిలింది.

జీవితంలో యింక మమతలు పెంచుకోకూడదు. అదే దీనికి మార్గం ఈ జీవితం అనుభవించాలు తనకు.

తమను వేరుచేసిన దుష్టశక్తి యెంత బలవత్తరమయింది ? దానిముందు అందరూ అశక్తులే అనుకుంది రుక్మిణి చివరకు.

మానసికానందానికి బదులుతీరని అశాంతి మిగిలిందని నిట్టూర్చింది. ఒక్కరుక్మిణే మాత్రమేకాదు. ఆస్నేహావలయంలో చిక్కుకున్న వారందరును మధురమయిన స్నేహం చివరికి మిగిల్చిందేమిటో?

స్నేహ వలయంలో బంధింపబడాలని అందరూ కోరుకుంటారుకానీ ఆ ఆకర్షణలో పడినతరువాత విధి పరిహసిస్తే యెవరేమవుతారో ముందుగా తెలుపటుగా ఆ విధి?

●

**ఒకవారం విపరీతం**

# విద్యార్థి ఎన్నికలలో రణరంగంగా మారిన కళాశాల

హైదరాబాదులో సైఫాబాద్ సైన్సు కాలేజీలో విద్యార్థుల యూనియన్ ఎన్నికలు మోతాదు మించడంవల్ల కళాశాల చిన్నసైజు రణరంగంగా మారిందని, ఆ కళాశాల ప్రొఫెసర్ గారు మరో పెద్దమనిషితో జోలు మహాప్టే మించిదన్నారుట. కాలేజంతా కరపత్రాలతో మునిగి పోయిందంటే అతిశయోక్తి ఏమాత్రంలేదని చూసినవారు అభిప్రాయపడ్డారు— వుండుండదు.

## చీమల వ్యాపారం

అమెరికాలో కెన్‌గిడ్ని అనే ఆయన వంద పిడున్నర (మనలెక్క) రూపాయల లెక్కన చీమల్ని అమ్ముకుని, జీవనం చేస్తున్నాడట. ఆయనకు రూపా చీమలు పట్టి, కంపెనీకి అప్పచెప్పడానికి తగినంత సిబ్బందీ కూడా వుందట. అయితే అలా పట్టేటపుడు 'రాణి ఈగ'లను మాత్రం పట్టకూడదట. రాణి ఈగ ఆ జాతి ఈగలకు తల్లి అనీ, ఆ రాణియాగ మగయాగ సంపర్కంతో పదిహేను సంవత్సరాలకాలం గ్రుడ్లు పెడుతుందనీ, అలాటి రాణి యాగను చంపితే ఆ జాతి నశిస్తుందనీ— రాణియాగనుపట్టి ఎగుమతి చేయరాదనే శాసనం కూడా వుందనీ ఆయన అన్నారట.

## దేవుడికే బియ్యంకొరత

కేరళలో తిండి గింజల కరువు దేవుడివరకూ వ్యాపించిందని దేవస్థానాలమంత్రి శ్రీ పి ఆర్ కురుప్ ఆగస్టు 25 న తేదీన కేరళలో ఉపన్యసించారు. గురువాయూర్‌లో శ్రీ కృష్ణుడి దేవస్థానానికి ధాన్యం ఒక్క గింజైనాలేదని, పోయిన సంవత్సరం సహాయం చేసిన మద్రాసు ప్రభుత్వం యింతవరకూ ఏంచెప్పలేదనీ ఆయన్నారు.

## వరదలు: అంతర్ధానమైన రైలు

గంగా, యమున, గాగ్రా, గండక్ అనే నాలుగ నదులూ కలిసి గుట్టుగా దేశంలో కొంతభాగాన్ని సర్వనాశనం చేశాయి. యింకా చేస్తూనే వున్నాయి. ఒక్క యమునా నదే 556 ఊళ్ళను ముంచేసిందట. యమునానది శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి సమాధిని, చుట్టుపక్కలను కూడా ముంచేసిందట!

ఇండియాలోనే కాదివి— టోక్యో (జపాన్) లో వరదలవల్ల 32 మంది చనిపోయారు. మాట పత్తాలుగుమంది కొట్టుకుపోయారు ఈ కొట్టుకు పోయినవారి సంఖ్య చనిపోయినవారి సంఖ్యకు చేర్చచ్చునని అభిప్రాయపడ్డారుట అదే టోక్యోలో 'కటావి' అనే స్టేషనులో బయలుదేరిన ఒక రైలు అంతర్థానమైపోయిందట మధ్యమార్గంలో వరదల్లోపడి కొట్టుకుపోయిందని హెలికాప్టర్లమీద తిరుగుతూ వెతుకుతున్నారు ఆ రైల్లో అందరూ భావి పౌరులేట (విద్యార్థులు)

## దౌర్జన్యాలూ - దారుణాలూ

మంగళగిరి దగ్గర ఇనవోలు అనే ఊళ్ళో వో యింట్లో కొందరు జొరపడి, యింటాయన్ని చితకతన్ని డబ్బూ, వస్తువులతో పారిపోయారట.

ఒంగోల్లో ఆగస్టు 28న నూనెమిల్లుల్లో తనిఖీ చేయడానికి వెళ్ళిన కమర్షియల్ టాక్సువారిని ఎవరో చితకకొట్టారట. ఎవరు కొట్టిందీ దర్యాప్తుచేసి కనుక్కోడానికి ఆ శాఖ తీర్మానించింది. రాంచీలో అల్లరులు అణచలేక చూసినవాళ్ళను చూసినట్టే కాల్చి చంపమని ఆ శాఖవారి బీహారు ప్రభుత్వం ఆజ్ఞ యిచ్చింది.

## శ్రోతల్లేని మంత్రి:

బొంబాయిలో వోసభకు టయిముకు హాజరయిన సమాచారశాఖమంత్రి శ్రోతలనుచూసి ఆశ్చర్యపోయారట. ఆయన ఆరింటికంటే కచ్చితంగా ఆరింటికే రావడంవల్ల యీ అవాంతరం వచ్చిందని సమావేశకర్తలు అభిప్రాయపడి ఆయన్ని వో అరగంట ఆపి చూశారుట మరో పుంజీడుమంది వచ్చారట "సరేలెండి. ఏం చేస్తాం"అనే పద్ధతిలో ఆపుంజీన శ్రోతలనే వుద్దేశించి, "సెన్సారు విధానాలూ, కష్టసుఖాలు' మీద ఆయన (శ్రీ కె. కె. షా) వుపన్యసించారు.

—ఫాలాక్షుడు.



# మనిలా వెళ్ళేముందు విజయలక్ష్మితో ఇంటర్వ్యూ



మోహన్‌కుమార్

నర్తకిగా, నటిగా చక్కని పేరు సంపాయించుకుంటున్న తరుణంలో ఎల్. విజయలక్ష్మి గత ఏప్రిల్ 20న కలకత్తాలో శ్రీ సుర్జిత్ కె. దత్తాను వివాహం చేసుకున్న సంగతి మీకు తెలుసు. శ్రీ దత్తా మనిలా (ఫిలిప్పైన్స్)లో అగ్రికల్చర్ సైంటిస్ట్‌గా పని చేస్తున్నారు: ఆయనను వివాహమాడిన తర్వాత విజయలక్ష్మి దత్తా అయింది. ఎల్ విజయలక్ష్మి పెళ్లి ఆయిన వెంటనే సినిమాల్లో విరమించుకొని భర్తతో కాపురానికి వెళ్ళాలని నిర్ణయించుకున్నది. అందుచేత యీ నాలుగు మాసాలకాలంలోను తను నటిస్తున్న చిత్రాలన్నిటినీ పూర్తిచేసి ఆగస్టు 30న మద్రాసు విడిచి వెళ్ళిందామె. '30న కలకత్తా వెళ్ళి ఆ రోజు అక్కడ వుండి మా అత్త మామల్ని చూసి 31న మనిలాకు వెళ్తాను' అన్నది విజయలక్ష్మి, కలకత్తాకు బయల్దేరే ముందు రోజు—నాతో.

'శ్రీ దత్తా మిమ్మల్ని కలకత్తాలో కలుసుకుంటారా?' అని అడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతూ 'లేదు ఆయన మనిలాలో వున్నారు అక్కడే కలుసుకొంటాం' అన్నది 'మనిలాలోనేనా మీరు వుండటం?' 'మనిలా అంటే సరిగ్గా మనిలా కాదు. అక్కడికి 30 మైళ్ల దూరంలో వున్న లాస్‌బోనస్‌లో మావారు పనిచేసే ఇన్‌స్టిట్యూట్ అక్కడే వుంది. అంచేత మేము లాప్ బోనస్‌లో వుంటాము.'

## సౌతిండియన్స్ ఎవరూ లేరు!

'అక్కడ మనవాళ్లెవరైనా వున్నారా?' అని అడిగినప్పుడు ఆమె కొంత దిగాలు పడినట్లు కనిపించి మెల్లగా యిలా అన్నది: 'మేము వుండేచోట సౌతిండియన్స్ ఎవరూ లేరు. ఇండియన్స్ అయినా రెండు సర్దార్‌జీ కుటుంబాలున్నాయి. మన దక్షిణాది భాషలు వచ్చినవారూ లేరు. మావారికి తెలుగు, తమిళం, మలయాళం తెలీవు, ఆయన మాతృభాష బెంగాలీ. అది నాకు వచ్చును గాని అంత ధారాళంగా మాట్లాడలేను. మేము ఎక్కువగా ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటాం.' 'మీవారు యింటలేనపుడు పొద్దుపోవటం కష్టమే!' 'అందుకే నా స్టేజ్ (డాన్స్) పెర్ఫార్మెన్స్ అంతా టేప్ చేయించి కూడా తీసుకువెళ్తున్నాను. చిన్నప్పట్నించీ అభ్యసించిన విద్య మరచిపోకుండా వుండేందుకు ప్రాక్టీసుకీ, అక్కడ ఎవరైనా నన్ను నృత్యప్రదర్శనలు యివ్వమని కోరినపుడూ అది ఉపయోగపడుతుంది' అన్నదామె నవ్వి.

1960 లో 'సిపాయి కూతురు' చిత్రం ద్వారా సినిమారంగానికి ప్రవేశించిన విజయలక్ష్మి యింతవరకు తెలుగు, తమిళ, హిందీ, మలయాళ భాషల్లో సుమారు 70 చిత్రాల్లో నటించింది. ఆమె చివరిసారిగా నటించిన చిత్రం 'స్త్రీజన్మ', నర్తించిన చిత్రం 'ఉపాయంలో అపాయం' నర్తించీ, నటించిన చిత్రం: 'కాంభోజరాజుకథ', మొదటివి రెండూ విడుదలయినవి గనుక, ఆమె చివరిచిత్రం 'కాంభోజరాజుకథ' అవుతుంది.

'ఈ ఏడేళ్లలోనూ నేను పాల్గొన్న వాటిలో తెలుగు చిత్రాలు ఎక్కువ. తెలుగువారే నన్ను ఎక్కువ ఆదరించారు. వారిపట్ల నాకు ఎనలేని గౌరవాభిమానాలు ఉన్నాయి. ఎప్పుడూ ఉంటాయి. నాట్యభూమికలు నిర్వహించే నాకు— శ్రీయుతులు కె. వి రెడ్డి (జగదేక వీరుని కథ), బి.యన్. రెడ్డి (పూజాఫలం), కె కామేశ్వరరావు (నర్తనశాల) చక్కని వేషాలిచ్చి ఎంతో ప్రోత్సహించారు. ఇంతకాలం నన్నాదరించి వేషాలిచ్చిన నిర్మాతలకు, దర్శకులకు నా కృతజ్ఞత'

'ఉమ్మడి కుటుంబం నా కెంతో పేరు తీసుకొచ్చింది నిండుమనసులు విడుదలయిన తర్వాత నా అసంఖ్యాక అభిమానులనుంచి రోజూ ఉత్తరాలు వస్తున్నాయి 'మీరు మనదేశం విడిచి వెళ్లిపోవటం సినిమాల్లో మానేయటం మాకెంతో బాధగా వున్నదంటూ.' అని కొంతసేపు ఆగి విజయలక్ష్మి బరువుగానవ్వి 'తప్పదు బాధ్యత. పెళ్ళయిన తర్వాత ఆయనతో కాపురానికి వెళ్లాలి కదా!...ఇంతకాలం నాపట్ల విశేష ఆదరాభిమానాలు కనపరచిన తెలుగు ప్రేక్షకులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు అందజెయ్యండి' అన్నది.

ఇంతకాలం తనను ఆదరించిన పరిశ్రమనూ, కనిపెంచిన తల్లిదండ్రులనూ, తోడ బుట్టినవాళ్లనూ విడిచిపెట్టి విదేశానికి వెళ్లేముందు విజయలక్ష్మి దత్తా ఎంతటి బాధను అనుభవించిందో, యిక్కడి సినిమా పరిశ్రమలోని వారూ అంతటి బాధను పొందారు ఎంచేతంటే విజయలక్ష్మి ఏ నిర్మాతకీ ట్రబుల్ యివ్వని ఆర్టిస్ట్. నిర్ణీత కాలానికి సెట్ మీదకు హాజరయ్యే నటి, మంచి నర్తకి పరిశ్రమను వదలి వెళ్లిపోతున్నదనే బాధ అది. ●



'స్త్రీజన్మ'లో కృష్ణ, ఎల్ విజయలక్ష్మి



'పెళ్లంటే భయం'లో జయలలిత.

## చిత్రసమీక్ష

స్త్రీకి అనాది నుంచి అన్యాయమే జరగకపోయినా, నయవంచకుల చేతుల్లో స్త్రీ ఎప్పుడూ అబలగానే వుండిపోయింది! ఇది చలన చిత్రం గనక ఈ చిత్రంలోని 'స్త్రీ' కష్టాన్ని భరించినా సుఖాన్ని ధరిస్తుంది స్త్రీలందరికీ ఇది సాధ్యం కాదు సాక్ష్యం అవదు భంగపడిన స్త్రీలు ఎందరో ఉన్నారు వారి గతేమిటి? వారి కథేమిటి? సురేష్ కంబయిన్స్ 'స్త్రీజన్మ' ఈ ఆలోచనని రేకెత్తిస్తుంది

అది ఒక భయంకర రాత్రి ముక్కుముఖం ఎరగని ఒక అపరిచిత వ్యక్తి కల్యాణి మానాన్ని హరిస్తాడు కన్యాత్వం కోల్పోయిన కల్యాణి మానసిక సంక్షోభంతో మగ్గిపోతుంది పర్యవసానంగా ఒక పిల్లవాడు బయల్దేరాడు తనను వంచించిన పురుషునితోనే ఆమెకు వివాహమవుతుంది తాను పోగొట్టుకున్న పిల్లవాడున్న చోటికే ఆమె వస్తుంది!

'స్త్రీ'ని స్త్రీజన్మలో పరీక్షకు నిలబెడితే 'స్త్రీజన్మ'లో కృష్ణ కుమారి నటనకు కూడా ఒక పరీక్ష! సాటిలేని విధంగా తన పాత్రను పోషించింది కృష్ణ కుమారి మళ్లీ తారస్థాయినందుకోడానికి ఈ చిత్రం ఒక నిచ్చెన! కథానాయకుడు శేఖర్ పాత్రలో యన్ టి రామారావు ఇటీవలి చిత్రాలను తలదన్నే నటనని, పటిమని కనబరిచారు. కృష్ణ పాత్రోచితంగా నటించాడు అంజలీదేవి తన పాత్రకు ప్రాణంపోసింది పద్మనాభం హాస్యంలో కొత్తదనం వుంది ఇతర ముఖ్యపాత్రల్లో పద్మశ్రీ నాగయ్య, కాంతారావు, ప్రభాకరరెడ్డి, రావికొండలరావు, రాజ్‌బాబు, కె వి చలం, యల్ విజయలక్ష్మి, రాజశ్రీ, గీతాంజలి, మొదలైన అగ్రశ్రేణి తారాబలం వుంది

చలన చిత్రాల్లో సిద్ధసాధ్యాల గురించి అడక్కూడదుగాని, చివర్న రాజశ్రీ రాకకు ఒక కారణం కల్పించివుంటే బాగుండేది హాస్పిటల్‌లో సుశీల వైద్య సదుపాయం లేకుండా మరణించడంలో అర్థంలేదు. హాస్పిటల్‌లో పాత్రలతో పెరేడ్ చేయించి, గ్రూప్ ఫోటోని కల్పించడంతో చిత్రానికి ప్రత్యేకత లేకుండా చేసింది అనవసరంగా కథను పొడిగించడం కూడా జరిగింది ఇవి సవరించుకున్నట్టయితే చిత్రం మరింత ఉత్తమస్థాయిలో నిలబడివుండేది!

కథలో కొత్తదనం వుంది బరువూ బిగువూ ఉంది చివరివరకూ హాస్యమూ

# చిత్రసమీక్ష

బాగున్నది సంభాషణల నేర్పు, పాటల కూర్పు, సంగీతం చేర్పు కథకు వన్నె తెచ్చాయి కీచకవధ నృత్యనాటిక ఒక ప్రత్యేక ఆకర్షణ ఈ చిత్రం స్త్రీల సానుభూతిని బాగా సంపాదించుకుంటుంది!

చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం కె యస్ ప్రకాశరావు వహించారు రచన: సముద్రాల (జూ), సంగీతం ఘంటసాల, ఫోటోగ్రఫీ దర్శకత్వం కె. శే సి నాగేశ్వరరావు, కెమెరా యస్ వెంకటరత్నం, కళ రాజేంద్రకుమార్, కూర్పు మార్తాండ్ నృత్యం కె యస్ రెడ్డి, వెంపటి చిం. సత్యంగారు నిర్వహించారు

ఎ యస్ ఆర్ ఆంజనేయులు సమర్పించిన 'స్త్రీజన్మ' నిర్మాత డి రామానాయుడు మరో మంచి చిత్రాన్ని నిర్మించినందుకుగాను ఆంధ్రుల అభిమానాన్ని చూరగొంటారు.

—సికరాజు. ●



'జీవితబంధం'లో విజయలలిత



'పెళ్లంపేభయం'లో నాగేష్, భారతి

# చిత్రలహరి

▣ ఆగస్టు 30 న రెండు కొత్త చిత్రాలకి ప్రారంభం జరిగింది మొదటిది అజన్ ఆర్ట్సు వారిది సాంఘికం ఉదయం గం 9—30 కి పూజచేసి విజయా గార్డెన్స్‌లో పాట రికార్డింగ్‌తో ఆరంభించారు. 'హలో హలో దొరగారు, బలే హుషారుగా వున్నారు' అనే యీ పాటకు కొసరాజు రాశారు సుదర్శనం సంగీతం సమకూర్చారు ఎల్ ఆర్ ఈశ్వరి, పిఠాపురం పాడారు చిత్రంలో యిది హాస్యజంట పద్మనాభం, గీతాంజలిలమీద చిత్రీకరిస్తారు యన్ టి రామారావు, సావిత్రి, కాంచన రామ్మోహన్, నాగభూషణం, కె వి చలం, ఛాయాదేవి ముఖ్యభూమికలు పోషిస్తారు సంభాషణలు భమిడిపాటి రాధాకృష్ణ, కళ తోట వరప్రసాద్‌కర్, నిర్వహణ సి వి రాధాబాబు, కెమెరా యు రాజగోపాల్, దర్శకుడు శ్రీకాంత్, నిర్మాత ఎం అజమ్

*　　*　　*

రెండవది లక్ష్మీ ప్రసాద్ ప్రొడక్షన్స్ వారి 'నాగసుందరి కథ' జానపదం వాహినీలోని రెండవ ఫ్లోర్‌లో ఉదయం గం 10 కి ప్రారంభించారు రామ్మోహన్ ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్‌కి సంబంధించిన శ్రీ టి ఏ సూర్యారావు క్లాప్ కొట్టగా విజయా అధినేత శ్రీ బి నాగిరెడ్డి కెమెరా స్విచ్ ఆన్‌చేశారు కాంతారావు, కాంచన, చంద్రమోహన్, గీతాంజలి, ముక్కామల, బాలకృష్ణ ముఖ్యపాత్రలు నిర్వహించే యీ చిత్రానికి రచయిత పింగళి నాగేంద్రరావు, సంగీతం ఘంటసాల, కళ తోట కూర్పు. జంబులింగం, కెమెరా అన్నయ్య దర్శకుడు కమలాకర కామేశ్వరరావు, బి ఏ నిర్మాత ఎం వి సత్యం మొదటిరోజు షూటింగ్‌లో కాంతారావు, చంద్రమోహన్ పాల్గొన్నారు.

*　　*　　*

శ్రీ విజయభట్ మూవీస్‌వారి సాంఘికానికి 'సుఖదుఃఖాలు' అని పేరు పెట్టారు 'మేడంటే మేడాకాదు, గూడంటే గూడూకాదు — పదిలంగా అల్లుకున్న పొదరిల్లు మాది'—దేవులపల్లి కృష్ణశాస్త్రి రచన. కోదండపాణి సంగీత దర్శకత్వంలో యస్. పి బాలసుబ్రమణ్యం పాడిన యీ పాటను కిందటివారం శారదా స్టూడియోలో వాణిశ్రీ, చంద్రమోహన్‌లపైన చిత్రీకరించారు. జయలలిత, యస్ వి రంగారావు, హరనాథ్, రామకృష్ణ, రమణారెడ్డి, సూర్యకాంతం యితర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్న యీ చిత్రం యింతవరకు తొమ్మిదిరీళ్ళు పూర్తి అయింది సంభాషణలు: పాలగుమ్మి పద్మరాజు, కెమెరా కన్నప్ప: కూర్పు యన్ ఎస్ ప్రకాశం, దర్శకత్వం: బి యన్ మూర్తి, సహకార దర్శకుడు: కె దుర్గా నాగేశ్వరరావు, నిర్వహణ కె.

# జీవన్ టోన్

గవర్నమెంటు రిజిస్టర్డు నెం 218726 Phone No. 440206



మందు తీసుకొనక ముందు — 20 దినములు తీసికొన్న తర్వాత



40 దినములు తీసికొన్న తర్వాత



60 దినములు తీసికొన్న తర్వాత

పత్రికలలో ప్రకటనచేసిన ఔషధాలను సేవించి ఫలితాలను పొందనివారు అనేకులున్నారు. కాని జీవన్ టోన్‌ను కొనుక్కొని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్ టోన్ కేవలం వనస్పతి కొవ్వునుంచి తయారుచేయబడినది. జంతువులకొవ్వు చేరుటవల్లనే ఈ అనుకోనటువంటి బలిష్ఠతకు కారణం అని కొందరు అనుకోవటం పొరపాటు.

**జీవన్ టోన్ గుణములు:** ఎంత మంచి ఆహారము తిన్నా ఎముకలపోగవలె, బలహీనంగా ఉండేవారు కొంతమందిఉన్నారు. అట్టివారికి జీవన్ టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలి లేనివారికి మంచి జీర్ణశక్తి నిస్తుంది. ఇది బలహీనత, కాళ్లుచేతులు తేలిపోవుట, తలతిరుగుట, రక్తహీనతలను పోగొట్టి, పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపుఛాయ పొందటానికి జీవన్ టోన్‌తో టొమాటోలు తినుకొనండి. ఆరోగ్యవంతులకు కూడ జీవన్‌టోన్ మంచిది. జీవన్‌టోన్ తీసుకొన్నప్పుడు మీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం అవసరం. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది. కావలసిన బరువు, బలిష్టత చేరినవెంటనే జీవన్ టోన్ సేవించడం నిలపడం మంచిది. స్థూలకాయులు జీవన్ టోన్ తీసుకొనుట మంచిదికాదు. అట్టివారు జీవన్ టోన్ తీసుకుంటే మేము బాధ్యులం కాము. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకోనగూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి.

వెల: 454 గ్రాములు రూ. 10/-. పోస్టు చార్జీలు అదనం.

**స్కిన్ లీమ్స్** యవ్వనసౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్‌లీమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, స్ఫోటకపు మచ్చలు, వివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది. స్కిన్‌లీమ్స్ ముఖమందలి మడ్డి తొలగించిన తరువాత వాడవలయును. మీరు ఏ సోపునుగాని, పౌడరునుగాని వాడవచ్చును. స్కిన్‌లీమ్స్ ఒక కోర్సు రు. 12/-

**JOTHI HOSPITAL,** POST BOX No 1413 32. VENKATANARAYANA ROAD, MADRAS-17.

స్థానిక డాక్టరు: డాక్టర్ దామోదరం, M A I.A.D.S.

కామేశ్వరి. నిర్మాతలు: పి. ఏకాంబరేశ్వర రావు, ఎన్ ఎన్. భట్. ఆంధ్రలో చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్ వారిద్వారా విడుదల అవుతుంది.

*　　*　　*

భరణీ స్టూడియోలో కిందటి నెలలో బి. ఆర్ ఫిలిమ్స్‌వారి మ్యూజికల్ మిస్టరీ చిత్రం షూటింగు ముమ్మరంగా సాగింది రవి (కృష్ణ) ఉన్నట్టుండి మాయమయితే ఎక్కడున్నా వెతికి తీసుకొస్తానని వెళ్లిన కెప్టెన్ కృష్ణ (రామ్మోహన్) కూడా కనిపించకుండా పోయాడు. భర్త రవి, అన్నయ్య కృష్ణల జాడ ఏమయినా తెలిసిందేమోనని కనుక్కుందుకు నిర్మల (విజయ నిర్మల) జమీందారు (గుమ్మడి) గారింటికి రావటం — అక్కడ ఆరాలు అవీ తీయటం మున్నగువాటిని చిత్రీకరించారు. గుమ్మడి ఈ చిత్రంలో జమీందారుగానే గాక, మునసబుగాకూడా నటిస్తున్నారు. నాకు తెలిసినంతవరకు ఆయన ద్విపాత్రాభినయం చేయటం యిదే మొదటిసారి. రాజశ్రీకూడా యిందులో రెండు భూమికలు నిర్వహిస్తున్నది. రాజ్‌బాబు, ప్రభాకరరెడ్డి, స్వర్గీయ చదలవాడ, రావికొండలరావు, డా. శివరామకృష్ణయ్య, ఏడిద నాగేశ్వరరావు, తారాకృష్ణ, త్యాగరాజు, విజయలక్ష్మి, బేబీప్రభ, భారతి తారాగణంలో ముఖ్యులు. కథ, మాటలు: ప్రసాద్, పాటలు: ఆరుద్ర. కొసరాజు, సంగీతం: యస్. రాజేశ్వరరావు,



'ప్రయివేటుమాస్టారు'లో సుకన్య।

# చిత్రలహరి

రామలింగేశ్వరరావు, కళ: సోమనాథ్, కెమెరా: యస్. యస్. లాల్, నిర్మాత: బి. రామారావు, నిర్మాణ నిర్వహణ: 'చిత్ర' నరసింహారావు, కూర్పు, దర్శకత్వం: కె. శ్రీనివాసరావు, ఎనిమిదిరీళ్ల చిత్రం పూర్తి అయింది.

*　　*　　*

అన్నా చెల్లెళ్ల అనురాగంమీద — సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ఆడపడుచు' చిత్రం ఉన్నత ప్రమాణాల్లో నిర్మించ బడుతున్నది. బాధ్యతగల పెద్దన్నయ్య (యన్. టి రామారావు) కుటుంబ భారమంతా వహిస్తుంటే, చిన్నన్నయ్య (శోభన్ బాబు) బాధ్యతా రహితంగా ప్రవర్తించడమే గాక, భార్య (వాణిశ్రీ) మాటలువిని కుటుంబంనుండికూడ దూరమయి పోతాడు. అనేక కుటుంబాలలో జరిగే నిత్య సంఘటనలు యీ చిత్రంలో చూపబడుతున్నవి. ఆడపడుచుగా చంద్రకళ నటిస్తున్నది. మిగిలిన ముఖ్యభూమికల్లో రేలంగి, పద్మనాభం, గీతాంజలి, రాధాకుమారి ఉన్నారు. కృష్ణకుమారి, హరనాథ్ - అతిథి నటులు. స్క్రీన్ ప్లే: యల్. వి. ప్రసాద్, సంభాషణలు: కె. ప్రత్యగాత్మ, సంగీతం: టి. చలపతిరావు, కెమెరా. యం. జి సింగ్, చంద్రశేఖర్, కళ బి యన్. కృష్ణ నిర్వహణ: ఏ. పూర్ణచంద్రరావు, కూర్పు: బి. గోపాలరావు, నిర్మాత, దర్శకుడు: కె. హేమాంబరధరరావు. సగానికిపైగా తయారయిందీచిత్రం. పూర్ణావారు పంపిణీదారులు.

*　　*

ఆగస్టు 29న ఆరుద్రరాసిన 'ఎవరూ లేనిచోట, ఇదుగో చిన్నమాట—ఇంకా ఇంకా చేరువ కావాలి ఇద్దరు ఒకటై పోవాలి' అనే పాటను కోదండపాణి సంగీత దర్శకత్వంలో సుశీల, ఘంటసాల పాడగా — మధుపిక్చర్స్ వారి సాంఘికానికిగాను సౌండ్ యింజనీర్ శ్రీ వి. శివరామ్ వాహినీలోని 'ఏ' థియేటర్‌లో రికార్డ్ చేశారు. ఆ మధ్యాహ్నం కొసరాజు రాసింది—మరొక పాటకూడా, పిఠాపురం పాడగా రికార్డ్ చేశారు. నాగేశ్వరరావు, జానకి, కాంచన, కృష్ణ, రామ్మోహన్, చంద్రమోహన్, చలం, గుమ్మడి, విజయ నిర్మల, గీతాంజలి, విజయశ్రీ, కనకదుర్గ, అల్లు రామలింగయ్య ముఖ్య భూమికలు ధరిస్తున్న యీ చిత్రానికి ఆత్రేయ సంభాషణలు రాశారు. కళ: యస్. కృష్ణారావు సూరన్న, కూర్పు: ఎన్ ఎస్. ప్రకాశం. కెమెరా: సెల్వరాజ్, నిర్మాత: పి. మల్లికార్జునరావు, హైదరాబాద్‌లోని శ్రీ సారథీ స్టూడియోలో వి. మధుసూదనరావు దర్శకత్వంలో త్వరితగతిని నిర్మించ బడుతున్నది. నవయుగవారిద్వారా యీ చిత్రం ఆంధ్రలో విడుదల అవుతుంది.

*　　*　　*

# సినిమా డైరీ

● కిషోర్‌కుమార్ ఇకమీదట బెంగాలీ చిత్రాల్లో నటించాలనే నిశ్చయానికి వచ్చాడు. ప్రస్తుతం 'ఛద్మబేషి' బెంగాలీ చిత్రనిర్మాణంలో నిమగ్నుడై వున్నాడు.

● జెమినీ స్టూడియోలో చిరకాలంగా ఆపరేటివ్ కెమెరామన్‌గా వుంటున్న శ్రీ భాషా ఆగస్టు 28 రాత్రి మద్రాసులో గుండెపోటువల్ల మరణించారు.

● మధ్యప్రదేశ్‌కు చెందిన ఎం. ఎల్. ఏ. రమేష్ దూబే 'కల్‌శుభా' హిందీ చిత్రంలో ఒక ముఖ్యభూమిక ధరిస్తున్నారు.

● నటి అంజలీదేవి పెద్ద కుమారుడు చిన్నారావు ఉన్నత విద్యాభ్యాసానికి ఆగస్టు 30న అమెరికా వెళ్లారు.

● ఎల్. విజయలక్ష్మి ఆగస్టు 31న కలకత్తానుంచి ఫిలిప్పైన్స్ (మనీలాకు) వెళ్లారు.

● ఆగస్టు 31న 'స్త్రీజన్మ' సెప్టెంబరు 7న 'ఉపాయంలో అపాయం' చిత్రాలు ఆంధ్ర అంతటా విడుదల అయినవి.

డి. వి. యస్. ఫిలిమ్స్‌వారి 'ప్రయివేటు మాస్టారు' రీ రికార్డింగ్ పూర్తి అయింది. సెప్టెంబరు 14న శ్రీ ఫిలిమ్స్ ద్వారా విడుదల కాబోతున్నది సంపూర్ణ హాస్యరస భరితమయిన యీ చిత్రంలో రామ్మోహన్, కాంచన, కృష్ణ, సుకన్య, గుమ్మడి, రేలంగి అల్లు రామలింగయ్య, పుష్పకుమారి, బాల సరస్వతి, విజయలలిత, చలం, ముఖ్యపాత్రలు ధరించారు. కథ, సంభాషణలు: ముళ్ళపూడి వెంకటరమణ, సంగీతం: కె వి మహదేవన్, కళ: తోట, కెమెరా: కె. యస్. రామకృష్ణ రావు, కూర్పు: బి. గోపాల



'గొప్పవారి గోత్రాలు'లో సురేఖ

రావు, నిర్వహణ: టి. వి. యస్. శాస్త్రి, దర్శకత్వం: కె. విశ్వనాథ్ డి. యస్. పి.

* * *

మురుగా ఫిలిమ్స్‌వారి 'జీవిత బంధం' చిత్రానికి గత నెల 12 నుండి 25 వరకు గోల్డెన్ స్టూడియోలో జగత్ సింగ్ (రాజనాల) యింటి సెట్‌మీద పని జరిగింది. శోభన్‌బాబు, కాంతారావు, రాజనాల, కృష్ణకుమారి, రాజసులోచన, చలం, విజయలలిత ముఖ్యభూమికలు ధరిస్తున్నారు. కథ, మాటలు పాటలు, విద్వాన్ కణ్వశ్రీ, సంగీతం: ఘంటసాల, కూర్పు: అప్పు, కెమెరా సత్యం, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ఎం. గోపి, నిర్మాత: ఎన్. ఆర్ముగం.

—మోహన్‌కుమార్

అవీ—ఇవీ

# 'సారస' కవిసమ్మేళనం

మద్రాసులో రెండేళ్ల నుంచి సాహిత్య చర్చలూ, కవితా గోష్ఠులూ జరిపిస్తున్న 'సారస' ఇటీవల ఒక రచయితల సమ్మేళనాన్ని ఏర్పాటు చేసింది.

డా॥ పి. వి. రాజమన్నార్‌గారి అధ్యక్షతతో ఉత్తర ప్రదేశ్ గవర్నరు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు ఈ కవి సమ్మేళనాన్ని భరణి గార్డెన్సులో ఆవిష్కరించారు.

భానుమతీ రామకృష్ణ దంపతులు ఆహ్వానితులందరికీ అల్పాహార విందు చేశారు.

## ఉపన్యాసాలు

డా. పాకాల రాజమన్నారుగారి తొలి పలుకు తర్వాత, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు నేటి తెలుగు కథ సాహిత్య చరిత్రను చక్కగా విశదం చేశారు. శ్రీ పాలగుమ్మి పద్మరాజు సినిమా రంగంలో రచయిత పాత్రను సోదాహరణంగా వివరించారు. డా. గారి బాలసుందరరావుగారు గ్రంథ పచురణలో సాధకబాధకాలని స్వానుభవంగా సెలవిచ్చారు. శ్రీ ఆరుద్ర నేటి కవిత్వంలో కొత్త పోకడ లంటూ గత ఇరవయ్యేళ్లలో కవిత్వ పోకడలను కరతలామలకం చేశారు. శ్రీ ఆచార్య ఆత్రేయ పదేళ్లపాటు... ప్రసంగంలో నాటకాల్ని, రచయితల్ని దృష్టికి తెచ్చారు.

## పైలాపచ్చీసు—షాక్ ట్రీట్‌మెంటూ

ఇటీవలనే షష్ఠ్యబ్దిపూర్తి గావించుకున్న సందర్భంలో డా. బెజవాడ గోపాలరెడ్డిగారికి శ్రీ ఆరుద్ర తమ 'పైలాపచ్చీసు' కావ్యాన్ని అంకితం చేసి అందర్నీ విస్మయుల్ని గావించారు. ఇది తమకు 'షాక్ ట్రీట్‌మెంట్' అని డా. గోపాలరెడ్డిగారు అన్నారు!

## ద్వారపాలకుడయిన గోపాల్

నెల్లూరులో 'గోపాల్' అని పిలిపించుకుని, మద్రాసు ఆర్థిక మంత్రి అయినప్పుడు 'ధనపాల్' అనిపించుకుని, ఇప్పుడు ఉత్తర ప్రదేశ్‌లో 'రాజ్యపాల్'గా పేరు గాంచిన డా. గోపాలరెడ్డిగారు 'హిందీభాషకు సేనింకా ద్వార పాలుడ్ని' మాత్రమే అని—అంతర్ రాష్ట్రాల సాహిత్య రీతుల గురించి, వినిమయాన్ని గురించి మాట్లాడుతూ చమత్కరించారు.

'సారస' కృషిని ప్రశంసించి, ఉపన్యాసాలను సమీక్షిస్తూ మరో ఇరవయ్యేళ్లలో వచ్చే సాహిత్య పరిణామాల గురించి రచయితలు ఆలోచించవలసిన అవసరాన్ని వ్యక్తపరిచారు.

కార్యదర్శి శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ 'సారస' కార్యకలాపాల్ని వివరించి, వందన సమర్పణ చేశారు.

## సారస

'సారస' మద్రాసు తెలుగు రచయితలకు చక్కని సమాఖ్య. అధ్యక్షులు: డా. పి. వి. రాజమన్నారు. ఉపాధ్యక్షులు: శ్రీమతి భానుమతీ రామకృష్ణ, డా. గారి బాలసుందరరావు. కార్యదర్శులు: శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ, శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి. కోశాధిపతి: శ్రీమతి కె. రామలక్ష్మి. సభ్యులు: శ్రీయుతులు డి. వి. నరసరాజు, బి. యస్. ఆర్. కృష్ణ, కె. కుటుంబరావు, శ్రీశ్రీ, పి. గణపతిశాస్త్రి, జె. రామకృష్ణ, ఆరుద్ర, పి. మల్లికార్జునరావు, బి. పి. కామరాజు.

భరణి గార్డెన్సులో 'సాహిత్య సదనా'న్ని నిర్మించ పూనుకున్న శ్రీమతి భానుమతీ రామకృష్ణ సాహిత్యసేవ ప్రశంసనీయం.

— సి. కనకాంబరరాజు

## ఆంధ్ర సాంస్కృతిక సమితి

మైసూరు ఆంధ్ర సాంస్కృతిక సమితి ఇటీవల ఒక సాహితీ సదస్సును ఏర్పాటు చేశారు. మైసూరు విశ్వవిద్యాలయ తెలుగు భాష శాఖాధ్యక్షులు ప్రొ॥ కె. సుబ్బరామప్పగారు తెలుగు కన్నడ భాషల పరస్పర సంబంధాన్ని వివరించారు. సభకు డా. యమ్. వి. యస్ రావు గారు అధ్యక్షత వహించారు.

శ్రీమతి స్నేహలతా సుబ్బారావు ప్రార్థనగానం చేశారు. డా. రామలింగం వందన సమర్పణ చేశారు.

(ఇ. వి.)

# LITQUIZ No. 22

# Rs. 25,000

FIRST PRIZE Rs. 12,500

RUNNERS-UP (UPTO 4 ERRORS) Rs 6,500

MINIQUIZ (UPTO 2 ERRORS) Rs. 4,000

ATTRACTION Rs 1,000

FAMINE RELIEF FUND. Rs 1,000

ఆఖరు ముగింపు తేది: 21—9—67.
సొల్యూషన్ భారత్ జ్యోతిలో: 24-9-67.
ఫలితాలు భారత్ జ్యోతిలో: 8—10—67.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను. *లిట్‌క్విజ్ టిక్కీ 10సంచికలకు 2 పంపవలెను * మీ ఎంట్రీలను 20-9-67 బుధవారమునాడు కూడా పంపవచ్చును. కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను.

## లిట్‌క్విజ్ నెం. 22 అధికార ఎంట్రీఫారము

ADDRESS
**LITQUIZ No. 22, ALANKAR, BALARAM ST , BOMBAY-7(WB)**

షరా.- (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో రెండవకూపన్ కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీఫారమునకు జతపరచవలెను. M O రసీదు లేని ఎంట్రీ నిరాకరింపబడును. (4) I P.O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 22, బొంబాయి–7 వారికి చెల్లించునట్లు ఉండవలెను

| 1 | Re. 1 | |
|---|---|---|
| 1 | ART | RELIGION |
| 2 | CREATES | EXISTS |
| 3 | CREATIVE | IMITATIVE |
| 4 | CULTURAL | MENTAL |
| 5 | CURIOUS | RELIGIOUS |
| 6 | DEMOCRACY | LIBERTY |
| 7 | ENTITY | REALITY |
| 8 | EQUALITY | UNITY |
| 9 | HELPLESSNESS | HOLLOWNESS |
| 10 | HUMILITY | SINCERITY |
| 11 | IDEAL | SOUL |
| 12 | IDEALS | VALUES |
| 13 | MORALITY | PHILOSOPHY |
| 14 | PENANCE | SILENCE |
| 15 | POLITICAL | SOCIAL |
| 16 | PROGRESS | SUCCESS |
| 17 | RACES | RULES |

| 2 | Re. 1 | |
|---|---|---|
| 1 | ART | RELIGION |
| 2 | CREATES | EXISTS |
| 3 | CREATIVE | IMITATIVE |
| 4 | CULTURAL | MENTAL |
| 5 | CURIOUS | RELIGIOUS |
| 6 | DEMOCRACY | LIBERTY |
| 7 | ENTITY | REALITY |
| 8 | EQUALITY | UNITY |
| 9 | HELPLESSNESS | HOLLOWNESS |
| 10 | HUMILITY | SINCERITY |
| 11 | IDEAL | SOUL |
| 12 | IDEALS | VALUES |
| 13 | MORALITY | PHILOSOPHY |
| 14 | PENANCE | SILENCE |
| 15 | POLITICAL | SOCIAL |
| 16 | PROGRESS | SUCCESS |
| 17 | RACES | RULES |

SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE. 22

### MiniQuiz

10 Clues FREE coupon

| ART | RELIGION | IDEAL | SOUL |
|---|---|---|---|
| CREATIVE | IMITATIVE | IDEALS | VALUES |
| CURIOUS | RELIGIOUS | MORALITY | PHILOSOPHY |
| DEMOCRACY | LIBERTY | POLITICAL | SOCIAL |
| ENTITY | REALITY | RACES | RULES |

**22** (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారం ఎంట్రీ ఫీజు రు. 2/- M.O. రసీదు/ I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం. ..............................

CAPITAL LETTERS

NAME..................................................

ADDRESS..............................................

.........................................................

— ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను —

## 17 CLUES

1. It is a sad commentary on our present system of Education that **Art/Religion** has either no place or plays a very minor role in our General Education.
2. For us to question why the absolute **Creates / Exists** is as meaningless as to question why the world is as it is.
3. **We are Creative / Imitative by nature.**
4. The history of civilisation shows that even **Cultural / Mental** and moral development rests on a material basis, and presupposes economic activity and progress.
5. The more the scientists gain knowledge about the expanding universe the more they are filled with wonder and appreciation about the universe and the more **Curious / Religious** they become.
6. **Democracy / Liberty does not believe** in suppression of thought
7. What science does is to see and observe but the **Entity / Reality** remains unknown
8. The spirit of the age is in favour of **Equality / Unity,** though practice denies it almost everywhere.
9. If you will analyse your own life, you will find its utter **Helplessness / Hollowness,**
10. **Humility / Sincerity** especially is indispensable to the spiritual endeavour, and crookedness a constant obstacle.
11. Space **divides, but the Ideal / Soul** unites!
12. The essence of all existence is evolution or a constant realisation of new **Ideals / Values.**
13. If there were no thinking beings in the world, there would be no **Morality / Philosophy**
14. Sages always glorify the power of **Penance / Silence,** too difficult to be appreciated by the westerner
15. Discords, both economic and **Political / Social** can end only if the importance of ethics is recognised and practised by the people.
16. Holy men, even more than famous captains, Discoverers or inventors Show us the way to the **Progress / Success** that matters
17. No People, **No Races / Rules** remain unchanged.

గమనిక : పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకముల నుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంధకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిట్ క్విజ్ టిక్కీలో ప్రచురించబడును.

# పుస్తకాలు

## భావవీణ

రచన: శ్రీ 'అమరేంద్ర'. డెమీ 1/8 సైజు 90 పేజీలు. వెల: రు. 2—/లు. ప్రచురణ: రాధా పబ్లికేషన్స్, 4 వ— లైను, 19 వ అడ్డ రోడ్డు, బ్రాడీపేట, గుంటూరు.

ప్రబంధ కాలంలోనూ నాయకరాజుల కాలంలోనూ తెలుగు వచనం సుదీర్ఘ వాకాలతో ఆడంబరంగా నడిచింది దానికి తిన్నగా సన్నగా కాలిబాటలు తీర్చి దిద్దిన ఘనత చిన్నయసూరిది. సుబోధకమైన స్పష్టమైన మాత్రప్రాయమైన చిన్న చిన్న వాక్యాలలో— విరామ చిహ్నాల ప్రాముఖ్యతను గుర్తించి, చక్కటి నీతిబోధ చేశాడాయన.

అయితే— 'ఇవి నిప్పులు కావు. మిడుంగురుంబురువులు' వంటి వాక్యాలలో పాండితీ ప్రకర్ష ఎక్కువై, సహజత్వం సన్నగిలి, కృతకత్వం వికారం గోచరించేసరికి— శైలిలో దుర్భల్యం వెగటు పుట్టించింది.

సూరి వరవడిలోనే వీరేశలింగం పంతులు తొలి వచనం నడకలు నేర్పింది. క్రమశః ఆయన ఒహువిధాలైన అధునాతన ప్రక్రియల్లో వచనాన్ని ప్రయోగించి, విజయం సాధించాడు వారి శిష్యులే అయినా, చిలకమర్తి వారి వచన రచన అదొక దారి. సలక్షణమైన వచన రచనకు 'సాక్షి' పానుగంటి కూడా పాఠకలోకాన్ని ఆకర్షించాడు కాని, మాటలమీది మక్కువ ఎక్కువతో భావం దెబ్బ తింది.

ఆ తరవాత గొప్ప పరిణామం—

నిత్య జీవితానికి చేరువగా సహజంగా వుండే వచన శైలికోసం బయల్దేరిన ఉద్యమం. పత్రికల్లో ముట్నూరి, కథా రచనలో శివరామశాస్త్రి, విమర్శలో అనంతకృష్ణశర్మ ప్రత్యేక శైలిని ఏర్పరుచుకున్నారు. పువ్వు పూసింది. పరిణామం వికసించింది.

శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మునిమాణిక్యం, మల్లాది, కొడవటిగంటి, పద్మరాజు, నార్ల, సముద్రాల, శిరోమణి, జానకిరామ్, చలం, గోపీచంద్ వంటి పలువురు ప్రముఖులు ప్రతిభ నందుకున్నారు. రేడియో ప్రసంగాల్లో కృష్ణశాస్త్రి మల్లెపూల పందిరి వేశాడు. జీవద్భాష ప్రాశస్త్యాన్ని గురజాడ ఉద్ఘాటించాడు. 'కవుల ప్రతిభకి నిజంగా గీటురాయి కాగల వచనం వస్తున్నది. గద్యాన్ని పద్యాని కిచ్చి పెళ్లి చేద్దాం....... అన్నాడు శ్రీ శ్రీ

నిశిత పర్యావలోకనతో, అమూల్య విషయ సేకరణతో, గుణ దోష విచారణతో సాగింది 'వచనా రచనా విన్యాసాలు అనే చిన్న వ్యాసం. ఒక దొడ్డ గ్రంథం కావలసిన ఈ విషయాన్ని మూడు పుటల్లో ముగించటం అసమగ్రమే. అయితే— హాయి కొలిపే పదిహేను తంత్రులుగల 'భావవీణ'లో ఇది ఒకటి.

ఈ 'వీణ'లో తంత్రులు పాత కొత్తల మేలి కలయికను వలి కిస్తున్నాయి, ప్రాక్పశ్చిమ సాహిత్యాలను మేళవిస్తున్నాయి. దీన్నిబట్టి— 'సాహిత్యానికి హద్దులు వద్దు, మంచి ఎక్కడ వున్నా స్వీకరిద్దాం' అనే ఉదారాశయాన్ని రచయిత మనకి కలం పట్టి చూపిస్తున్నాడన్నమాట. ఇందులో ఒక్కొక్క శీర్షికా ఒక్కొక్క మచ్చుతునక :—

1. భావవీణ (గ్రంథ శీర్షిక) 2. కవుల కళ్లు 3. ఆశ్చర్యం 4. అందమే ఆనందం 5. మనం సంస్కృతి— మన సాహితి 6. సంప్రదాయం 7. ప్రాక్పశ్చిమ విమర్శా విధానాలు 8. వచనరచనా విన్యాసాలు 9 మహతి 10. కవితా మాధురి 11. 'సౌందరనందం లో సర్వోదయ సందేశం 12. కవితా! ఓ కవితా! 13. షేక్స్పియర్ విశ్వజనీనత 14. విశ్వకవి 15 జాన్ కీట్సు.

ఏ శీర్షిక ఎత్తుకున్నా గంభీరమైన శైలీ, రమణీయమైన నడకా మనల్ని మరపిస్తాయి. ప్రతీ వ్యాసంలోనూ పరిగణింప దగ్గ చక్కటి వాక్యాలు ఎన్నో పలకరిస్తాయి, మురిపిస్తాయి.

'బ్రతుకంతా వెతల మయం. అతి తొందర పనుల భయం మితిమీరిన పరువు బరువు. క్షితిలో విశ్రాంతి కరువు' (3 వ పేజీ)

'మన మంతా బుడుతలం! ఈ జగత్కార్య నిర్వహణలో చిన్నారి 'ఉడుతలం' (7 వ పేజీ)

ఒక మధుర కవికి నిర్వచనం— 'కండబలమూ గుండె బలమూ మెండుగా వున్న వినుకొండ సీమలో జన్మించి, కలకండల అచ్చులవంటి కవితలను అందిస్తూ, సాహితీ సేవలో పండిన సఫల జీవి జాషువా'

—శివకుమారి

## డాక్టరు కథ

రచన: డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి యం. బి. బి. యస్. ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ— 2 వెల: రూ. 2—25

ఇది కథకాదు. కాకనూ పోలేదు. ఎందుకంటే ఈ రచనలో చాలా చిన్న చిన్న కథ లున్నాయి. అందుచేత కథల సంపుటి అంటే అనవచ్చు. ఇది నవల కాదు. కావచ్చు కూడా. నవలలో ఒక ప్రధాన పాత్ర వున్నట్లుగానే, ఈ డాక్టరుకథలో డాక్టరు ప్రధాన పాత్ర ఆ పాత్ర చుట్టూ జరిగిన సంఘటనలు ఉన్నాయి. కనుక నవల అనవచ్చు. వైద్య శాస్త్ర వ్యాసం కాదు. వైద్య శాస్త్ర పరిజ్ఞానం— ఏ జబ్బుకు ఏ మందు వాడాలో వంటి విషయం తెలిపేదిగా వుంది. కాబట్టి దీ న్నొక వ్యాసం అని అయినా చెప్పవచ్చు. నాటకమో నాటికో కాదీ రచన. కానీ దృశ్యకావ్యం అనవచ్చు. ఎందుకంటే పాత్రలూ సంఘటనలూ కళ్ళకు కట్టినట్లున్నాయి. కష్టపడితే ఏ సంఘటన అయినా రసవత్తరంగా ప్రదర్శింప వచ్చు.

ఈ రచనను ఏ సాహితీ ప్రక్రియగా చెప్పాలన్నా కొంచెం కష్టమే! ఏ ప్రక్రియగా నయినా స్వీకరించవచ్చు. ఎటూ కాకుండా ఇది ఇలా ఏలా తయారయిందని ఆలోచిస్తే ప్రత్యక్షంగా జీవితం ప్రతిబింబించే విధంగా తయారయింది కాబట్టి ప్రక్రియాతీతంగా రూపొందింది. ఈ రచన ఒక డాక్టరు జీవితానుభవాల క్రోడీకరణ. డాక్టరు కథ ఒక డాక్టరు స్వీయ చరిత్రగా స్వీకరించవచ్చు. ఇది ఉత్తమ పురుషలో వ్రాయబడింది. ఈ రచనలోని డాక్టరు, నిజంగా డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి అని అందరూ అనుకొంటారు. కాని, 'ఇందులో పాత్రలూ సంఘటనలూ కేవలమూ కల్పితములు.' అనటం వల్ల కొందరకు ఆశాభంగం కలుగుతుంది. మరికొందరి ఆశకు ఆధారం చిక్కుతుంది.

రచనలోని డాక్టర్ వైద్యంలో ఆరితేరిన వ్యక్తి. ముఖ్యంగా ప్రసూతి వైద్యంలో, జీవితం సర్వం దరిద్ర నారాయణుల సేవలో గడిపాడు. అతనికి దయా హృదయం, దీక్ష, అధికం. రోగిని బాగు చేయటం కంటే ధనం ఆశించటం అతనికి తెలియదు. పల్లెలు రోగం రొచ్చు లేకుండ వుండాలని ప్రగాఢ కాంక్ష, వైద్య సౌకర్యం లేక దీన ప్రజ యాతన పడరాదనే కోర్కె, ఆ డాక్టర్‌లో మానవత్వం చూపుతాయి. ఈ రచన పూర్తిగా చదివింతర్వాత డాక్టర్ ఒక విశిష్ట వ్యక్తిగా పాఠకుల హృదయాలలో నిలిచిపోతాడు. ఈ రచన డాక్టర్ బ్రతుకు మలిసంజలో చేసుకొన్న వైద్య జీవిత సమీక్ష, దయా పరత, ధర్మగుణం, త్యాగశీలం, అన్నింటి కంటే మానవత గల డాక్టర్ మనసులో మిగిలిపోతాడు ఈ రచన చదివిం తర్వాత

ఈ రచనలో చిరంజీవత్వం పొందింది, ఏభై ఏళ్ళ నాటి తెలుగు పల్లె జీవితం మన ఎల్లె సీమలలో ప్రజలకు వైద్యం పై వుండే నమ్మకాలు, అపనమ్మకాలు, భయాలు, ఆందోళన బాగా తెలుస్తాయి. నాటు వైద్యం, మోటు వైద్యం, హోమియోపతి— వీటి నుంచి ప్రజలు 'ఇంగ్లీషువైద్యం వైపు మళ్ళటం— అక్కడ ఎదుర్కొన్న చిక్కులు స్పష్టంగా తెలుస్తాయి డాక్టరు చుట్టూ ఆ రోజుల్లో పోగయ్యే రోగులు, రోగి బంధువులు, వాళ్ళ వీలునామాలు, ప్లీడర్లు, కోర్టు వ్యవహారాలు, దొంగ సర్టిఫికేట్లూ, న్యాయాలయాలు— ఈ రచనలో చూడవచ్చు.

మొట్టమొదటి ప్రసూతి వైద్యం కేసూ, కోమటి యింటి వ్యవహారం, అరవై అయిదేళ్ల పేషెంట్ సుఖవ్యాధి, మర్ఫీ ఇంజెక్షన్ తీసుకునే డాక్టరు, పెళ్ళికాకుండా కాన్పుచేయించుకొన్న యువతి పాతికేళ్ళ కొడుకు పెళ్ళి— ఇలాంటివి ఎన్నో! మరుపురాని సంఘటనలు కొల్లలు.

వైద్య విషయాలు వివరంగా వ్రాస్తే అసహ్యము పుట్టే అవకాశం సాధారణంగా వుంటుంది. ఇందులో ఎన్నో— ఎన్నో విషయాలు చెప్పినా, అసహ్యం కాదు కదా ఉత్కంఠ కలుగుతుంది. రచయిత ఆ విషయాలు వ్రాయటంలో ప్రదర్శించిన తీరులో వున్న సుగుణం నిజాయితీ!

భాషా దోషాలు ఉన్నాయి. అవి పాఠకులకు చీకాకు కలిగించవు. చదువుతున్నప్పుడు సంఘటనలో లీనమయిపోయిన పాఠకులు భాషను గూర్చి ఆలోచించరు. ఈ రచనలో ఆలోచింప గూడదు. ఎందుకంటే ఈరచనలో విషయ ప్రాధాన్యంఅధికం.

రచయిత ఏ సంఘటన ఎంతవరకు చెప్పవచ్చో అంతవరకే చెప్పటం వల్లనే పాఠకులకు ఉత్సుకత

# పుస్తకాలు

పెరుగుతుంది. ఏ సంఘటనా సాగలాగినట్టు లేదు. ఏదీ కల్పనలాగా వుండదు.

అర్థ శతాబ్దం క్రిందట ప్రజల మనస్థితి సమాజ పరిస్థితి, పల్లెల రూపరేఖలు— వైద్యం పట్ల వారి కుండే నమ్మకాలు— కళ్ళకు కట్టి నట్టు ఈ రచనలో చిత్రింపబడ్డాయి. వైద్య వృత్తి ధ్యేయంగా, ధర్మయుతంగా బ్రతికిన ఒక డాక్టరు జీవితానికి వ్యాఖ్యానం వంటి ఈ రచన [illegible]దరగా చదవ దగింది

—మనోరాణి





# వేడుకిపేత

(31వ పేజీ తరువాయి)

### జవాబులు

(క) దూరం $13\frac{1}{8}$ మైళ్ళు.

* *

(చ) శకటు ప్రయాణం చేయవలసిన మార్గం ఇక్కడి బొమ్మలో చూపబడింది



బల్ల పైాద ఒక మూల గదిలో బయలు దేరి, రెండవ మూలగదిలో అంతం చేయడం అవసరం అని పాఠకులు గ్రహించే ఉంటారు

* * *

(ట) 12 గుర్రాలను అమర్చే పద్ధతి 2వ బొమ్మలో చూపబడింది. ఇందులో 4 గుర్రాలకు మాత్రమే పరస్పరం కాపుదల ఉంది అన్ని గుర్రాలకు కాపుదల ఉండేటట్లు 14 గుర్రములతో మూడు వేరువేరు రకాలుగ



అమర్చ వచ్చు వాటిని 3, 4, 5 బొమ్మలలో చూపించాను. వీటినే 90, 270 డిగ్రీల కోణములలో తిప్పడం చేతనూ, అద్దంలో ప్రతిఫలించేటట్లు చేయడం







చేతనూ, ఒక్కొక్క బొమ్మను మరో ఏడు రకాలుగా చూపవచ్చును గాని, వాటిని వేరుగా పరిగణించరు.

* * *

(త) (i) $111-11=100$

(ii) $33\times3+3/3=100$

(iii) $5\times5\times5-5\times5=100$

లేక $(5+5+5+5)\times5=100$

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA



# తీయటి మాట

మృదువైన తీయటి మాటలను ప్రేమించుచూ
గుసగుస లాడు సమయమున వచ్చెడి
దుర్గంధ నాశనమునకు బినాకా యందలి
క్లోరోఫిల్ అభయ మిచ్చుచున్నది
తదుపరి సంభాషణంతయు తీయగనే యుండును




CIBA